సెక్షన్లు.

9. రయితును వెడలఁగొట్టుటకు భూస్వామికి హక్కు.
10. అనుభవపు హక్కు వంశపారంపర్యముగా పొందఁదగినదిగాను ట్రాన్స్ఫరు చేయఁదగినదిగాను ఉండును.
11. రయితు భూమిని ఉపయోగించుకొనుట.
12. చెట్లను ఉపయోగించుకొనుటకు హక్కు.
13. అభివృద్ధిచేయుటకు అనుభవపు హక్కుగల రైతుకుండు హక్కు.
14. అభివృద్ధిపనులు చేయుటకు అనుభవపు హక్కులేని రయితుకుండు హక్కు.
15. అభివృద్ధిపనికి సంబంధించిన విషయములను తీర్మానించుటకు కలెక్టరుకుఁగల అధికారము.
16. భూస్వామిచేసిన అభివృద్ధి పనులను రిజిస్టరుచేయుట.
17. అభివృద్ధిపనివిషయమై సాక్ష్యమును రెకార్డుచేయుటకై దరఖాస్తు.
18. సాధారణముగా వ్యవసాయము చేయునప్పుడు చేసెడి యభివృద్ధి పనులవిషయములో మినహాయింపు.
19. రయితులకును భూస్వాములకును వారి పాయకారీ రయితులతోఁగల సంబంధములు.
20. సముదాయపు భూములు ఒకరికి ఇయ్యఁగూడదు.
చెఱువు గర్భముల విషయములో మినహాయిరపు.
21. సముదాయపు భూములను విధులకు విరుద్ధముగా అధీనమందు కలిగి యుండువారిని తొలఁగించుట.
22. భూమి ఆక్రమణ ఆక్టుయొక్క నిబంధనలు 20–వ, 21–వ సెక్షన్ల ననుసరించిన ఉత్తరువులకు ప్రయోగించుట.
23. రయితీ భూమివిషయములో ఊహ.

సెక్షన్లు.

## 3 వ అధ్యాయము.

రయితు చెల్లించవలసిన పన్నుయొక్క రేట్లగురించి సామాన్య నిబంధనలు.

24. పన్ను హెచ్చించుటను మట్టుచేయుట.
25. ఆక్టు ప్రారంభమైన తర్వాత రయితీ భూమిని స్వాధీనము చేసి నప్పుడు, చెల్లింపవలసిన పన్ను.
    (ప్రీమియము) బహుమానము పుచ్చుకొనువిషయమై మినహాయింపు.
26. బంజరు భూమిని సాగుబడికి తెచ్చునిమిత్తమైగాని అధీనభూమి మీాఁద అభివృద్ధిని చేయునిమిత్తమైగాని మొదట తక్కువ రేటున నిర్ణయింపఁబడిన పన్నును హెచ్చించుట.
27. పన్ను మొత్తమును గుఱించియు, అధీనభూమియొక్క వరతులను గుఱించియు ఊహ.
28. పన్ను రేటు సరియైనదని ఊహించుట.
29. వారము రేట్లు హెచ్చింపఁదగి యుండవు.
30. వ్యాజ్యెము మూలముగా పన్నును హెచ్చించుట.
31. ధరలు హెచ్చిన కారణమున పన్ను హెచ్చు చేయుటను గుఱించి విధులు.
32. భూస్వామి చేసిన అభివృద్ధిపని కారణమున పన్ను హెచ్చు చేయుటనుగుఱించి విధులు.
33. గవర్న్మెంటువారు చేసిన అభివృద్ధిపని కారణమున పన్ను హెచ్చుచేయుటనుగుఱించి విధులు.
34. ప్రవాహాదుల పాఱుదలకారణమున పన్ను హెచ్చుచేయుటను గుఱించి విధులు.

సెక్షన్లు.

అనుభవపు హక్కు లేని రయితులు.

46. శాశ్వతపు అనుభవపు హక్కు ఇచ్చుటకుఁగాను చర్య.

47. పాఁత బంజరుగఁ రయితుకు పన్ను హెచ్చింపఁబడిన విషయమునుగుఱించిన నోటీసును అందఁజేయుట.

48. (1) హెచ్చింపఁబడిన పన్నును చెల్లించుటకు రయితు ఇష్టమును తెలుపునపుడు చర్య.

(2) రయితు అట్లు తెలుపక తప్పిపోయినపుడు చర్య.

49. వెడలఁగొట్టించుటకు మనవి చేసికొనిన తర్వాత, హెచ్చింపఁబడిన పన్నును చెల్లించుటకు ఇష్టమున్నదని రయితు తెలిపినపుడు లేక తెలుపక తప్పిపోయినపుడు చర్య.

---

## 4 వ అధ్యాయము.

### పట్టాలును ముచ్చిలికాలును.

50. (1) అధ్యాయము ఏ రైతులకు ప్రయోగించునో ఆ రైతులు.

(2) పట్టా ముచ్చిలికాలను పొందుటకు రయితుకును భూస్వామికిని గల హక్కు.

51. పట్టా ముచ్చిలికాలలోని విషయములు.

52. పట్టాలును ముచ్చిలికాలును మార్చుకొనఁగూడిన కాలపరిమాణము.

53. పట్టాను టెండరుచేసిననే, అధీనభూమిని జప్తుచేయుటకును, విక్రయించుటకును, భూస్వామికి హక్కు కలదనుట.

54. పట్టాను ఎట్లు టెండరు చేయవలయును.

---

5 వ అధ్యాయము.

పన్ను చెల్లించుటయు పన్ను బాకీలును.



పన్నును ధరావతు ఉంచుట.

సెక్షన్లు.

70. ధరావతు తీసికొన్నట్లు ప్రకటన.

71. ధరావతును చెల్లించుట లేక మరల వాపసుచేయుట.

72. వ్యాజ్యెములు తెచ్చుటను ఆటంకపర్చుట.

మహానూలును మదింపువేయుటయు పంపకము చేయుటయు.

73. పంటయొక్క స్వాధీనమునుగుఱించి హక్కులును జవాబుదారీలును.

74. మహానూలును మదింపు వేయుటకుఁగాను లేక పంపకము చేయుటకుఁగాను లేక తీర్మానించుటకుఁగాను కలెక్టరుకు దరఖాస్తు పెట్టుకొనుట.

75. అట్టి దరఖాస్తుపైని చర్య.

76. ప్రవేశించుటకుఁ గల అధికారము.

---

## 6 వ అధ్యాయము.

### పన్నును వ్యాజ్యెముచేసిగాని చరాస్తిని లేక అధీన భూమిని జప్తుచేసి విక్రయించిగాని రాఁబట్టుకొనుట.

77. బాకీలను వ్యాజ్యెముచేసిగాని జప్తుచేసిగాని రాఁబట్టుకొనుట.

78. జప్తు ఎట్లు చేయవలయును.

79. బాకీకి జప్తు తగినంతదిగా నుండవలెను; సొత్తుజాబితాను ఖామందుకు ఇచ్చి నకలును విక్రయించు ఆఫీసరునకు పంపవలెను.

80. జప్తుదారుఁడు పోలీసు సాయమును పొందవచ్చును.

81. జప్తు బాకీకి తగినంతదిగా ఉండవలయును.

82. జప్తువేళ.

83. మహానూలును కోసి భద్రముచేయుటకు హక్కు.

సెక్షన్లు.



రయితుయొక్క ఆధీనభూమిని విక్రయించుట.

---

సెక్షన్లు.

## 7 వ అధ్యాయము.

(ఇరిగేషన్) నీరుపారుదల (వొర్కులను) పనులను మరమ్మతుచేయుట.



---

## 8 వ అధ్యాయము.

చట్టమునకు విరుద్ధమయిన సెస్సులు.



---

## 9 వ అధ్యాయము.

అధీన భూములను ఎస్టేట్లను ఉపభాగములు చేయుటయు, ట్రాన్స్ఫరు చేయుటయు.

సెక్షన్లు.

147. నోటీసు యిచ్చుటకుముందు ట్రాన్స్ఫరు చేసినవానికిఁగాని తోడిభాగస్థునికిగాని విరుద్ధముగా జరుపఁబడు చర్యలు, ట్రాన్స్ఫరు చేసికొనువానికి లేక తోడిభాగస్థునికి విరుద్ధముగా చెల్లుబడి కలిగి ప్రయోజనకరముగ నుండవలయును.

148. భూస్వామియును ట్రాన్స్ఫరు చేసికొనువాఁడును లేక తోడిభాగస్థుఁడును ట్రాన్స్ఫరును లేక విభాగమును గురించి నోటీసు ఇచ్చుట.

---

## 10 వ అధ్యాయము.

### వసులుకానులయము (ఇజెక్టుమెంటు) వెడలఁగొట్టుటకును

149. రయితులు అధీన భూమిని వదలుకొనుట.

150. నోటీసు జారీచేయుటకై రెవిన్యూ ఆఫీసరునకు దరఖాస్తు పెట్టుకొనుట.

151. (ఇజెక్టుమెంటు) వెడలఁగొట్టుటకు వ్యాజ్యెము.

152. నష్టము బాగుచేయఁదగినపుడు, లేక ద్రవ్యరూపమగు ప్రతీకారము తగుమైన పరిహారముగా నుండునపుడు, డిక్రీ.

153. అనుభవపు హక్కు లేని రయితును ఏ కారణములనుబట్టి వెడలఁగొట్టవచ్చును

154. అనుభవపు హక్కులేని రయితు చేసిన అభివృద్ధికి ప్రతీకారము.

155. పంటవిషయములోను విత్తుటకు తయారుచేయబడిన భూమివిషయములోను వెడలఁగొట్టఁబడిన రయితునకుఁగల హక్కు.

156. పై సెక్షను ననుసరించి భూమిని అనుభవించుటకుఁగాను పైరు పైకము చెల్లించుట.

157. వాఁత బంజరుయొక్క పాయకారీ రయితును వెడలఁగొట్టుట

158. పాయకారీరయితును కలెక్టరు వారంటునుఁబట్టి (స్వాధీనపఱచి గుంట) తొలఁగించుట.

159 వారంటులోని విషయములు.

11 వ అధ్యాయము

సర్వే, హక్కుల రెకార్డు, పన్నుల సెటిల్మెంటు.

---

12 వ అధ్యాయము.

భూస్వామియొక్క సొంతభూమి.



---

13 వ అధ్యాయము.

కట్టడములకొఱకును ఇతర కార్యములకొఱకును భూస్వామి భూమిని సంపాదించుట.



---

సెక్షన్లు.

## 14 వ అధ్యాయము.

(కాంట్రాక్టు) కరారు.



---

## 15 వ అధ్యాయము.

(జూరిస్డిక్షను విచారణాధికారపు హద్దును. పర్యాయము.

# MADRAS ACT No. I OF 1908.

## 1908 వ సంవత్సరపు మదరాసు 1 వ ఆక్టు.

## AN ACT TO DECLARE AND AMEND THE LAW RELATING TO THE HOLDING OF LAND IN ESTATES IN THE PRESIDENCY OF MADRAS.

మదరాసు ప్రెసిడెన్సిలోని యెస్టేట్లలో భూమిని కలిగి యుండుటను గుఱించి యున్న చట్టమును నిర్ణయించి సవరించుటకైన యాక్టు.

పీఠిక. మదరాసు ప్రెసిడెన్సిలోని యెస్టేట్లలో భూమిని కలిగి యుండుటను గుఱించి యున్న చట్టమును సవరించి నిర్ణయించుట యుక్తముగా నున్నందున, ఇందు మూలముగ నీక్రిందివిధమున విధింపబడుచున్నది:—

### 1 టి అధ్యాయము.

### ప్రథమాంశములు.

సంగ్రహనామము. 1. ఈ యాక్టును 1908 వ సంవత్సరపు మదరాసు ఎస్టేట్ల భూమి ఆక్టు అని చెప్పవచ్చును:

ప్రారంభము. ఇది 1908-వ సంవత్సరము జూలై మొదటి తేదిని అములులోనికి వచ్చును:

ప్రదేశవ్యాప్తి. మఱియు నిది, మదరాసు పట్టణమునకును మలబారు డిస్ట్రిక్టునకును సౌత్ ఈస్టు వైనాడ్ అని చెప్పబడు నీలగిరి డిస్ట్రిక్టులోని భాగమునకును తప్ప, మదరాసు ప్రెసిడెన్సికి యావత్తుకు ప్రయోగపడును.

2. 1865 వ సంవత్సరపు 8 వ మదరాసు ఆక్టు, 1871 వ సంవత్సరపు 2 వ మదరాసు ఆక్టు, 1890 వ సంవత్సరపు 3 వ మదరాసు ఆక్టుయొక్క 7 వ సెక్షను, ఇందుమూలముగ రద్దుచేయఁబడినవి.

రద్దు.

నిర్వచనములు.

3. విషయమందుఁగాని పూర్వోత్తర సందర్భమందుఁగాని విరుద్ధమైన దేదయిన నుండిననే తప్ప, యీ యాక్టులో:—

"వ్యవసాయము."

(1) "వ్యవసాయము" అను మాటలోను, దాని వ్యాకరణ నిష్పన్నములైన మాటలలోను, తత్సంబంధములైన మాటలలోను, తోఁటపని చేరును.

"ఎస్టేటు."

(2) "ఎస్టేటు" అనుమాటకు,—

"ఎస్టేటు".

(*a*) శాశ్వతముగ ఫైసలాయతి చేయఁబడ్డ యే యెస్టేటు అయినను లేక హాంగామీగా ఫైసలాయతి చేయఁబడ్డ జమీాందారి అయినను, అనియును;

(*b*) అట్లు శాశ్వతముగ ఫైసలాయతి చేయఁబడ్డ యెస్టేటులోని లేక హాంగామీగా ఫైసలాయతి చేయఁబడ్డ జమీాందారిలోని యేభాగము కలెక్టరు కచ్చేరిలో ప్రత్యేకముగా రిజిస్టరు చేయఁబడియున్నదో అట్టి యే భాగమైనను, అనియును;

(*c*) ఫైసలాయతి కానట్టి యే పాళె మయినను లేక జాగీ రయినను, అనియును;

(*d*) ఏగ్రామము విషయములో దాని కుడివారమునకు స్వాను దారుఁడు కాకుండునట్టి యే మనుష్యునికైన భూమిశిస్తు మాత్రమే యినాముగా ఇయ్యఁబడి, అది బ్రిటిష్

గవర్నమెంటువారిచే అట్లు ఇయ్యఁబడిగాని లేక అట్లు ఇచ్చినది కాయపఱుపఁబడిగాని అంగీకరింపఁబడిగాని ఉన్నదో అట్టి యే గ్రామ మయినను లేక అట్టి గ్రామముయొక్క ప్రత్యేకించిన భాగ మేదయినను అనియును;

(e) శాశ్వతమైన లోగుత్తకు ఉంచుకొనఁబడ్డదై, పైని (a), (b), (c) క్లాజులలో వివరింపఁబడిన యెస్టేట్లలో దేనిలో నైనను ఉండునట్టి ఒక్క గ్రామముగాని అనేక గ్రామములుగాని చేరినట్టి యే భాగము అయినను, అనియును;

అర్థము.

(3) "(హోల్డింగు) అధీనభూమి" అనఁగా, ఒకే గ్రామములో ఒకే పట్టాను బట్టిగాని కరారును బట్టిగాని రయితు ఉంచుకొనియుండు భూఖండము లేక భూఖండములు అని అర్థము.

"(హోల్డింగు) అధీనభూమి."

అయినను, భూస్వామియును రయితును వ్రాఁతమూలముగా సమ్మతించినయెడల, పైని నిర్వచించిన ట్లుండెడి యధీన భూమియొక్క యే భాగమునయినను ప్రత్యేకమైన అధీనభూమిగా ఎంచ నగును.

(4) (ఇంపూవ్మెంటు) "అభివృద్ధిపని" అనుమాట రయితుయొక్క అధీనభూమి విషయములో ప్రయోగింపఁబడినప్పుడు, ఆ యధీన భూమియొక్క కిమ్మతును విశేషించి యెక్కువ చేయునట్టియు, ఆ యధీనభూమికి తగియుండి దాని సహజస్థితికి అనుగుణమై యుండునట్టియు, ఆ యధీనభూమిమీఁద చేయఁబడనప్పటికిని ప్రత్యక్షముగా దాని లాభముకొఱకై చేయఁబడునట్టియు, లేక చేసినతర్వాత దానికి ప్రత్యక్షముగా లాభకరమయినట్టియు ఏదైన (వొర్కు) పని అని అర్థము. ముందు చెప్పిన నిబంధనలకు లోనయి ఈక్రింద చెప్పఁబడునవి "అభివృద్ధి" పనులు అనుమాటలో చేరును:—

"అభివృద్ధి పని".

(a) చెఱువులు, బావులు, నీటికాలువలు, వ్యవసాయ కార్యములకొఱకు నీటిని చేర్చిపెట్టుటకుఁగాని సరఫరా చేయుటకుఁగాని పాఱించుటకుఁగాని అయినట్టి తక్కిన వోర్కులు,- వీనిని నిర్మించుట;

(b) భూమిలో నీరు నిలువకుండ వడియఁగొట్టుటకు, లేక వఱదలవలన లేక కోసికొని పోవుటవలన లేక నీటిచే కలిగెడి వేఱె నష్టివలన అపాయము లేకుండ దానిని కాపాడుటకు, వోర్కులను నిర్మించుట ;

(c) భూమిని వ్యవసాయయోగ్యముగా చేయుట, చెట్టుపుట్ట మొదలయినవి తీసి బాగుచేయుట, వెలుగువేయుట, మట్టముచేయుట లేక గనిమలు ఏర్పఱుచుట, భూమిని నీటిపాఱుదలకు సిద్ధముచేయుట;

(d) అధీన భూమిమీఁదనైనను దానికి అత్యంత సమీపమునం దయినను, గ్రామ కంఠములో కాకుండ వేఱె స్థలములో అధీన భూమిని అనుకూలముగాఁగాని లాభకరముగాఁగాని ఉపయోగించుటకు లేక అనుభవించుకొనుటకు కావలసి యుండు కట్టడములను కట్టుట ; రయితుకును అతని కుటుంబమునకును నౌకర్లకును ఇండ్లు కట్టుట ;

(e) పై వోర్కులలో వేనినైన మరల క్రొత్తగా కట్టించుట, పునర్నిర్మాణము చేయుట, లేక వానిలో మార్పులు చేయుట, లేక వానికి మఱికొన్ని జాస్తిగా చేర్చుట ;

(f) ఫలవృక్షములను ఫలవృక్షముల తోఁపులను నాఁటుట ;

అయినను, భూస్వామియొక్క వ్రాఁతమూలమైన అనుమతితో చేయఁబడిననే తప్ప, దానిలో భూస్వామియొక్క వేఱె యే భూమికైనను ప్రతికూలముగా నుండునట్టి యే వోర్కుగాని చేరదు.

"(లాండ్ హోల్డరు) భూస్వామి."

(5) "(లాండ్ హోల్డరు) భూస్వాము" అనుమాటకు, ఒక యెస్టేటుకుఁగాని దానిలో కొంతభాగమునకుఁగాని స్వామిదారుఁడై యుండువాఁడు అని అర్థము ; మఱియు దానిలో ఆ యెస్టేటు అంతటియొక్కగాని యేదేని భాగముయొక్కగాని పన్నులను స్వామిదారుని నుండియైనను అతనికి పూర్వమున్న హక్కుదారుని నుండియయినను ఏదేని ట్రాన్స్ఫరు పొందుటను బట్టి యయినను, తగిన కోర్టువారు చేసిన యే యుత్తరువును బట్టియయినను, చట్టపు సంబంధమైన యే నిబంధనను బట్టియయినను, వసూలుచేయుటకు అర్హుఁడై యుండు ప్రతిమనుష్యుఁడు చేరును.

ఇద్దఱు లేక యెక్కువమంది మనుష్యులలో ఈ యాక్టు కార్యముల కన్నిటికినిగాని వానిలో వేనికైనను గాని తమలో ఎవరు భూస్వామి అనుటను గుఱించిగాని, లేక ఇద్దఱు లేక యెక్కువమంది ఉమ్మడి భూస్వాములలో ఎవరు ఈ యాక్టునుబట్టి అట్టి భూస్వామిగా వర్తించుటకును అట్లు గ్రహింపబడుటకును అర్హుఁడగునో ఆ విషయమును గుఱించిగాని, వివాదము కలుగు నెడల, అట్టి కార్యములకుఁగాను ఏ మనుష్యుని భూస్వామిగా ఎన్నవలయు ననఁగా, కలెక్టరు, తగిన సివిల్ కోర్టువారియొక్క యే డిక్రీకైనను ఉత్తరువుకైనను లోఁబడి యీ విషయమును గుఱించి లోకల్ గవర్న్మెంటువారిచే ఏర్పఱుపఁబడు విధులప్రకారము అట్టి భూస్వామిగా అంగీకరించునట్టిగాని నేమించునట్టిగాని మనుష్యుని భూస్వామిగా ఎన్నవలయును.

"అనుభవపు హక్కుగల రయితు."

(6) "అనుభవపు హక్కుగల రయితు", అనుమాటకు, తన యధీనభూమియందు శాశ్వతమగు అనుభవపు హక్కు కలిగియుండు రయితు అని అర్థము.

"పాత బంజరు."

(7) "పాత బంజరు" అనుమాటకు, ఒక యెస్టేటులో, ఖానికీ భూమిగా నుండక,

(1) భూస్వామిచే ఇయ్యఁబడినప్పుడు పది సంవత్సరముల కంటె తక్కువకాని కాలమునఱకు ఎడతెగకుండ అతనియొక్క లేక అతని పూర్వమున్న హక్కుదార్లయొక్క స్వామ్యములోను అనుభవమందును ఉండి ఆ కాలమందు ఎప్పుడుగాని సాగుబడి చేయబడకుండ ఉన్నట్టియు,(అట్టి కాలము, ఈ యాక్టు జారీకాఁబడుటకు పిమ్మటగ నున్న నుసరె, కొంతవఱకు ముందును కొంతవఱకు పిమ్మటను ఉన్ననుసరె, లేక యీ యాక్టు జారీకాఁబడుటకు పూర్వము ఇరువది సంవత్సరములకులోపల నున్ననుసరె), లేక

(2) ఈ యాక్టు జారీకాఁబడిన తర్వాత భూస్వామిచే ఇయ్యఁబడినప్పు డెప్పుడైన, అట్లు ఇయ్యఁబడుటకు చేరికగా ముందు ఎడతెగకుండ పది సంవత్సరములకంటె తక్కువకాని కాలములోఁగా ఎప్పుడుగాని అందు అనుభవపు హక్కులు ఏవియు కలిగియుండకుండ ఉన్నట్టియు,

ఏదేని భూమి అనిఅర్థము, మఱియు, ఆ మాటలో అట్టి అర్థముగూడ చేరియుండును; మఱియు ఆ మాటలో, ఈ యాక్టు జారీయగుటకు ముందు ఏ రయితీ భూమివిషయములో రయితుకు అనుభవపు హక్కు లేదని స్థిరపఱుచుచు తగిన సివిల్ కోర్టువారి ఆఖరు తీర్పును భూస్వామి పొందియుండునో అట్టి రయితీ భూమి కూడ, అట్టి డిక్రీ తేదికి తర్వాత అనుభవపు హక్కు ఏదియు పొందియుండనిచో, చేరును.

"చెల్లించుట,వగైరాలు."

(8) "చెల్లించు", "చెల్లింపఁదగిన", "చెల్లించుట" అనునవి పన్ను విషయములో ఉపయోగించినపుడు వానిలో "ఒప్పగించు", "ఒప్పగింపఁగల","ఒప్పగింత" అనుమాటలను చేరును.

"నిర్ణయింపఁబడ్డ." (9) "నిర్ణయింపఁబడ్డ" అనఁగా, లోకల్ గవర్న్మెంటువారిచే అప్పుడప్పుడు అఫిషిల్ గెజెటులో ప్రకటనద్వారా నిర్ణయింపఁబడ్డ అని అర్థము.

"ఖానిగీ భూమి." (10) "(ప్రైవేట్) ఖానిగీభూమి" అనుమాటకు, కంబత్తం, ఖాస్, సేరి, పణ్ణాయి, వీనివంటి యే పేరైనను గలిగినట్టి, భూస్వామియొక్క స్వామ్యపు నేల లేక (హోంఫారం) ఇంటిపొలమునేల అని అర్థము.

"పన్ను." (11) "పన్ను" అనుమాటకు. భూస్వామియొక్క యెస్టేటులో నున్నట్టి భూమిని వ్యవసాయము నిమిత్తము ఉపయోగించుకొనుటకొఱకు లేక అనుభవించుకొనుటకొఱకు భూస్వామికి ద్రవ్యరూపముగఁగాని ధాన్యరూపముగఁగాని యీ రెండు రూపములుగఁగాని చట్టముప్రకారము ఏమి చెల్లింపవలయునో అట్టి దేవయినను అని అర్థము; మఱియు ఆ మాటలో, భూమియొక్క వ్యవసాయమునకయి సరఫరా చేయఁబడిన లేక పుచ్చుకోఁబడిన నీటికిఁగాను కట్టఁబడుతీర్వ భూమితాలూకు పన్నుతోడ చేర్పఁబడి యుండని సంగతిలో అట్టి నీటిని ఉపయోగించుకొన్నందులకును అనుభవించుకొన్నందులకును చెల్లింపఁ దగినది యేదియయినను, చేరును.

59 మొదలు 71 వఱకును, 77 మొదలు 131 వఱకును, 143 మొదలు 148 వఱకును, ఉండు సెక్షన్లయొక్కయు, 165, 210, 211 సెక్షన్లయొక్కయు, షెడ్యూలు (పట్టీ) యొక్కయు, కార్యములకొఱకు, పన్ను అనుమాటలో:—

(a) చట్టమునుబట్టిగాని చట్టమువలెనే చెల్లుబడి యగు ఆచారమును బట్టిగాని భూమి విషయములో రయితుగా ఉండుటనుబట్టి ఒక రయితు చెల్లింపవలసియున్న పన్ను గాక అధికముగా చెల్లింపఁదగిన (లోకల్)

ప్రదేశపు పన్ను, సెస్సు, రుసుము, లేక మొత్తము ఏదైనను. మఱియు పన్నుగా నుండిన ఎట్లో అట్లు తత్కాలమందు అములులో నుండెడి యేచట్టము ననుసరించి యయిన రాఁబట్టుకొనఁ దగియుండెడు పైకము ఏదైనను, చేరును;

(*b*) కంచెరుసుములు, మచిలీ పన్నులు, వీరినిఁగాను రయితుగా ఉండుటనుబట్టి ఒక రయితు చెల్లింపవలసి యున్న పైకములును, చేరును;

"రెవిన్యూ పాలము."

(12) "రెవిన్యూ పాలము" అనఁగా సర్వేపాలము, లేక దేనిపై నిర్ణీతమైన పన్ను చెల్లింపఁదగియున్నదో, లేక యేదివివాదము సంభవించు సందర్భములో రెవిన్యూపాలముగా కలెక్టరుచే నిర్ధారణ చేయఁబడునో అట్టి యే పాలమైనను లేక భూఖండమైనను అని అర్థము.

"రెవిన్యూ ఆఫీసరు."

(13) "రెవిన్యూ ఆఫీసరు" అనుమాటకు, ఒక కలెక్టరు అని అర్థము; మఱియు దానిలో, ఈ యాక్టు ననుసరించి యొక రెవిన్యూ ఆఫీసరు యొక్క వ్యవహారములను వేనినయినను చెలాయించుటకై వేతనముబట్టిగాని ఉద్యోగ ధర్మమునుబట్టిగాని లోకల్ గవర్న్మెంటు వారిచే నేమింపఁబడునట్టి యే మనుష్యుఁడయినను చేరును.

"రెవిన్యూ సంవత్సరము."

(14) "రెవిన్యూ సంవత్సరము" అనఁగా, జూన్ నెల 30 వ తేదితో ఆఖరగు సంవత్సరము అని యర్థము.

"రయితు."

(15) "రయితు" అనుమాటకు, వ్యవసాయముకొఱకు ఒక యెస్టేటులో సాగుబడి కాఁదగిన రయితీ భూమిని, దానికి చట్టముప్రకారము ఈయవలసియుండు పన్నును భూస్వామికి చెల్లించు షరతుమీఁద, పెట్టుకొనియుండు మనుష్యుఁడు అని అర్థము.

"రయితీ భూమి." (16) "రయితీ భూమి" అనఁగా ఒక యెస్టేటులో ఖానిగీభూమి కాకట్టి సాగుబడి కాఁదగిన భూమి అని అర్థము, కాని, దానిలో క్రిందివి చేరవు—

(a) చెఱువుల గర్భములును.

(b) కళ్లపు మిట్టలును, పశువులు నిలిచెడి స్థలములును. గ్రామకంఠములును, గ్రామస్థులందఱి ఉపయోగార్థమై ప్రత్యేకముగ ఉంపఁబడినట్టి యేదేని యెస్టేటులోని తక్కిన భూములును.

(c) నవుకరి మరతుమీఁద ఈ యాక్టు జారీయగుటకు పూర్వము ఇయ్యఁబడినయెడల పన్ను మాఫీగా లేక అనుకూలమైన పన్ను రేట్లమీఁద, లేక ఆ తేదికి తర్వాత ఇయ్యఁబడినయెడల పన్ను మాఫీగా, సదరు నవుకరి మరతుప్రకారము జరుపఁబడునంతవఱకును ఉండునట్లు ఇయ్యఁబడిన భూములును.

"సంతకము చేసిన." (17) "సంతకము చేసిన" అనుమాటకు, సంతకము చేయునట్లు భావింపఁబడెడి మనుష్యునిపేరితో స్టాంపు వేయఁబడిన అని కూడ అర్థమగును.

"తహసీల్దారు." (18) "తహసీల్దారు" అనుమాటలో, డెప్యూటి తహసీల్దారు అనుమాట కూడ చేరును.

"గ్రామము." (19) "గ్రామము" అనుమాటకు, ఒక యెస్టేటులో నుండునట్టి లేక యొక యెస్టేటుగా యేర్పడియుండునట్టి యే ప్రదేశవిస్తీర్ణము రెవిన్యూ లెక్కలలో ఒక గ్రామముగా పేర్కొనఁబడియుండి దానికి రెవిన్యూ లెక్కలు ప్రత్యేకముగా ఒక కరణముచేఁగాని యెక్కువమంది కరణములచేఁగాని ఉంపఁబడుచున్నవో, లేక అట్టి యే విస్తీర్ణము ఒక

గ్రామముగ నుండునట్లు లోకల్ గవర్న్మెంటువారివలన ఇప్పుడు అంగీకరింపఁబడియున్నదో లేక యీ యాక్టు కార్యములకై లోకల్ గవర్న్మెంటువారివలన ఇఁకముందు అంగీకరింపఁబడునో అట్టి యే ప్రదేశవిస్తీర్ణమైనను అని అర్థము, మఱియు దానిలో, దానికిచేరియుండెడి యే పల్లెగాని పల్లెలుగాని చేరును.

---

## 2 వ అధ్యాయము.

### సాధారణపు హక్కులు.

పన్ను వసూలు చేయుటకు భూస్వామికిఁ గల హక్కు.

4. ఈ యాక్టుయొక్క నిబంధనలకు లోఁబడి, రయితుయొక్క అధీనమం దుండు యావత్తు రయితీభూమి విషయములోను పన్ను వసూలుచేయుటకు భూస్వామికి హక్కు గలదు.

పన్ను, అధీనభూమిమీఁదను దాని ఫలితముమీఁదను మొదటి చార్జియై యుండును.

5. (1) రయితీభూమియొక్క పన్నును దాని విషయములో వడ్డియేదైన చేరవలసి యున్నయెడల అదియును, అధీన భూమిమీఁదనైనను అధీనభూమియొక్క ఫలితముమీఁదనైనను లేక అందలి యేభాగముమీఁదనైనను మొదటిచార్జియైయుండును; అయినను, సదరు ఫలితము కోయఁబడినయెడల, అది రయితుయొక్క సంరక్షణలోఁగాని అధీనమందుఁగాని ఉండవలెను, లేక అధీనభూమిమీఁదఁగాని కళ్లముమీఁదఁగాని ధాన్యమును నూర్చెడు స్థలమందుఁగాని లేక అట్టి మఱియొకచోటఁగాని, పొలములలోనైననుసరే ఇంటి ఆవరణమునకు లోపలనైననుసరే, ఉండవలెను.

(2) ఈ సెక్షనులో నుండునది యేదియు గవర్న్మెంటువారి హక్కును దేనినిగాని బాధించినట్లు ఎంచఁగూడదు.

రయితీభూమియందు అను భవపు హక్కు.

6. (1) ఈ యాక్టుయొక్క నిబంధనలకు లోఁబడి, ఒక భూస్వామియొక్క యెస్టేటులో నుండెడు పాతబంజరు కానట్టి రయితీభూమిని ప్రస్తుతము తన యధీనమం దుంచుకొనియుండు లేక యిఁకమీఁద సదరు భూస్వామిచే స్వాధీనమును పొందు ప్రతి రయితును తన అధీనభూమియందు శాశ్వతమైన అనుభవపు హక్కు కలిగియుండును; కాని, యీ యాక్టు ప్రారంభమగుటకు పూర్వము పాత బంజరుగా నుండునట్టి భూమి విషయములో సంపాదించి యుండఁగల శాశ్వతమైన అనుభవపు హక్కును దేనినిగాని ఈ సెక్షనులో నుండునది యేదియు బాధింపదు.

"వివరణము.—ఈ సబ్ సెక్షనుయొక్క కార్యమునకుఁగాను, రయితుగా భూమిని ఉంచుకొనియుండి, యీ యాక్టు ప్రారంభించునపుడు అట్టి భూమిని స్వాధీనమం దుంచుకొనియే యున్నట్టి ప్రతి మనుష్యుఁడును 'ప్రస్తుతమందు స్వాధీనమం దుంచుకొనియుండెడు ప్రతి రయితు' అను మాటలలో చేరును."

(2) శాశ్వతమైన అనుభవపుహక్కుగల రయితు ఉంచుకొని యుండిన భూమిని విడిచిపెట్టఁబడినపుడుగాని వదలివేయఁబడినపుడుగాని, లేక, 8 వ సెక్షనుయొక్క (1) వ సబ్ సెక్షనుక్రిందను 9 వ సెక్షనులోని మినహాయింపు క్రిందను వచ్చు సంగతులలో తప్ప, భూస్వామియొక్క స్వాధీనములోనికి వచ్చినప్పుడుగాని, అది అట్లు విడిచిపెట్టఁబడిన వదలివేయబడిన లేక స్వాధీనములోనికి వచ్చిన తేదినుండి పదిసంవత్సరముల కాలములోఁగా దానిని భూస్వామి ఏమనుష్యునకైన స్వాధీనము చేసిన యెడల, అట్లు స్వాధీనము చేయఁబడిన మనుష్యుఁడు దానియందు శాశ్వతమైన అనుభవపు హక్కు కలిగియుండును.

వివరణము.—పాఁతబంజరు కానట్టి రయితీభూమిని అనుభవించు చున్నట్టి యే మనుష్యునిపద్దనైన 45 వ సెక్షను ననుసరించి పైక మేదైనను పుచ్చుకొనినట్టి లేక రాఁబట్టుకొనినట్టి ప్రతి భూస్వామియును, ఆ పైకమునుగాని అది ఒకటికంటె ఎక్కువ వాయిదాలుగా నున్నయెడల మొదటివాయిదా పైకమునుగాని పుచ్చుకొన్న లేక రాఁబట్టుకొన్న తేదినుండి రెండు సంవత్సరములలోఁగా అట్టి మనుష్యునిమీఁద (ఇజెక్టుమెంటుకు) వెడలఁగొట్టుటకు కలెక్టరు నెదుట వ్యాజ్యము తెచ్చిననేతప్ప, అతఁడు అట్టి మనుష్యునికి తద్వారా స్వాధీనము కలుగఁజేసినట్లు గ్రహింపఁబడును.

(3) ఏ రయితునయిన అనాదిబంజరునందు చేరనిచ్చినపుడు, భూస్వామి దానిని తాను ఉభయులు ఒప్పుకొనునట్టి షరతులమీఁద విడుచుట చట్టపు సమ్మతమై యుండును; కాని అట్లు చేరనిచ్చుటవల్లనే, ఆ ప్రకారము విడిచిన భూమియందు అట్లు చేరనిచ్చిన రయితుకు శాశ్వతమైన అనుభవపు హక్కు కలుగదు: అయినను, ఎస్టేటుయొక్క బంజరు భూమియందు రయితులకు చట్టమును బట్టిగాని ఆచారమునుబట్టిగాని ఉండఁ గల ప్రత్యేకమైన హక్కులను వేనిని ఈ సబ్ సెక్షను బాధింపదు.

(4) పశువులను మేపికొనుటకయిన కరారునుబట్టి బంజరు భూమియందు చేరనిచ్చుట, భూస్వామి వాస్తవముగా అడవికిఁగాను అని సద్భావముతో నిలిపియుంచినట్టి భూమియందు వ్యవసాయసంబంధమైన పైర్లను తత్కాలమందు పెట్టుకొనుటకుఁగాను ఒక కరారునుబట్టి చేరనిచ్చుట,-వీనివల్లనే అట్లు చేరనిచ్చిన మనుష్యునికి శాశ్వతమైన అనుభవపు హక్కు కలుగదు.

"లేక, 157 వ సెక్షనువలని లాభమునకు అతనికి హక్కు కలుగఁజేయదు. అట్టి భూమి, పశువులను మేపుకొనుటకుఁగాను లేక తత్కాలమందు వ్యవసాయము చేసికొనుటకుఁగాను అట్లు గుత్తకు ఇచ్చి ఉపయోగపఱచుకొన్న కారణముచేతనే, రయితిభూమి కాఁజాలదు."

(5) భూస్వామి తన ఖాంతు నౌకర్ల ద్వారా లేక కూలివాండ్ర ద్వారా బంజరుభూమిని వ్యవసాయయోగ్యముగా చేసి యున్నప్పుడు అతఁడు అట్లు వ్యవసాయయోగ్యముగా చేసిన తర్వాత మొదటి పఘా సాగుబడిచేసిన తేదినుండి ముప్పది సంవత్సరముల కాలములో సదరు భూమి విషయములో ఏ మనుష్యుఁడుగాని శాశ్వతమైన అనుభవపుహక్కు పొందకుండునట్లు వ్రాఁతమూలమైన కరారుద్వారా ఆటంకపఱుప వచ్చును.

(6) ఇజారాదారుఁడుగా లేక పన్నుతాలూకు కౌలుదారుఁడుగా భూమిని కలిగి యున్నమనుష్యుఁడు, అట్లు దాని కలిగియుండు కాలమందు, సదరు ఇజారాలో లేక కౌలులో చేరియుండెడి యే భూమియందయినను, దాయముద్వారా లేక మరణశాసనము ద్వారా తప్ప, వేఱువిధముగ అనుభవపు హక్కును పొందనేరఁడు.

వివరణము.—భూమియందు అనుభవపుహక్కుగల మనుష్యుఁడు, తర్వాత ఆ భూమియందు భూస్వామిగా బాధ్యతే పొందుటవలనఁగాని, లేక ఆభూమిని ఇజారాకు లేక కౌలుకు పెట్టుకొనుటవలనఁగాని, సదరు అనుభవపు హక్కును పోఁగొట్టుకొనఁడు.

గనులు త్రవ్వు హక్కులను నిలుపుకొనుట.

7. రయితీభూమియొక్క స్వాధీనమును ఏ మనుష్యుని కయినను కలుగఁజేయునప్పుడు గనులు త్రవ్వు హక్కులను నిలుపుకొనుటకు భూస్వామికిఁగల యే హక్కు నయినను ఈ యాక్టులో నుండునది యేదియు బాధింపదు.

8. (1) ఈ యాక్టుయొక్క ప్రారంభమునకు ముందుగాని వెను కగాని యెప్పుడయినను అధీనభూమియందలి యే నేలవిషయములోనయినను భూస్వామికిని అనుభవపు హక్కుగల రయితుకును ఉండు యావత్తు బాధ్యతలు ట్రాన్స్ఫరువలనఁగాని ఉత్తరవారసత్వమువలనఁగాని వేఱువిధమునఁగాని ఒకనియందే చేరినప్పుడు, అట్టిమనుష్యుఁడు ఆ భూమిని రయితుగా పెట్టుకొనియుండుటకు హక్కును కలిగియుండఁడుగాని దానిని అతఁడు భూస్వామిగా పెట్టుకోవలెను; కాని యీ సబ్ సెక్షనులో నుండునది యేదియు మూఁడవ మనుష్యునికి ఎవనికైనను గల హక్కులను బాధింపదు.

అనుభవపు హక్కు ఐక్యము పుట.

(2) ఈ యాక్టుయొక్క ప్రారంభమునకు ముందుగాని వెనుక గాని యెప్పుడయినను, ఏ భూమియందైనను గల అనుభవపు హక్కు, సదరు భూమి విషయములో భూస్వామిగా ఉమ్మడి బాధ్యతగల మనుష్యునికి ట్రాన్స్ఫరు చేయబడినపుడు, అతఁడు తన ఉమ్మడి భూస్వాములకు అప్పుడప్పుడు చెల్లింపవలసిన పన్ను తాలూకు భాగములను వారికి చెల్లింపవలసినవాఁడై ఆ భూమిని పెట్టుకోవలయును; మఱియు అట్లు ట్రాన్స్ఫరు పొందినవాఁడు ఆ భూమిని మూఁడవ మనుష్యుని కెవనికయిన విడిచినయెడల, అట్టి మూఁడవ మనుష్యుఁడు ఆ భూమి విషయములో అనుభవపుహక్కు గల రయితుగా ఎన్నఁబడును.

(3) సబ్ సెక్షన్లు (1), (2) నుబట్టి అనుభవపు హక్కు ఐక్యమగుచే రయితీభూమి సొంతభూమిగా మాఱఁజాలదు.

(4) అధీనభూమియందు రయితుకుఁ గల బాధ్యతయైనది, యీ యాక్టు జారీయగుటకు పూర్వము, పన్ను బాకీకిఁగాను జరిగిన విక్రయములో కాకుండ వేఱువిధముగా, విలువ గల ప్రతి ఫలమునకు భూస్వామికి ట్రాన్స్ఫరుద్వారా చెందినట్టి లేక దాయముద్వారా చెందినట్టి సంగ

తులలో, భూస్వామి అట్టి భూమియొక్క స్వాధీనమందు యేమనుష్యునైన, తాము ఉభయులు ఒప్పుకొనునట్టి షరతులమీాద, చేరనిచ్చుటకు ఈ యాక్టు జారీయైనది మొదలు పండ్రెండు సంవత్సరముల కాలమువఱకు అతనికి హక్కు ఉండును; అట్లు చేర్పఁబడిన మనుష్యుఁడు అట్టి కాలమందు 46 వ సెక్షనుయొక్క నిబంధనలలో చెప్పియున్న ప్రయోజనమునకు అర్హుఁడు కాఁడు.

అట్టి బాధ్యతయైనది, యీ యాక్టు జారీయైనతర్వాత భూస్వామికి దాయముద్వారా చెందెడిసంగతులలో, భూస్వామి అది యే హక్కును తాను ఉత్తరవార్సు అయిన తేదినుండి పండ్రెండు సంవత్సరముల కాలమువఱకు కలిగియుండును.

మినహాయింపులు.—ఈ సెక్షనులో ఏమి చెప్పియున్నను నిమిత్తము లేకుండ, 3 వ సెక్షనుయొక్క (2) వ సబ్ సెక్షనులోని (*b*) క్లాజుకు లోఁబడినట్టి ఒక యెస్టేటులో చేరియుండెడి యే భూమియందయినను గల కుడివారపుబాధ్యత ఈ యాక్టు ప్రారంభ మగుటకు పూర్వముగాని తర్వాతఁగాని ఇనాందారుఁడు పొందియున్నపుడు లేక పొందినపుడు, అట్టి భూమి ఆ యెస్టేటుయొక్క భాగముగా నుండక నిలిచిపోవును.

రయితును వెడలఁగొట్టుటకు భూస్వామికి హక్కు.

9. భూస్వామిగా నుండుటనుబట్టి యే భూస్వామికయినను, రయితును వాని అధీన భూమినుండిగాని దానిలో నేభాగమునుండి గాని యీ యాక్టు నిబంధనల ననుసరించి తప్ప వేఱు విధముగా వెడలఁగొట్టుటకుహక్కు లేదు.

అనుభవపుహక్కు వంశపారంపర్యముగా పొందఁదగినది గాను ట్రాన్‌స్ఫరు చేయఁదగినదిగాను ఉండును.

10. (1) అనుభవపుహక్కులన్నియు వంశపారంపర్యముగా పొందఁదగి యుండును, మఱియు ఆహక్కులు విక్రయమూలముగాఁగాని దానమూలముగాఁగాని మఱియొక విధముగాఁగాని ట్రాన్‌స్ఫరు చేయఁదగి యుండును.

(2) ఒక రయితు అనుభవపుహక్కు విషయములో మరణ శాసన మేదియు వ్రాయకుండను శ్రీ చక్రవర్తిగారు తప్ప వారసు లెవరును లేకుండను చనిపోయినట్లయిన, అతని అనుభవపు హక్కు అంతమగును గాని అట్టి అనుభవపు హక్కు అతనికి ఏ భూమివిషయములో నుండెనో ఆ భూమియైనది రయితీభూమిగా నుండక నిలిచిపోదు.

రయితు భూమిని ఉపయోగించుకొనుట.

11. రయితు తన అధీనములో నుండుభూమిని, దాని కిమ్మతుకు వస్తుతః హాని కలుగఁజేయనట్టి లేక దానిని వ్యవసాయకార్యములకు అనర్హముగా చేయనట్టి యే విధముననైన నుపయోగించుకొన వచ్చును.

చెట్లను ఉపయోగించుకొనుటకు హక్కు.

12. ఆచారమునుబట్టిగాని ఈ యాక్టు జారీయగుటకు పూర్వము రయితు వ్రాతమూలముగా చేసికొన్న కరారునుబట్టిగాని భూస్వామికి గల యేవైన హక్కులకు లోఁబడి, అనుభవపు హక్కుగల ప్రతి రయితును తన అధీనభూమిలో ఇప్పు డున్నట్టి చెట్లనన్నిటిని ఉపయోగించుకొనుటకును అనుభవించుటకును మఱియు వానిని నఱికివేయుటకును హక్కు కలిగి యుండును; మఱియు ఈ యాక్టు జారీ అయిన తర్వాత రయితుచే నాటఁబడునట్టిగాని లేక అతని యధీనభూమిలో తమంతట పెరుఁగునట్టిగాని చెట్లవిషయములో, అందుకు విరుద్ధమయిన కరారు లేక ఆచారము ఏదైన నున్నప్పటికిని అతఁడు వానిని ఉపయోగించుటకును అనుభవించుటకును నఱికివేయుటకును హక్కు కలిగియుండును.

అభివృద్ధి చేయుటకు అనుభవపు హక్కు గల రయితు కుండు హక్కు.

13. (1) ఒక రయితుకు తన అధీనభూమియందు శాశ్వతమైన అనుభవపుహక్కు ఉన్న యెడల, ఆ యధీనభూమి విషయములో ఆ రయితుగాని భూస్వామిగాని తానే అభివృద్ధిపని యేదైన చేయుటకు తనకు ఇష్టముండు కారణమునుబట్టి తప్ప, ఆ యధీనభూమి విషయమున అట్టి అభివృద్ధిపని జరిగించుటలో నొకరి

నౌకరు ఆటంకపఱచుటకు ఆ రయితుకుఁగాని భూస్వామికిఁగాని తన హోదానుబట్టి హక్కు ఉండదు.

(2) రయితు భూస్వామి, వీరిద్దఱును ఒకే అభివృద్ధిపని చేయఁగోరునెడల. అట్టి అభివృద్ధిపని అదే భూస్వామిక్రింద నుండు ఇంకొక రయితుయొక్క అధీనభూమిని బాధించునప్పుడు తప్ప, అట్టి యభివృద్ధి పని చేయుటకు రయితుకు మొదటి హక్కు ఉండును; అట్లు బాధించునప్పుడు భూస్వామికి అట్టి మొదటి హక్కు ఉండును.

(3) విరుద్ధముగా నుండు వ్రాఁతగాని కరారుగాని ఏదైన నున్నప్పటికిని నిమిత్తము లేకుండ, ఒక రయితు, తానే కర్చు యావత్తు పెట్టి అభివృద్ధిపని చేసిన కారణమునుబట్టి అట్టి అభివృద్ధిపనివలన ఫలితము ఏమాత్రమైన ఎక్కువ యైనందువలనఁగాని, వేసిన పైరుయొక్క స్వభావము ఏమాత్రమైన మాఱినందువలనఁగాని, ఎక్కువ రేటు గల పన్ను చెల్లించుటకు పాత్రుఁడు కాఁడు.

అభివృద్ధిపనులు చేయుటకు అనుభవపు హక్కు లేని రయితుకుండు హక్కు.

14. అనుభవపుహక్కు లేనిరయితు, వ్యవసాయపు పనులు సహజముగా చేయునప్పుడు తన యధీనభూమిని వ్యవసాయ యోగ్యముగ చేయుటకును, చెట్టు పుట్ట మొదలయినవి తీసి బాగుచేయుటకును, వెలుగు వేయుటకును, మట్టము చేయుటకును, గనిమలు ఏర్పఱచుటకును, అడుసు తీసివేయుటకును, మఱియు సదరు అధీన భూమియొక్క నీటిపాఱుదలకయి ఒక బావిని నిర్మించి కాపాడి మరమ్మతు చేయుటకును దానితో సంబంధించిన పనుల నన్నిటిని చేయుటకును హక్కు కలిగియుండునుగాని తన యధీనభూమి విషయములో ఇతర యభివృద్ధిపని యేదియు భూస్వామియొక్క అనుమతి లేకుండ చేయుటకు హక్కుకలిగి యుండఁడు.

అభివృద్ధిపనికి సంబంధించిన విషయములను తీర్మానించుటకు కలెక్టరుకుం గల అధికారము

15. రయితుకును భూస్వామికిని,

(*a*) అభివృద్ధిపని చేయుటకుఁగలహక్కు విషయమైగాని, లేక

(*b*) ఒక పని యయినది అభివృద్ధిపనియో కాదో లేక అభివృద్ధిపనిగా ఉండునో ఉండదో అను విషయమును గుఱించిగాని,

వివాదము కలుగునెడల, కలెక్టరు, వారిలో నొకరు దరఖాస్తు పెట్టుకొన్నమీఁదట, సదరు వివాదమును తీర్చవచ్చును.

భూస్వామి చేసిన అభివృద్ధి పనులను రిజిస్టరుచేయుట.

16. (1) భూస్వామి, తాను చట్టముప్రకారము చేసినట్టిగాని, తన కర్చున చట్టముప్రకారము చేయఁబడినట్టిగాని, అట్లు చేయుటకు ఒక రయితుకు తాను సాహాయ్యము చేసినట్టిగాని, యే యభివృద్ధిపనినయినను రిజిస్టరు చేయుమని లోకల్ గవర్నమెంటువారు నేమించునట్టి రెవిన్యూ ఆఫీసరునకు దరఖాస్తు పెట్టుకొనవచ్చును.

(2) సదరు దరఖాస్తు లోకల్ గవర్నమెంటువారు విధిమూలముగా ఆజ్ఞాపించెడి నమూనాప్రకారము, సంగతులు కలిగి, ఉండవలెను : మఱియు అది, అట్లు ఆజ్ఞాపించెడి విధముగా ప్రదేశ విచారణ ద్వారాగాని వేఱువిధముగాఁగాని నిరూపింప బడవలెను.

(3) దరఖాస్తు ఎవరికి అందుచున్నదో ఆ యాఫీసరు, అది ఆ పని పూర్తియయిన తేదినుండి పండ్రెండు మాసములలోఁగా పెట్టుకోఁబడి యుండనియెడల, దానిని నిరాకరింపవచ్చును.

*అభివృద్ధిపని విషయమై సాక్ష్యమును రెకార్డు చేయుటకై దరఖాస్తు.*

17. (1) ఒక అధీనభూమి విషయములో ఈ యాక్టు జారీఅయిన తర్వాత చేయఁబడిన ఏదేని యభివృద్ధి పనినిగుఱించి సాక్ష్యమును రెకార్డుచేయవలయునని యే భూస్వామియైనను అధీనభూమి తాలూకు రయితేయైనను కోరునెడల, అతఁడు కలెక్టరునకు దరఖాస్తు పెట్టుకొనవచ్చును; అంతట సదరు కలెక్టరు, రెకార్డు చేయనగు కారణములనుబట్టి సదరు దరఖాస్తు పెట్టుకొనుటకు న్యాయమైన సబబులు లేవని తలఁచిననేతప్ప, ఇరు పార్టీలకును యెఱుకచేయఁబడు కాలమందును స్థలమందును సదరు సాక్ష్యమును రెకార్డుచేయవలెను.

(2) ఈ సెక్షనును ననుసరించి యే సంగతియైనను రెకార్డు చేయఁబడినప్పుడు, ఆ రెకార్డును, భూస్వామికిని రయితుకును లేక వారి ననుసరించి దావాచేసెడి యే మనుష్యులకయినను అటుపిమ్మట జరిగెడు ప్రతి చర్యలోను సాక్ష్యముగా అంగీకరింప నగును.

*సాధారణముగా వ్యవసాయము చేయునప్పుడు చేసెడి యభివృద్ధిపనుల విషయములో మినహాయింపు.*

18. 13 వ, 14 వ, 15 వ సెక్షన్లలో ఏమిచెప్పియున్నను నిమిత్తము లేకయే, రయితు, తాత్కాలికమైన బావులను. సేట్కాలువలను, కట్టలను, సరదడపు పనులను, ఆవరణములను, లేక యితరమైన పనులను, సాధారణముగా వ్యవసాయము చేయునప్పుడు అట్టి పనుల విషయములో చేయఁబడు చిల్లర మార్పులను లేక మరమ్మతులను చేయుటకు హక్కు కలిగియుండును; మఱియు 17 వ సెక్షనులోని నిబంధనలు అట్టి పనులకు గాని మరమ్మతులకుఁగాని ప్రయోగింపవు.

*రయితులకును భూస్వాములకును వారి పాయకారీ రయితులతోఁ గల సంబంధములు.*

19. ఈ యాక్టులో మఱియొక విధముగా ప్రత్యేకించి నిబంధింపఁబడి యున్ననేతప్ప, రయితుకును అతని పాయకారీరయితులకును లేక భూస్వామికిని అతని సొంత భూమియొక్క పాయకారీరయితుకును గల సంబంధములను, భూమియొక్క

వేఱె యే సొంతగాండ్రయొక్కవైన హక్కులను, ఈ యాక్టుయొక్క నిబంధనలు దిట్టపఱుపవు.

20. కళ్లములు, పశువులు నిలిచెడి స్థలములు, గ్రామకంఠములు, ఏ యెస్టేటులోఁగాని అందఱి గ్రామస్థుల ఉపయోగార్థమై ప్రత్యేకించి యుంపఁబడినట్టి యితర భూములు, ఇవి, లోకల్ గవర్న్మెంటువారు ఈ విషయమై చేసెడి విధులకు లోనై డిస్ట్రిక్టు కలెక్టరు యొక్క వ్రాఁతమూలమైన హుకుము లేకయే వేఱె యే యితర కార్యముకొఱకయినను ఇయ్యఁగూడదు, లేక ఉపయోగింపఁగూడదు.

సముదాయపు భూములు ఒకరికి ఇయ్యఁగూడదు.

వివరణము.—శాశ్వతపు ఫయిసలాయటికి తర్వాత భూస్వామి అట్లు ప్రత్యేకించి యుంచినట్టి యే భూమియైనను సముదాయపు పనులకు వేనికిని ఇఁకముందు అగత్యము లేదని కలెక్టరు అభిప్రాయపడునప్పుడు అది భూస్వామికి మరల చెందును.

ఈ సెక్షనులో నుండునది యేదియు, ఏ యెస్టేటులోనయిన నుండెడి చెఱువు గర్భములకు ప్రయోగపడదు, లేక వానిపైని భూస్వాములకు ఉండెడి హక్కులను బాధింపదు.

చెఱువు గర్భములవిషయము లో మినహాయింపు.

21. 20 వ సెక్షనులో ఉదాహరింపఁబడిన భూములలో దేనినిగాని సదరుభూమి యేపనికిఁగాను ప్రత్యేకించి యుంపఁబడినదో ఆ పనికి కాకుండ వేఱె యే పనికైనను, లేక లోకల్ గవర్న్మెంటు వారిచే చేయఁబడిన విధులకు విరుద్ధముగానైనను అధీనపర్చుకొనునట్టి యే మనుష్యునైనను అట్లు అధీనపర్చుకొనుటకు ప్రారంభించినది మొదలు ముప్పది

సముదాయపు భూములను విధులకు విరుద్ధముగా అధీనమందు కలిగి యుండువారిని తొలఁగించుట.

సంవత్సరములోఁగా ఎప్పుడయినను కలెక్టరు 1905 వ సంవత్సరపు మదరాసు భూమి ఆక్రమణ ఆక్టులో నిబంధించి యుండు విధమున సన్మరీగా తొలఁగింపవచ్చును; మఱియు ఆ భూములమీఁద పెట్టియుండు, కట్టియుండు, లేక వేసియుండు ఏ పైరుగాని ఫలితముగాని, కట్టడము గాని లేక వస్తువుగాని డిస్ట్రిక్టు కలెక్టరు తీర్మానించునట్టి సముదాయపు పనులకు వినియోగింపఁబడవలయును.

భూమి ఆక్రమణ ఆక్టుయొక్క నిబంధనలు 20 వ, 21 వ సెక్షన్ల ననుసరించిన ఉత్తరువుల కు ప్రయోగించుట.

22. 1905 వ సంవత్సరపు మదరాసు భూమి ఆక్రమణ ఆక్టులో 10 మొదలు 14 వఱకుండు సెక్షన్లయందలి నిబంధనలు, సాధ్యమైనంతమట్టుకు, ఈ యాక్టుయొక్క 20 వ, 21 వ సెక్షన్ల ననుసరించిన ఉత్తరవులకు ప్రయోగించును.

రయితీభూమి విషయములో ఊహ.

23. ఏ వ్యాజ్యెమందుఁగాని చర్యయందుఁగాని, ఏ భూమియైనను పాఁతబంజరయినదియు లేక పాఁతబంజరు కానట్టి రయితీభూమి అయినదియు నిర్ధారణ చేయవలసి యున్నపుడు, వేఱువిధముగా ఋజువు చేయఁబడువఱకు అది పాఁతబంజరు కానట్టి రయితీభూమి యని ఊహింపఁబడవలయును.

---

## 3 వ అధ్యాయము.

### రయితులు చెల్లింపవలసిన పన్నుయొక్క హెచ్చుతగులను గుఱించి సామాన్య నిబంధనలు.

(పన్ను) హెచ్చించుటను మట్టుచేయుట.

24. ఈ యాక్టుచే నిబంధింపఁబడినట్లు తప్ప రయితుయొక్క శిస్తును హెచ్చింపఁగూడదు.

25. ఈ యాక్టు ప్రారంభమయిన తర్వాత భూస్వాముల పాతబంజరు కాకుండ వేఱె రయితిభూమిని ఎవని స్వాధీనము చేయునో అట్టి ప్రతి రయితును, ఇరుగు పొరుగున నుండెడు అదే విధమయినట్టియు అట్టి అనుకూల్యములే కలిగినట్టియు భూములకు ఉండునట్టి రేటుకు మించని రేటు ప్రకారముగాని, లేక అట్టి రేటు తెలిసికొనుటకు సాధ్యము కానియెడల, మనవి చేసికొనినమీఁదట క్రమమయిన దనియు న్యాయమయిన దనియు కలెక్టరు తీర్మానించునట్టి రేటుప్రకారముగాని, శిస్తు చెల్లించుటకు బద్ధుఁడై యుండును.

ఆట్టి ప్రారంభమైన తర్వాత రయితీ భూమిని స్వాధీనముచేసినపుడు చెల్లింపవలసిన పన్ను.

ఈ సెక్షనులో నుండున దేదియు, (భూమిని) రయితుస్వాధీనము చేయునపుడు భూస్వామి (ప్రీమియము) బహుమానము దేనినయినను పుచ్చుకొనుటను నిషేధించదు; అట్లు స్వాధీన మియ్యఁబడిన రయితు, ఎట్టి సందర్భములయందుఁగాని, తనకు భూమి స్వాధీనమియ్యఁబడిన తర్వాత, అట్లు స్వాధీన మిచ్చినందుకు బహుమానముద్వారాగాని లేక వేఱె ప్రతిఫలము రూపముగాఁగాని పైకము నేమైన చెల్లించుటకు బద్ధుఁడు కాఁడు. మఱియును, రయితుయొక్క యే యధీనభూమిగాని, అట్టి యే బహుమానము విషయమయిగాని లేక ప్రతిఫలము విషయమయిగాని లేక దానియొక్క యే భాగము విషయమయిగాని యే చార్జికిని లోఁబఱుపఁగూడదు.

(ప్రీమియము) బహుమానము పుచ్చుకొను విషయమై మినహాయింపు.

26. (1) ఎస్టేటులోని బంజరుభూమిని చక్కఁబెట్టి సాగుబడికి లాయకగునట్లు చేయుటకుఁగా నయినను, లేక దానియందు శాశ్వతమగు అభివృద్ధిపని నేదయిన చేయుటకుఁగానయినను, లేక అధీనభూమిలో చెట్లు నాఁటుటకుఁగానయినను, లేక యీ యాక్టు ప్రారంభమగుటకు పూర్వము ఏదేని ప్రీమియమునకుఁగాని, ఋణ

బంజరు భూమిని సాగుబడికి తెచ్చునిమిత్తమైగాని అధీనభూమిమీఁద అభివృద్ధిని చేయు నిమిత్తమైగాని రొఖ్ఖము తక్కువ రేటుకు నిర్ణయింపఁబడిన పన్నును హెచ్చించుట.

ములకుఁగాని, వేఱె వెలకుఁగాని చేసికొన్న యొక కరారు ననుసరించి మైనను. రయితు, ఆ భూమికిఁగాను అంతకుపూర్వము చెల్లింపఁదగియుం డినట్టి న్యాయమయిన రేటుకన్నను లేక యిరుగుపొరుగున నుండెడు అదే విధమయినట్టియు అట్టి అనుకూల్యములే కలిగినట్టియు భూమికి న్యాయముగా చెల్లింపఁదగినట్టి రేటుకన్నను, తక్కువపన్ను రేటుకు తన భూస్వామివద్ద పట్టా పుచ్చుకొన్నప్పుడుగాని లేక అతనితో ఒడంబడిక చేసికొన్నప్పుడుగాని, అట్టి తక్కువరేటు ఏ షరతులమీఁదను ఏ కార్య ములకొఱకును ఇయ్యఁబడినదో ఆ షరతులను ఆ కార్యములను రయితు సరిగా నెరవేర్చుచుండు నంతవఱకును, అట్టి తక్కువరేటు ఎంతకాలము వఱకు కరారునుబట్టిగాని ఆచారమునుబట్టిగాని చెల్లింపవగునో అంత కాలమువఱకును, అట్టి పన్ను హెచ్చింపఁదగినదిగా ఉండదు.

(2) ఎంతకాలమువఱకు అట్టి తక్కువరేటు గల శిస్తు చెల్లింప నగునో ఆ కాలము గడచిన తర్వాత, లేక అట్టి తక్కువరేటు ఏ షరతుల మీఁదను ఏ కార్యములకొఱకును ఇయ్యఁబడినదో ఆ షరతులను ఆ కా ర్యములను సరిగా నెరవేర్చనియెడల, భూస్వామి నిండు రేటు పొందుటకు హక్కు కలిగియుండును.

(3) సబ్ సెక్షను (1) లో నిబంధించియున్న ప్రకారము తప్ప, భూస్వామి భూమిని ఏ రేటుకు పన్నుకు ఇచ్చియుండునో అట్టి రేటు ఏదయి నను, ఆ భూమికిఁగాని లేక యిరుగుపొరుగున నుండెడు అదే విధమయి నట్టియు అట్టి అనుకూల్యములే కలిగినట్టియు భూమికిఁగాని అట్లు ఇచ్చు టకు పూర్వము రయితు చెల్లింపఁదగియుండినట్టి న్యాయమైన రేటుకన్న ను తక్కువగానున్న పక్షమందు, అట్టి రేటును, సదరు భూస్వామియొక్క జీవితకాలమునకు తర్వాత సదరు పన్నును పొందుటకు అర్హుఁడగు మను ష్యుఁడు అంగీకరింపవలసిన దనెడి నిర్బంధము లేదు.

పన్ను మొత్తమును గుఱించియును, అధీనభూమియొక్క మరతులను గుఱించియును ఊహ.

27. ఏ రెవిన్యూ సంవత్సరములోఁగాని రయితు చెల్లించవలసియుండు పన్ను మొత్తమును గుఱించిగాని లేక అతఁడు ఏ మరతులకు లోఁబడి భూమినిఁ పెట్టుకొనియున్నాఁడో ఆ మరతులను గుఱించిగాని వివాదము కలుగునప్పుడు, విరుద్ధముగా ఋజువుచేయునంతవఱకు, అంతకు ముందటి రెవిన్యూ సంవత్సరమందు ఏ రేటు వంతునను ఏ మరతుల ప్రకారము కలిగియుండెనో ఆ రేటు వంతునను ఆ మరతుల ప్రకారమునే అతఁడు కలిగి యున్నట్లు ఎన్నఁబడును.

పన్ను రేటు సరియైనదని ఊహించుట.

28. ఈ యాక్టు ననుసరించి జరిపించెడి చర్యలలో నెల్ల రయితు చట్టముప్రకారము తత్కాలములో చెల్లింపవలసిన పన్నుగాని పన్ను రేటుగాని సరియైనదియు న్యాయమయినదియు కాదని ఋజువు పఱుపఁబడువఱకు అది సరియైనదనియు న్యాయమయిన దనియునే ఊహింపఁబడును.

వారము రేట్లు హెచ్చింపఁ దగియుండవు.

29. అనుభవపు హక్కుగల ఒక రయితు తన యధీనభూమిలోని యే నేలకైనను "వారము" (అనఁగా భూస్వామికిని రయితుకును పంటను పంచుకొనుటకొఱకు గ్రామముయొక్క నిర్ణీతమైన రేటు) ప్రకారము పన్నును రొక్కముతోఁగూడ చేర్చిగాని అట్లు చేర్చకుండఁగాని, లేక వేఱువిధముగా ధాన్యరూపముగాఁగాని పంటలో నొక భాగముయొక్క మదింపు వేసిన విలువనుబట్టిగాని లేక పంటనుబట్టి మాఱుచుండెడి రేట్లప్రకారముగాని, కొంతవఱకు వీనిలో నొక విధమునను కొంతవఱకు మఱియొక విధమునను లేక ఇతర విధములనుగాని చెల్లించునప్పుడు, అట్టి పన్ను హెచ్చింపఁ దగియుండదు.

30. ఏ రయితయినను తన యధీనభూమియందలి యే నేలకైన ద్రవ్యరూపమైన పన్ను చెల్లించుచున్నయెడల, భూస్వామి యీక్రిందికారణములలో ఒక దానినిబట్టిగాని ఎక్కువవానినిబట్టి గాని పన్నును హెచ్చించుటకుఁగాను కలెక్టరు నెదుట వ్యాజ్యెమును దాఖలు చేయవచ్చును. కాని, వేఱె యే కారణములనుబట్టియు దాఖలు చేయఁగూడదు—

వ్యాజ్యెము మూలముగా పన్నును హెచ్చించుట.

(i) ప్రస్తుతపు పన్నుయొక్క చెలామణీకాలములో తాలూకాలోని లేక జమీందారి డివిజనులోని ముఖ్యమయిన ఆహారపు పంట ధాన్యముల ధరలు తత్ప్రదేశమందు సగటున హెచ్చియుండుట:

(*a*) అయినను పన్ను ఒక నిర్ణీతమయిన రేటు లేక రేట్లవంతున శాశ్వతముగా చెల్లింపఁబడి యుండునెడల, ఈ క్లాజు ననుసరించి ధరలు హెచ్చినవను కారణమునుబట్టి, అది హెచ్చింపఁబడి యుండదు.

(*b*) మఱియును ఈ క్లాజు ననుసరించి హెచ్చించుటలో, భూమికిఁగాను పూర్వము చెల్లింపఁబడియుండు పన్నులో రూపాయ ఒకటింటికి రెండణాలకంటె ఎక్కువగా పన్ను హెచ్చింపఁగూడదు.

(ii) ప్రస్తుతపు పన్ను యొక్క చెలామణీకాలములో భూస్వామి చేతఁగాని అతని తగులుబడి మీఁదఁగాని చేయఁబడిన అభివృద్ధిపని మూలముగా రయితు పెట్టుకొనియున్నట్టి భూమియొక్క పంటబలము వృద్ధి యయి యుండుట:

(iii) నీటిపాఱుదలపనిగాని లేక వేఱె అభివృద్ధిపనిగాని గవర్న్మెంటువారి కర్చున చేయఁబడి యుండి ఆ కారణమువలన ఆ యధీన

భూమి విషయమయి గవర్న్మెంటువారికి ఎక్కువ రెవిన్యూగాని శేటు గాని చెల్లింపవలసినదిగా భూస్వామి న్యాయముగా కోరఁబడి యుండుట:

IV) రయితు ఉంచుకొనియున్న భూమియొక్క పంటబలము ప్రవాహాదుల పాటుదలచే వృద్ధిచెంది యుండుట.

వివరణము.—"ప్రవాహాదుల పాటుదల" అను దానిలో, ఏటిలో నుండి నీటిపాటుదల అదివఱకు సాధ్యము కాకుండి అపుడు అది సాధ్య పడునట్లు చేయునట్టి యేటిమార్గములోని యేదేని మార్పు చేరును.

ధరలు హెచ్చిన కారణమున పన్ను హెచ్చుచేయుటనుగుఱించి విధులు.

31. 30 వ సెక్షను (i) వ క్లాజును బట్టి హెచ్చుపన్ను కోరఁబడుసందర్భములో—

(*a*) కలెక్టరు, వ్యాజ్యెము దాఖలగుటకు పూర్వము మున్నుండటి పది సంవత్సరములకాలములో నుండు సగటుధరలను, వ్యాజ్యెము దాఖ లగుటకు పూర్వము మున్నుండటి యిరువది సంవత్సరములపుడు అంతమగు పది సంవత్సరముల కాలములోని సగటు ధరలతోడ పోల్చి చూడవలయును;

(*b*) (a) క్లాజులో చెప్పియున్న పదిసంవత్సరముల కాలముల గ్రహించడము కలెక్టరు అభిప్రాయములో సాధ్యము కాని పక్షమున, కలెక్టరు తన బుద్ధికి యుక్తమని తోఁచినట్లు వానికి బదులుగా అంతకంటె తక్కువకాలములను గ్రహింపవచ్చును;

(*c*) లోకల్ గవర్న్మెంటువారి యధికారముక్రింద ప్రకటింపఁబడిన సగటు ధరలే కలెక్టరు (పోల్చి చూచుటకు) ఆధారముగా నుంచుకొనవలసిన సగటుధరలుగా నుండును; మఱియు ఈ యాక్టు జారీయయినతర్వాత వచ్చెడి యే సంవత్సరమునకయినను తయారుచేయఁబడు

జాబితాలలో చూపఁబడి యుండునట్టి ధరలు సరియైనవిగా కలెక్టరు గ్రహింపవలయును; ఇదిగాక ఈ యాక్టు జారీ యగుటకు పూర్వము ఏ సంవత్సరమునకయినను తయారు చేయఁబడి యుండిన జాబితాలలో చూపఁబడి యుండునట్టి ధరలు సరియైనవి కావని రుజువుచేయఁబడిననే తప్ప, మఱియు అట్లు రుజువు చేయఁబడువఱకును, ఆ ధరలే సరియైనవని గ్రహింపవచ్చును;

(*d*) సగటుధరలను పోల్చి చూచుటకు గ్రహించిన పది సంవత్సరముల కాలములు, లోకల్ గవర్న్మెంటువారు ఏ ప్రదేశవిషయములో నైనను ఏ సంవత్సరములు కరువు సంవత్సరములుగా ఉన్నట్లు లేక ఉండి యున్నట్లు ప్రకటింతురో అట్టి యానత్తు సంవత్సరములను మినహాయించఁగా మిగిలిన పది సంవత్సరముల కాలముగా ఉండవలయును;

(*e*) పోల్చి చూచుటకై గ్రహింపఁబడినట్టి కడపటి పది సంవత్సరముల కాలములో నుండిన సగటు ధరలకును మునుపటి పది సంవత్సరముల కాలములోనుండిన సగటు ధరలకును ఏ దామాషా యున్నదో అంత దామాషానే హెచ్చుచేసిన పన్నుకును అంతకు పూర్వమున్న పన్నుకును ఉండవలయును. అయినను, ఈ దామాషాను లెక్కించి చూచుటలో, మునుపటి కాలపు సగటు ధరలకంటె వెనుకటికాలపు సగటు ధరలు ఎంత హెచ్చో ఆ హెచ్చులో సగమును తగ్గించి గణించవలయును.

భూస్వామి చేసిన అభివృద్ధి పని కారణమున పన్ను హెచ్చు చేయుటను గుఱించి విధులు

32. (1) 30 వ సెక్షను (ii) వ క్లాజునుబట్టి హెచ్చుపన్ను గోరఁబడు సందర్భములో—

(*a*) ఈ యాక్టునకు అనుగుణముగా ఆ యభివృద్ధిపని రిజిస్టరయి యుండిననే తప్ప, లేక ఈ యాక్టుయొక్క ప్రారంభమునకు

పూర్వము పదునైదు సంవత్సరములలోపల చేయఁబడియుండిననే తప్ప, కలెక్టరు పన్ను హెచ్చుకు ఆమోదింపఁగూడదు;

(b) (పన్ను) హెచ్చుయొక్క మొత్తమును నిర్ణయించుటలో కలెక్టరు—

i) ఆ యభివృద్ధిపనివలన కలిగినట్టి లేక బహుశః కలుగునట్టి పంటబలములో వృద్ధి;

(ii) ఆ యభివృద్ధిపనికి అయిన తగులుబడి;

(iii) ఆ యభివృద్ధిపనిని ఉపయోగించుకొనుటకు చేయవలయు ప్రయత్నమునకును సాగుబడికిని అగు తగులుబడి; మఱియు

(iv) ఇప్పు డున్న పన్ను, అంతకంటె ఎక్కువ పన్నును ఆ భూమిః భరింపఁగలశక్తి; వీనినిగుఱించి యోచింపవలయును.

(2) ఆ యభివృద్ధిపనివలన అంచనా వేయఁబడ్డ ఫలము కలుగని పక్షమునఁగాని కలుగుట నిలిచిపోయిన పక్షమునఁగాని, యీ సెక్షనును అనుసరించి డిక్రీ యిచ్చిన (పన్ను) హెచ్చు అయినది, రయితు అయినను అతనికి తర్వాత అతని హక్కు గలవారు అయినను దరఖాస్తు పెట్టుకొన్నమీఁదట, కలెక్టరుచే సవరణకు లోనై యుండును.

గవర్న్మెంటువారుచేసిన అభివృద్ధిపని కారణమున పన్ను హెచ్చుచేయుటనుగుఱించి విధులు.

33. 30 వ సెక్షను (iii) వ క్లాజును బట్టి హెచ్చు కోరఁబడు సందర్భములో, పన్నును, గవర్న్మెంటువారు చేసిన అభివృద్ధిపనికై వారికి భూస్వామి న్యాయముగా చెల్లింపవలసిన మొత్తమునకు లేక అట్టి మొత్తములో దామాషాభాగమునకు హెచ్చించవచ్చును.

ప్రవాహాదులపొలువల కారణముగ పన్ను హెచ్చుచేయుటను గురించి విధులు.

34. 30 వ సెక్షను (iv) క్లాజును బట్టి హెచ్చు కోరఁబడు సందర్భములో—

(*a*) కలెక్టరు, తాత్కాలికమయినదిగా మాత్రమే యుండు నట్టి లేక ఆకస్మికమయినదిగా మాత్రమే యుండినట్టి యే వృద్ధినిగాని లక్ష్యపెట్టఁగూడదు;

(*b*) కలెక్టరు, తనకు యుక్తముగను న్యాయముగను ఉండునట్లు తోఁచునట్టి మొత్తమువఱకు పన్ను హెచ్చు చేయవచ్చునుగాని భూమిలోని పంట నికరముగా ఎంత వృద్ధి యయినదో దాని కిస్తులో సగమునకంటె హెచ్చుగా భూస్వామికి చెందునట్లు చేయఁగూడదు.

పన్ను హెచ్చు యుక్తమైనదిగాను న్యాయమైనదిగాను ఉండవలయును.

35. 31 నుండి 34 వఱకుండు సెక్షన్లలో ఏమి చెప్పియున్నను సరె, ఆయాసంగతియొక్క సందర్భములను బట్టి అయుక్తముగాఁగాని అన్యాయముగాఁగాని ఉండునట్టి యే పన్ను హెచ్చుకుఁగా నయినను లేక అధీనభూమి యుండు గ్రామమందు ఏర్పడి యున్నట్టియు 40 వ సెక్షను నిబంధనల ప్రకారము రొక్కముగా మారబడియున్నట్టియు వారముయొక్క కిమ్మతుకు మించి పన్నును హెచ్చించునట్లుగా ఏర్పడునట్టి యే పన్ను హెచ్చుకుఁగానయి నను, కలెక్టరు ఏ సంగతిలోను డిక్రీ ఇయ్యఁగూడదు.

క్రమక్రమముగా (పన్ను) హెచ్చు చేయునట్లు ఉత్తరువు చేయుటకు అధికారము.

36. 30 వ సెక్షనుయొక్క (i), (ii), (iv) క్లాజుల ననుసరించి (పన్ను) హెచ్చుకుఁగాను డిక్రీ యిచ్చునట్టి కలెక్టరు ఆ డిక్రీని తత్క్షణమే పూర్ణముగా అనుభవములోనికి తెచ్చినయెడల రయితునకు సంకటము కలుగునని తలంచిన పక్షమున,

దానిని క్రమక్రమముగా హెచ్చు చేయవలయునని, అనఁగా డిక్రీ అయిన హెచ్చుయొక్క పరిమితివఱకు, అయిదు సంవత్సరములకంటె మించక యెన్ని సంవత్సరములదా కయిన ప్రతి సంవత్సరమును క్రమక్రమముగా పన్నును అధికము చేయవలయు నని అతఁడు ఉత్తరువు చేయవచ్చును.

పన్ను హెచ్చుచేయుట కయినట్టివ్యాజ్యములు వరుసగా తెచ్చుటకుఁ గల హక్కుయొక్క పరిమితి.

37. (1) ధరలు హెచ్చినవను కారణముమీఁద పన్ను హెచ్చించుటకుఁగాను తెచ్చిన వ్యాజ్యమును, దానిని దాఖలుచేయుటకు పూర్వము ఇరువది సంవత్సరములలోఁగా ఆ పన్ను ఈ యాక్టును జారీచేయక ముంతుగాని లేక జారీచేసిన వెనుకఁగాని రొక్కముగా మార్పఁబడియుండిన పక్షమున లేక హెచ్చింపఁబడియుండిన పక్షమున లేక హెచ్చించుటకుఁగాను తెచ్చిన వ్యాజ్యము దాని సారాంశములనుబట్టి కొట్టివేయఁబడి యుండిన పక్షమున, పట్టఁగూడదు.

(2) ఈ సెక్షనులో నుండున దేదియు సివిల్ ప్రొసీజరు కోడుయొక్క 373 వ సెక్షను నిబంధనలను బాధింపదు.

## పన్నును తగ్గించుట.

వ్యాజ్యము మూలముగ పన్నును తగ్గించుట.

38. (1) అనుభవపు హక్కుగల రయితు, తన అధీనభూమిలో ఏ నేలకైనను ద్రవ్యపు పన్ను చెల్లించున పుడు, అతఁడు ఈ క్రింది కారణములలో నొక దానిని బట్టిగాని ఎక్కువవానినిబట్టిగాని పన్ను తగ్గించుటకుఁగాను కలెక్టరు నెదుట వ్యాజ్యము తేవచ్చును. కాని వేఱె యే కారణములనుబట్టియు వ్యాజ్యము తేఁగూడదు—

(a) అధీనభూమిలోని నేల, రయితుయొక్క తప్పు లేకుండ, ఇసుక చేయుటవలనఁగాని, లేక ఆకస్మికమయినట్టిగాని క్రమక్రమముగ

నట్టిగాని వేఱె నిర్దిష్టమైన హేతువువలనఁగాని స్థిరముగా హీనదశకు వచ్చియుండుట; లేక

(*b*) నీటిపాలుదల గల భూమి విషయములో, దానికి ఆధారమైనట్టి ఇరిగేషన్ వర్కు నుండి సరఫరా శాశ్వతముగా నిలిచిపోయి యుండుట; లేక

(*c*) ప్రస్తుతపు పన్నుయొక్క చెలామణీకాలములో తాలూకాలో లేక జమీందారీ డివిజనులో ముఖ్యమయిన ఆహారపు పంట ధాన్యములయొక్క సగటు ప్రదేశపు ధరలు, తత్కాల హేతువునుబట్టి కాకుండ, తగ్గియుండుట.

(2) ఈ సెక్షను ననుసరించి తేఁబడిన యే వ్యాజ్యములోఁగాని, కలెక్టరు, తనకు యుక్తముగను న్యాయముగను తోఁచునట్లు పన్నును తగ్గించుటకు ఆజ్ఞాపింపవచ్చును; మఱియు (1) టి సబ్ సెక్షను యొక్క (*c*) క్లాజు ననుసరించి తగ్గింపు మొత్తమును నిశ్చయించుటలో 31 వ సెక్షనుయొక్క (*a*), (*b*), (*c*), (*d*) క్లాజులలో చెప్పియుండెడి సలహాలను గమనింపవలయును.

పన్ను తగ్గించుటకుఁగాను వ్యాజ్యములు వరుసగా తెచ్చుటకుఁ గల హక్కుయొక్క పరిమితి.

39. 38 వ సెక్షను (1) టి (*c*) సబ్ సెక్షను ననుసరించి దాఖలు చేయఁబడిన వ్యాజ్యములో, పన్నును తగ్గించుచు, లేక వ్యాజ్యముయొక్క సారాంశములనుబట్టి వ్యాజ్యమును కొట్టివేయుచు డిక్రీ చేయబడినప్పుడు, ఏక్రొత్త వ్యాజ్యమునుగాని, అట్టి డిక్రీ తేదినుండి ఇరువది సంవత్సరములలోపల దాఖలు చేయఁబడినయెడల, అదే సబ్ సెక్షను ననుసరించి పట్టఁగూడదు. అయినను, ఈ సెక్షనులో నుండునదేదియును, సివిల్ ప్రొసీజరు కోడుయొక్క 373 వ సెక్షను నిబంధనలను బాధింపదు.

## పన్నును ద్రవ్యరూపముగా మార్చుట.

40. (1) అనుభవపు హక్కుగల రయితు తన అధీనభూమిలో ఏ నేలకయిన శిస్తును మహాసూలు రూపముగాని పంటలోని భాగమునకు మతింపు వేసిన కిమ్మతునుబట్టిగాని పంటనుబట్టి మాఱునట్టి రేట్లవంతునగాని, లేక కొంతవఱకు వానిలో నొకవిధమునను మఱికొంతవఱకు వేఱె విధమునను గాని, లేక కొంతవఱకు ఈ విధములలో ఒక విధమునను లేక ఎక్కువ విధములను మఱికొంతవఱకు నగదుగను, చెల్లించు సందర్భములో, రయితుగాని భూస్వామిగాని ఆ పన్నును ఒక నియమమైన ద్రవ్యరూపపు పన్నుగా మార్చుటకుగాను కలెక్టరునెదుట వ్యాజ్యము తేవచ్చును.

మహాసూలు రూపముగా చెల్లింపఁబడు పన్నును వ్యాజ్యము ద్వారా మార్చుట.

(2) అట్టి వ్యాజ్యములో కలెక్టరు. సదరు మార్పు చేయవలయునా అను సంగతిని తీర్మానింపవలయును. మఱియు అతఁడు అట్లు మార్చుటకు అంగీకరించునెడల, మహాసూలు రూపముగఁగాని మఱియొక విధముగఁగాని ఉండు పన్నుకు బదులుగా ద్రవ్యరూపపు పన్నుగా చెల్లించవలసిన మొత్తమును, సదరు ద్రవ్యరూపపు మార్పు అములులోనికి వచ్చెడి కాలమును, నిర్ధారణచేయుచు ఒక డిక్రీని జారిచేయవలయును.

(3) ఆ నిర్ధారణ చేయుటలో కలెక్టరు ఈ క్రింది సలహాలలో ఒక్కొకదానిని గుఱించి తగినట్టుగా యోచింపవలయును:—

(a) ఏదేని యొక ప్రదేశవిషయములో క్షామ సంవత్సరములుగా ఉన్నట్లు లేక ఉండినట్లు లోకల్ గవర్న్మెంటువారు ప్రకటించునట్టి సంవత్సరములు కాక తక్కిన కడచిన పది సంవత్సరములకాలములోఁగాని లేక అట్టి కాలమునకు కిమ్మతును కనిపెట్టుటకు వీలు కాని

యొకల శొమ సంవత్సరములను మినహాయించి ఆ పది సంవత్సరముల కంటె ఎంత తక్కువకాలము నకు సాక్ష్యము దొరకునో ఆ కాలములోఁ గాని భూస్వామికి వాస్తవముగా బాకీగా చేరవలసియున్న పన్నుయొక్క సగటు కిమ్మతును;

(*b*) అదే గ్రామమందుఁగాని ప్రక్కననుండు గ్రామములందుఁగాని సమాన విధమైనట్టియు సమానమైన అనుకూల్యములుకలిగియున్నట్టియు భూమికి అనుభవపు హక్కుగల రయితులు చెల్లించు ద్రవ్యరూపపు పన్నును;

(*c*) అధీనభూమి విషయమై భూస్వామిగాని రయితుగాని చేసిన అభివృద్ధులును, 32 వ సెక్షనులో చెప్పియున్న విధులును.

(పన్నును) ద్రవ్యరూపముగ మార్చినవెనుక ఇరువది సంవత్సరములవఱకు పన్నును హెచ్చింపకయును తగ్గింపకయును నిషేధించుట.

41. (1) 40 వ సెక్షను ననుసరించి ఒక యధీన భూమియొక్క పన్నును ద్రవ్యరూపముగ మార్చినప్పుడు. దానిని 30 వ సెక్షను (ii), (iii) వ క్లాజులలో నిర్ణయింపఁబడిన కారణములనుబట్టి తప్ప, లేక, అధీనభూమియొక్క విస్తీర్ణము దరిమిలాను మార్పఁబడినదనెడి కారణమునుబట్టి తప్ప, ఇరువది సంవత్సరములవఱకు హెచ్చింపఁగూడదు, మఱియును దానిని, అధీనభూమియొక్క విస్తీర్ణములో మార్పుకలిగిన దను కారణమునుబట్టి లేక 38 వ సెక్షను (1) టి సబ్ సెక్షను (*a*) (*b*) క్లాజులలో నిర్ణయింపఁబడిన కారణమునుబట్టి తప్ప, తగ్గింపఁగూడదు.

(2) సదరు ఇరువది సంవత్సరముల కాలమయినది, ద్రవ్యరూపముగ మార్చుట ఏ తేదిని అములులోనికి వచ్చునో ఆ తేదినుండి లెక్కింపవలయును.

## విస్తీర్ణమునుబట్టి పన్ను మాఱుట.

విస్తీర్ణములోఁ గలిగిన మార్పునుబట్టి పన్నులో మార్పు కలుగుట.

42. (1) ప్రతి రయితును—

(*a*) తాను పూర్వము ఎంతవిస్తీర్ణమునకు పన్ను చెల్లించుచుండెనో దానికంటె అధికముగ నుండునట్లు ఏర్పడునట్టి యే భూమియైనను, తన యధీనభూమిలో అంతకు పూర్వమే చేరియుండు, వెల్లువ వలనఁగాని వేఱు విధముగఁగాని పోయి పన్ను ఏమాత్రము తగ్గింపఁబడకుండినట్టి భూమి సదరు అధీనభూమికి చేర్పఁబడుటవలన కలిగినదని రుజువు చేయఁబడిననే తప్ప, అట్లు అధికముగనుండునట్టి భూమి కంతటికిని హెచ్చుగా పన్ను చెల్లించుటకు పాత్రుఁడగును; మఱియు

(*b*) తాను పూర్వము ఎంతో విస్తీర్ణమునకు పన్ను చెల్లించుచుండెనో ఆ విస్తీర్ణముతో పోల్చిచూడఁగా తన యధీనభూమిలో తక్కువగా నుండునట్లు ఏర్పడునట్టి యే భూమియైనను అధీనభూమియొక్క విస్తీర్ణములోవండలి వలనఁగాని వేఱు విధముగఁగాని చేర్పఁబడినట్టి భూమి లోపించి పోవుటవలన కలిగిన దనియు అట్టి విస్తీర్ణములో క్రొత్తగా చేరిన భాగమునకుఁగాను పన్ను హెచ్చింపఁబడ లేదనియు రుజువు చేయఁబడిననే తప్ప, అట్లు తక్కువగ నుండునట్టి భూమి విషయమై పన్ను తగ్గింపఁబడుటకు వానికి హక్కు కలదు.

(2) అయినను, వివాదము కలుగు సంగతులలో, ఇలాకా గల భూస్వామియైనను రయితైనను కలెక్టరుకు దరఖాస్తు చేసికొన్నమీఁదట అతఁడు చేయునట్టి యుత్తరువు ననుసరించి తప్ప, ఈ సెక్షనునుబట్టి పన్ను మొత్తమును ఎంతమాత్రము మార్చఁగూడదు.

భూమిని కొలుచుటకు భూస్వామికిగల హక్కు.

43. ప్రతిభూస్వామియును, పైకదపటి సెక్షను కార్యములకొఱకు తన యెస్టేటుతో చేరిన యేభూమిలోనైన తాను స్వయముగాఁగాని ఇందు విషయమై తనవలన అధికారము పొందినమనుష్యుని మూలముగాఁగాని ఎప్పుడైనను ప్రవేశించి కొలువవచ్చును.

విస్తీర్ణముతో పన్నుయొక్క మార్పును నిశ్చయించుటకుఁగాను విధులు.

44. (1) 42 వ సెక్షనుయొక్క (2) వ సబ్ సెక్షనుననుసరించి దరఖాస్తు చేసికొనిన మీఁదటను ఎదుటి పార్టీకి నోటీసు ఇచ్చిన మీఁదటను, కలెక్టరు, తనకు యుక్తమని తోఁచునట్టి కొలతలు కొలిపించి, మఱియు పార్టీలు హాజరు చేయునట్టి సాక్ష్యమును విమర్శించి, పూర్వము పన్ను ఏ విస్తీర్ణమునకు చెల్లింపఁబడి యుండినదో ఆ విస్తీర్ణమును, ఆ పన్నుకు ఏదైన చేర్చవలసి యున్నయెడల లేక దానినుండి యేదైన తీసివేయవలసి యున్నయెడల ఆ మొత్తమును, నిశ్చయింపవలయును.

(2) పూర్వము దేనికి పన్ను చెల్లింపఁబడి యుండినదో ఆ విస్తీర్ణమును నిశ్చయించునప్పుడు కలెక్టరు ఈ క్రింద సలహాలలో ఒకొక్కదాని విషయమైన గమనించి యోచింప వలయును:—

(a) అనుభవము ఎట్లు ఉత్పత్తియైనదియు దాని షరతులును— దృష్టాంతముగా, పన్ను అధీనభూమికి యావత్తుకును ఐక్యపఱుపఁబడిన పన్నుగా నున్నదా అనునంశము;

(b) రయితుయొక్క మొత్తపు పన్నుతోఁగూడ మఱికొంత మొత్తము హెచ్చుగా చెల్లించు న్యాయమును బట్టిగాని, వేఱె న్యాయమును బట్టిగాని రయితు ఆ హెచ్చుగా నుండు భూమిని అనుభవించునట్లు భూస్వామి సెలవిచ్చుటకు ఆస్పదమయినట్టి యేదేని కారణమును;

(*c*) రయితు తన పన్నులో దామాషాప్రకారము తగ్గింపఁబడకయే తక్కువ విస్తీర్ణమును అనుభవించునట్లు సమ్మతించుటకు ఆస్పదమయిన యేదేని కారణము;

వివరణము.—సదరు హెచ్చుగా నుండు భూమిని అనుభవించుటకు రయితుకు భూస్వామి సెలవిచ్చినాఁడా అను అంశమునుగాని, సదరు తక్కువ విస్తీర్ణమును శిస్తు దామాషాప్రకారము తగ్గింపఁబడకయే అనుభవించుటకు రయితు సమ్మతించినాఁడా అను అంశమునుగాని నిశ్చయించుటలో, కలెక్టరు, పన్నును గుఱించిగాని విస్తీర్ణమును గుఱించిగాని వివాదము లేకుండ అనుభవము ఎంతకాలము జరుగుచుండినదో యోచించవలయును;

(*d*) దరఖాస్తుచేయు కాలములో ఉపయోగింపఁబడుచుండునట్టిగాని అట్టి కాలములో ఆ ప్రదేశమందు వాడఁబడుచుండినట్టిగాని కొలిచెడి సాధనముతో, (భూమి) అనుభవము ప్రారంభమైన కాలమందు ఉపయోగింపఁబడినట్టిగాని అట్టికాలములో ఆ ప్రదేశమందు వాడఁబడినట్టిగాని కొలిచెడి సాధనమును పోల్చిచూడఁగా ఏర్పడు కొలత.

(3) పన్నుకు చేర్చవలసిన మొత్తమును నిశ్చయించునపుడు, కలెక్టరు, ఆ గ్రామములోఁగాని చుట్టు ప్రక్కలనుండెడు గ్రామములోఁగాని ఉండెడు అదే విధమై అట్టి ఆనుకూల్యములే గలిగినట్టి భూములకు రయితులు చెల్లించవలసిన రేట్లను యోచించి చూడవలయును, కాని ఆయా సంగతియొక్క సందర్భములను బట్టి అయుక్తముగ లేక అన్యాయముగ ఉండునట్టి యే పన్నునుగాని ఏ సంగతిలోను నిర్ణయింపఁగూడదు.

(4) భూస్వామిగాని రయితుగాని పలానినేల అధికముగా ఉంచుకోఁబడిన దని తెలుపలేనప్పుడు, అట్టి అధికమైన విస్తీర్ణమునకుఁ

గాను చేర్చవలసిన పన్నును, అట్టి అధికమైన విస్తీర్ణమును చేర్చకుండ సదరు అధీనభూమిలోని యావత్తు నేలలకును చెల్లింపఁబడు సగటు పన్ను రేటు చొప్పున లెక్కింపవచ్చును.

(5) తగ్గింపఁబడు సంగతిలో, ఆ పన్ను యొక్క త్రోపుడయినది అధీనభూమియొక్క సంవత్సరవారి మొత్తపు ఫలితములో తగ్గినట్టి భాగమునకు తగినదిగా ఉండవలయును, లేక దానిని గుఱించి సమాధానమైన రుజువేదియు లేనిచో, సదరు త్రోపుడు అధీనభూమియొక్క విస్తీర్ణములో తగ్గినట్టి భాగమునకు తగినంతగా ఉండవలయును.

(6) ఈ సెక్షను ననుసరించి పన్నుకు ఏదైన చేర్చడము గాని దానినుండి యేదైన తగ్గించడముగాని, ఈ యాక్టుయొక్క తాత్పర్యప్రకారము పన్నును హెచ్చించడముగా లేక తగ్గించడముగా ఎన్నఁబడదు.

రయితీభూమిని భూస్వామి అనుమతి లేకయే అనుభవించుటకుఁగాను చెల్లింపనగు రేట్లు.

45. దాయబాధ్యతమూలముగాఁగాని, చట్టపు సమ్మతమైన ట్రాన్స్ఫరు మూలముగాఁగాని తాను పొందనట్టిదిగా నుండు రయితీభూమిని భూస్వామియొక్క అనుమతిలేకయే వ్యవసాయ కార్యముల కొఱకు అనుభవించునట్టి మనుష్యుఁడు, ఆ భూమికి నిర్ణయింపఁబడి యుండు పన్నునుగాని, లేక పన్ను ఏదియు నిర్ణయింపఁబడి యుండనిపక్షమున, దరఖాస్తు చేసి కొన్నమీఁదట కలెక్టరు యుక్తమనియు న్యాయమనియు తీర్మానించు మొత్తమునుగాని, అట్లు అనుమతి లేక అనుభవించినందుకుఁగాను, నిర్ణయింపఁబడిన లేక నిశ్చయింపఁబడిన పన్నును మించకుండ, నష్టము కట్టియిచ్చునట్లు కలెక్టరు తీర్మానించునట్టి మొత్తముతో సహా ప్రతి రెవిన్యూ సంవత్సరమునకు లేక అట్టి సంవత్సర భాగమునకు చెల్లించుటకు బద్ధుఁడయి

యుండఁను. మఱియు సదరు భూమిమీఁద రావలసి యుండు పన్నును రాఁబట్టుకొనుటకు ఈ యాక్టుచే నిబంధింపఁబడి యుండు పరిహారముల నన్నిటిని భూస్వామి అతనిమీఁద కలిగియుండును.

## అనుభవపుహక్కు — లేని రయితులు.

శాశ్వతపు అనుభవపు హక్కు ఇచ్చుటకుఁగాను చర్య.

46. (1) 6 వ సెక్షనులోని (4), (5) సబ్ సెక్షన్లక్రిందను, 8 వ సెక్షనులోని (4) ఎ సబ్ సెక్షనుక్రిందను వచ్చు కేసులలో తప్ప, భూస్వామి, విరుద్ధముగా ఏ కాంట్రాక్టు చేసికొనియుండినను లేక యేకొలు ఏర్పడియుండినను నిమిత్తము లేకుండ, అనుభవపు హక్కు లేని రయితు దరఖాస్తుచేసికొనినమీఁదటను, భూమివిషయమై చెల్లింపఁదగిన సంవత్సరవారి పన్నుకు రెండున్నరింతల పైకపు మొత్తమును, అందుకొఱకు కావలసియుండు ఏ పత్రమునైన తయారుచేయుటకు తగులు కర్చుతో సహా అతఁడు టెండరు చేసినమీఁదటను, అట్టి భూమి విషయమై శాశ్వతపు అనుభవపుహక్కును రయితుకు ఇయ్యవలయును.

అయినను, రయుతు, అట్టి యే దరఖాస్తుయొక్కయు టెండరుయొక్కయు కార్యములకుఁగాని, భూస్వామి, తనకు ఏదైన దరఖాస్తును టెండరును చేసికొనినమీఁదటను, ఈ సెక్షను కార్యమునకుఁగాను పన్నును నిర్ణయించుటకు కలెక్టరుకు మనవి చేసికొనవచ్చును. అట్టి భూమి విషయమై చెల్లింపఁదగిన పన్ను రేటు, అధికముగాఁగాని, అనుభవపు హక్కును పొందకుండ చేయునట్టిదిగాఁగాని, లేక ఇరుగు పొరుగున అట్టి అనుకూల్యములే కలిగిన అదే విధమయినట్టి భూమికి అనుభవపు హక్కుగల రయితులు మామూలుగా చెల్లించు రేటుకంటె తక్కు

వగా నున్నదని కలెక్టరుకు తృప్తికరముగా రుజువుపర్చినయెడల కలెక్టరు, 26 వ సెక్షనులో నేదియున్నను నిమిత్తము లేకుండ, మొదటి విషయములో, న్యాయమైనట్టియు ధర్మమైనట్టియు పన్నును, కడపటి విషయములో, ఇరుగు పొరుగున అదేవిధమైన అనుకూల్యములు గల అదేవిధమైన భూములకు మామూలుగా చెల్లించు పన్నును నిర్ణయింపవలెను. అట్లు నిర్ణయింపఁబడిన పన్ను, ఈ సెక్షనుయొక్క కార్యమునకుఁగాను, రయితు చెల్లింపఁదగునట్టి పన్నుగా నెంచవలసినదేగాక దరఖాస్తుదారుయొక్కయు రెండరుయొక్కయు లేదిన రయితు చెల్లింప దగినట్టి పన్నుగా నుండినట్లు ఎంచవలెను.

(2) ఒకరయితుచే దరఖాస్తును రెండరును చేసికొనఁబడిన భూస్వామి ఒక నెలవఱకు, శాశ్వతపు అనుభవపు హక్కును ఇయ్యక తప్పిపోయినయెడల, రయితు పైని చెప్పినమొత్తమును కలెక్టరు ఆఫీసులో ధరావతుగా నుంచి, ఆ భూమి విషయమై శాశ్వతపు అనుభవపు హక్కును తన కిచ్చుటకు కలెక్టరుకు మనవి చేసికొనవచ్చును.

(3) అందుమీఁదట కలెక్టరు సదరు మనవినిగుఱించి నోటీసును భూస్వామి కియ్యవలెను. భూస్వామి హాజరగునెడల, అతఁడు చెప్పుదానిని విని, కలెక్టరు, తాను ఆవశ్యకమని తలఁచునట్టి విచారణ చేసినతర్వాత, సదరు భూమి విషయమై పాయకారి రయితుకు శాశ్వతపు అనుభవపుహక్కు నిచ్చుటకుఁగాను కావలసియుండు ఏ పత్రమునుగాని వ్రాసి యియ్యవచ్చును ; అట్లు వ్రాసియిచ్చుట, భూస్వామి వ్రాసియిచ్చిన ఏ ఫలము గలదియగునో ఆ ఫలమే గలదియగును.

(4) పైని చెప్పినట్లు అనుభవపు హక్కు ఇయ్యబడినపుడు, పైని చెప్పినట్లు అనుభవపు హక్కును పొందుటకుఁగాను రయితు ఏ

రేటువంతున పన్ను చెల్లింపవలసి యుండునో ఆ రేటు, 28 వ సెక్షను యొక్క అర్థము ప్రకారము అతఁడు న్యాయముగా చెల్లింపవలసిన రేటుగా ఎన్నవలెను. ఆ రేటు, ధరలు హెచ్చినవను లేక తగ్గినవను కారణమునుబట్టి, ఇరువది సంవత్సరములవఱకు హెచ్చింపఁదగిగాని లేక తగ్గింపఁదగిగాని యుండదు.

(౬) అనుభవస్వహక్కును పొందుటకుఁగాను ఈ సెక్షనును బట్టి చెల్లింపఁదగిన మొత్తములు ఎస్టేటుయొక్క లేక దాని భాగముయొక్క సొంతదారుఁడయిన భూస్వామికి చెల్లింపవలయును. ఈ సెక్షను ననుసరించిన యే దరఖాస్తుగాని లేక చర్యగాని అట్టి భూస్వామికే చేసికొనవలయును లేక అట్టి భూస్వామికి విరుద్ధముగానే చేసికొనవలయును.

పాఁతబంజరు గల రయితుకు, పన్ను హెచ్చింపఁబడిన విషయమునుగుఱించిన నోటీసును అందఁజేయుట.

47. ఏ రయితు చెల్లింపవలసిన పన్ను వ్రాఁతమూలమైన యొడంబడికచే నిర్ణయింపఁబడలేదో, లేక యే రయితు సంవత్సర సంవత్సరము ఒడంబడిక చేసికొను పాయకారి రయితయి యున్నాఁడో, లేక ఏరయితు తన కౌలు కాలము ముగిసిన తర్వాతను భూమిని తన స్వాధీనమం దుంచుకొని యున్నాఁడో ఆ రయితు ఏ పాఁతబంజరు విషయములోఁగా చెల్లింపఁదగిన పన్నును హెచ్చింపవలెనని భూస్వామి కోరినప్పుడు, రయితు అట్లు పన్ను హెచ్చింపఁబడుటకు సమ్మతింపనియెడల, భూస్వామి ఏ రెవిన్యూ సంవత్సరమందు ఆ హెచ్చుపన్ను అములులోనికి రావలెనని కోరునో ఆ రెవిన్యూ సంవత్సరము ప్రారంభించుటకు పూర్వము ఆఱునెలలకు తక్కువకాకుండను పంౘ్రెండునెలలకు ఎక్కువకాకుండను నోటీసును కలెక్టరుద్వారా రయితుకు అందింపఁజేయవలెను.

హెచ్చింపఁబడిన పన్నును చెల్లించుటకు రయితు ఇష్టమును తెలుపునపుడు చర్య.

48. (1) పైకడపటి సెక్షను ననుసరించి నోటీసు అందఁజేసినప్పటినుండి ఒక నెలకాలములోఁగా, ఏ రయితుకు నోటీసు అందఁజేయఁబడెనో ఆ రయితు, నోటీసు జారీచేసిన కలెక్టరుకు, హెచ్చింపఁబడినపన్నును చెల్లించుటకు తన కిష్టమున్నదని వ్రాఁతమూలముగా ఒక స్టేట్మెంటును హాజరుపర్చినయెడల, వెనుక చేరికగావచ్చు రెవిన్యూ సంవత్సరపు ప్రారంభమునుండి రయితు ఆ పన్నును చెల్లించుటకు సమ్మతించినట్లు ఎన్నవలెను.

రయితు అట్లు తెలుపక తప్పిపోయినపుడు చర్య.

(2) సదరు ఒకనెల కాలములోఁగా రయితు పైనిచెప్పఁబడినట్లు ఒక స్టేట్మెంటును కలెక్టరుకు హాజరుపఱుపనియెడల, భూస్వామి, వెనుక చేరికగావచ్చు రెవిన్యూ సంవత్సరము ప్రారంభించుటకు పూర్వము పది వారములకు తక్కువకాకుండ, రయితును వెడలఁగొట్టించుటకు కలెక్టరుకు మనవి చేసికొనవచ్చును.

వెడలఁగొట్టించుటకు మనవి చేసికొనినతర్వాత, హెచ్చింపఁబడిన పన్నును చెల్లించుటకు ఇష్టమున్నదని రయితు తెలిపినపుడు లేక తెలుపక తప్పిపోయినపుడు చర్య.

49. (1) పైకడపటి సెక్షనుయొక్క (2) వ సబ్ సెక్షను ననుసరించి మనవి చేసికోఁబడినప్పుడు, రయితు హాజరై, అడుగఁబడినట్టి హెచ్చుపన్నును చెల్లించుటకు సమ్మతించినయెడల, అతని సమ్మతిని రెకార్డు చేయవలెను; మఱియును అతఁడు వెడలఁగొట్టఁబడగూడదు; కాని, సదరు సబ్ సెక్షను ననుసరించి భూస్వామి మనవి చేసికొన్న తేదికి తర్వాత చేరికగావచ్చు రెవిన్యూ సంవత్సరపు ప్రారంభమునుండి ఆ రయితు ఆ పన్నును చెల్లింపఁదగి యుండును.

(2) రయితు హాజరుకాక తప్పినయెడలఁగాని, లేకహాజరై అడుగఁబడినట్టి హెచ్చుపన్నును చెల్లించుటకు సమ్మతించనియెడలఁగాని, కలెక్టరు, ఏదైన హెచ్చింపఁబడినయెడల సదరు భూమికిఁగాను ఎంత హెచ్చింపు యుక్తముగాను న్యాయముగాను ఉండునో దానిని నిర్ణయింపవలెను. అయినను, ఏదైన హెచ్చింపునకు సెలవియ్యవచ్చునా అను విషయమును, ఎంత హెచ్చింపునకు సెలవియ్యవచ్చునో అను విషయమును నిర్ణయించుటలో, కలెక్టరు ఈ యాక్టుయొక్క 30 నుండి 37 వఱకుండు సెక్షన్లలోని నిబంధనల ప్రకారము నడుచుకోవలెను.

(3) అట్లు నిర్ణయింపఁబడిన పన్నును చెల్లించుటకు రయితు సమ్మతించునెడల, 48 వ సెక్షను (2) వ సబ్ సెక్షను ననుసరించి భూస్వామి మనవి చేసికొన్న తేదికి వెనుక చేరికగావచ్చు రెవిన్యూ సంవత్సరముయొక్క ప్రారంభమునుండి ఆ పన్నుకు భూమిని తన అనుభవములో నుంచుకొని యుండుటకు హక్కు గలిగి యుండును.

(4) (2) వ సబ్ సెక్షను ననుసరించి అట్లు నిర్ణయింపఁబడిన పన్నును చెల్లించుటకు రయితు సమ్మతించనియెడల, కలెక్టరు, 155,156 సెక్షన్లలోని నిబంధనలకు లోఁబడియును, 154 వ సెక్షను ననుసరించి రయితుకు చేరవలసియున్నట్లు నిర్ణయింపఁబడిన పరిహార మేదైన నున్నయెడల ఆ మొత్తమును, ఉత్తరువు తేదినుండి ఒక నెలలోఁగా భూస్వామి డిపాజిటు చేయవలసినదానికి లోఁబడియును, రయితును వెడలఁగొట్టుటకు ఉత్తరువు చేయవచ్చును. అట్టి మొత్తము అట్లు డిపాజిటు చేయనియెడల, వెడలఁగొట్టుటకు చేసిన ఉత్తరువు చెల్లకపోవును.

---

## 4 వ అధ్యాయము.

### పట్టాలును ముచ్చిలికాలును.

అధ్యాయము ఏ రయితులకు ప్రయోగించునో ఆ రయితులు.

50. (1) ఈ యధ్యాయముయొక్క నిబంధనలు, శాశ్వతపు అనుభవపు హక్కుగల రయితుల కంటెకికి ప్రయోగించును; మఱియును అవి ఎంతవ అకు ప్రయోగపడఁగలవో అంతవఱకు ప్రాఁతమూలమైన కౌలునుబట్టి కాకుండ వేఱువిధముగా ఒక భూస్వామి క్రింద పాఁతబంజరును కలిగియుండు రయితులకును ప్రయోగించును.

పట్టాముచ్చిలికాలను పొందుటకు రయితుకును భూస్వామికినిగల హక్కు.

(2) ప్రతి రయితుకును, జరుగుచుండెడి యే రెవిన్యూ సంవత్సరమునకుఁగానైన తనకు పట్టా యిమ్మని తన భూస్వామిని కోరుటకు హక్కుకలదు, మఱియు ప్రతి భూస్వామికిని, జరుగుచుండెడి యే రెవిన్యూ సంవత్సరమునకుఁగానైన పట్టా పుచ్చుకొని తనకు ముచ్చిలికా యిమ్మని తన రయితును కోరుటకు హక్కుకలదు.

పట్టా ముచ్చిలికాలలోని విషయములు.

51. (1) పట్టాలో (పార్టీల) ఆనామీలపేర్లును, భూమియొక్క ప్రదేశ వివరణమును విస్తీర్ణమును, పైకము మూలమునన్నో ధాన్యమూలముననో లేక పంటలోని భాగముమూలముననో దానిని చెల్లింపఁదగినట్టి పన్నుయొక్క రేటును లేక మొత్తమును దాని స్వభావమును, చట్టమునుబట్టిగాని చట్టపుబలము కలిగినట్టి వాడుకనుబట్టిగాని ఆ పన్నుతోడ చెల్లింపనగు నేదైన లోకల్ పన్ను, సెస్సు, రుసుము లేక చార్జివున్న యెడల అదియు, అట్టి పన్నునుగాని లోకల్ పన్నునుగాని సెస్సునుగాని రుసుమునుగాని చార్జినిగాని యెప్పుడు చెల్లింపవల

యునో ఆ గడువుకాలమును లేక గడువుకాలములును, పట్టా తేదియు, పార్టీలు బద్ధులై యుండునట్లు ఉద్దేశింపఁబడిన విశేష షరతులన్నియు, నమూదు చేయఁబడి భూస్వామిచే సంతకము చేయఁబడి యుండవలయును. ముచ్చిలికా అయినది, భూస్వామి ఇష్టప్రకారము, పట్టాకు ఎదురుప్రతిగానో లేక దాని షరతులనుబట్టి యుంచుకొనుటకయినట్టి సామాన్యమైన ఒడంబడికగానో వుండవచ్చును. దానిలో రయితు సంతకము చేయవలెను.

([illegible]) రయితు సాగుబడిచేయు విషయములోఁగాని మహసూలును కోఁతకోయు విషయములోఁగాని యొక నిర్బంధము కలిగియున్నట్టి, లేక అనుభవపు హక్కు గల రయితు ఒక యుదాహరింపఁబడ్డ కాలములో భూమియొక్క స్వాధీనమును ఇచ్చివేయుటను గుఱించినట్టి, యే షరతయినను చెల్లఁబడి కాదు, మఱియు దానివలన ప్రయోజనమును లేదు.

పట్టాలును ముచ్చిలికాలును మార్చుకొనఁగూడి కాలపరిమాణము.

52. (1) పట్టాలను ముచ్చిలికాలను ఒక రెవిన్యూ సంవత్సరము దాఁకఁగాని యెక్కువ రెవిన్యూ సంవత్సరముల దాఁకఁగాని వ్యాపించు కాలములకు మార్చుకొనవచ్చును; కాని, ఒక రెవిన్యూ సంవత్సరమునకంటె అధికమయిన కాలము వఱకు ఏ భూస్వామిగాని పట్టాను (టెండరు చేయు) ఇచ్చుటకును, ఏ రయితుగాని దానిని గ్రహించుటకును బద్ధుఁడయి యుండఁడు.

(2) సబ్ సెక్షను (3) యొక్క నిబంధనలకు లోనై, పట్టాగాని ముచ్చిలికాగాని యేగడువుకాలమునకు సంబధించినదిగా నుండునో ఆ కాలము ప్రారంభమైన తర్వాత పంద్రెండు మాసములలోఁగానే పట్టానైనను ముచ్చిలికానైనను టెండరు చేయవలయును, మఱియు

అట్టి కాలములోఁగానే ముచ్చిలికానైనను పట్టానైనను ఇమ్మని కోరవ లయును.

(3) ఏ రెవిన్యూ సంవత్సరమునకుఁగానైన అంగీకరింపఁబడి నట్టి, మార్చుకోఁబడినట్టి లేక డిక్రీ చేయఁబడినట్టి పట్టాలును ముచ్చిలి కాలును, క్రొత్తపట్టాలును ముచ్చిలికాలును ఏ రెవిన్యూ సంవత్సరము నకుఁగాను అంగీకరింపఁబడినవో మార్చుకోఁబడినవో లేక డిక్రీచేయఁబ డినవో ఆ సంవత్సరము ప్రారంభమగునటకును అములులోనుండును ; అయినను, పట్టాగాని ముచ్చిలికాగాని ఒకటికంటె నెక్కువ రెవిన్యూ సంవత్సరములదాక అములులో ఉండియున్నప్పుడు, అదియే సంవత్సర ములో టెండరు చేయఁబడినదో, అంగీకరింపఁబడినదో, మార్చుకోఁబ డినదో లేక డిక్రీ చేయఁబడినదో ఆ రెవిన్యూ సంవత్సరమునకు వెంట నే వచ్చెడు రెవిన్యూ సంవత్సరము ప్రారంభమగునటకు అదే అధీన భూమికిఁగాను క్రొత్తపట్టా లేక ముచ్చిలికా యేదియు చెల్లదు.

పట్టాను టెండరు చేసిననే, అధీనభూమిని జప్తుచేయుటకును విక్రయించుటకును భూస్వామిక హక్కు కలదనుట

53. (1) ఏ భూస్వామిగాని ఒక రయితుకు పట్టా ఇచ్చి ముచ్చి లికా పుచ్చుకొనియున్ననే తప్ప, లేక సవ రు రయితు పుచ్చుకొనుటకు బద్ధుఁడై యు న్నటువంటి పట్టాను టెండరుచేసియున్ననే తప్ప, లేక చెల్లఁదగినట్టి పట్టాగాని ముచ్చి లికాగాని అములులోనున్ననే తప్ప, పన్ను రాఁబట్టుకొనుటకుఁగాను 6 వ అధ్యాయము ననుసరించి వాని చరా స్తిని జప్తుచేసి విక్రయించుటవలనఁగాని లేక వాని యధీనభూమిని విక్రయించుటవలనఁగాని వానిమీఁద చర్య జరిగించుటకు సదరు భూ స్వామికి అధికార ముండదు.

(2) కలెక్టరు అభిప్రాయములో కొంతమట్టుకు మాత్రమే సరిగానుండి యావత్తు సరిగానుండనిదైనట్టి భూస్వామి టెండరు చేసిన

పట్టా అయినది, అట్లున్నప్పటికిని, అది యెంతవఱకు సరిగా నున్నదని కనుగొనఁబడునో అంతవఱకు అములు జరిగింపఁదగినదిగా నుండును.

పట్టాను ఎట్లు టెండరు చేయవలయును.

54. (1) పట్టాను రయితుకు, 78 వ సెక్షనుయొక్క (2) వ సబ్ సెక్షను ననుసరించి నోటీసు జారీ చేయుటకయి నిబంధించియుండు విధముననైనను, లేక భూస్వామి దరఖాస్తు చేసికొన్నమీఁదట ఏ యెస్టేటును గుఱించిగాని లేక యే యెస్టేటు భాగమునుగుఱించిగాని కలెక్టరు సెలవిచ్చినయెడల దానిని కలెక్టరు ఆఫీసులోనైన లేక లోకల్ గవర్న్మెంటువారు సామాన్యముగా లేక ప్రత్యేకముగా ఉత్తరువు చేయునట్టి వేఱె ఆఫీసరు ఆఫీసులోనైన దాఖలుచేసియయినను, టెండరు చేయవచ్చును ; మఱియు అట్లు దాఖలు చేయఁబడినయెడల, సదరు కలెక్టరుగాని అట్టి వేఱె ఆఫీసరుగాని, ఆ పట్టాను భూస్వామి కర్చున రయితుకు పైనిచెప్పిన విధమున అందఁజేయింపవలయును.

(2) సదరు దరఖాస్తు, ప్లెయింటువలెనే సంతకముచేయఁబడి నిరూపింపఁబడి యుండవలయును ; మఱియు సదరు దరఖాస్తుతోఁగూడ, జారీచేయుట కగు కర్చుల నిమిత్తమై లోకల్ గవర్న్మెంటువారు విధిమూలముగా నిర్ణయించునట్టి పైకమును పంపవలయును.

పట్టాపొందుటకు వ్యాజ్యెము.

55. ఏ భూస్వామియయినను, రయితు పట్టాను ఏ షరతులప్రకారము పొందుటకు అర్హుఁడయి యున్నాఁడో ఆ షరతులప్రకారము దానిని అడిగిన మీఁదట మూఁడునెలలదాఁక ఇయ్యక తప్పిపోయినయెడల, అట్టి పట్టాకొఱకు కలెక్టరునెదుట రయితు వ్యాజ్యెము తెచ్చుట చట్టపుసమ్మతమయి యుండును.

పట్టాను అంగీకరించునట్లు బలవంతపెట్టుటకు వ్యాజ్యము.

56. టెండరు చేయఁబడిన తర్వాత ఒక నెలవఱకు రయితుతనకు టెండరు చేయఁబడిన పట్టాను అంగీకరింపకుండను దానికిబదులు ముచ్చిలికాయియ్యకుండను తప్పిపోవునపుడు, అట్టిపట్టాను అంగీకరించునట్లు బలవంతపెట్టుటకు కలెక్టరు ఎదుట భూస్వామి వ్యాజ్యము తేవచ్చును

పట్టా ఇచ్చునట్లు లేక అంగీకరించునట్లు బలవంత పెట్టుటకయి తెచ్చెడి వ్యాజ్యమును తీర్పుచేయుటలో చర్య.

57. 55 వ, 56 వ సెక్షన్ల ననుసరించిన వ్యాజ్యములను తీర్పు చేయుటలో, ఎవరిమీఁద వ్యాజ్యము తేఁబడినదో ఆ యాసామి పట్టాయిచ్చుటకు లేక అంగీకరించుటకు బద్ధుఁడా అని కలెక్టరు మొదట విచారింపవలయును, మఱియు నిది రుజువు అయిననే తప్ప ఆ వ్యాజ్యమును త్రోసివేయవలయును. ఎవరిపై వ్యాజ్యము తేఁబడినదో ఆయాసామి పట్టా ఇచ్చుటకు లేక అంగీకరించుటకు బద్ధుఁడని వాది స్థాపించినయెడల, కోరిన లేక టెండరుచేసిన పట్టా క్రమమయినదా యని కలెక్టరు విచారింపవలయును. అది ఆప్రకార ముండినట్లు అగపడినపక్షమున, ముచ్చిలికా పుచ్చుకొని దానికి బదులుగా పట్టా యిమ్మనిగాని, లేక పట్టాను అంగీకరించి దానికి బదులుగా ముచ్చిలికా యిమ్మనిగాని కలెక్టరు ప్రతివాదిని ఆజ్ఞాపించుచు డిక్రీ చేయవలయును. అడిగినట్టి లేక టెండరు చేసినట్టి పట్టా క్రమమయినది కాదని కలెక్టరు అభిప్రాయపడినయెడల, అతఁడు పట్టా షరతులు ఏవై యుండవలయునో తీర్మానించి, అట్టి షరతులను తన డిక్రీలో చేర్చవలయును ; ఆ డిక్రీ, పట్టా ముచ్చిలికాలు మార్చుకొనఁబడి యుండిన నెట్లో అట్లే సమానబలమును ప్రయోజనమును కలదయి యుండును.

పట్టాలలోను ముచ్చిలికాలలోను కరణము చ్రేవాలు చేసి రిజిస్టరు చేయవలయును.

58. అధీనభూమివిషయమైన పట్టాలలోను ముచ్చిలికాలలోను, అధీనభూమి యుండు గ్రామ కరణము క్రమప్రకారముచే వ్రాలుచేసి వానిని రిజిస్టరు చేయవలయును.

## 5 వ అధ్యాయము.

### పన్ను చెల్లించుటయు, పన్ను బాకీలును.

పన్నును వాయిదాలుగా చెల్లించుట

59. పన్ను. ఒడంబడికను బట్టికాని. లేక ఒడంబడిక లేనిదో, స్థిరముగా ఏర్పడియుండు వాడుకనుబట్టిగాని వాయిదాలుగా చెల్లింపఁదగి యుండును.

పన్ను బాకీ.

60. పన్నువాయిదా ఏ దినమందు చెల్లింపవలసి యుండునో ఆ దినమున చెల్లింపఁబడనియెడల, అది మఱుసటి దినము పన్ను బాకీగా ఏర్పడును.

బాకీలమీఁది వడ్డీ.

61. బాకీమీఁద, అది యే తేదిని బాకీ యేర్పడినదో ఆ తేదినుండి అది చెల్లింపఁబడువఱకు నెలకు నూటికి అర్ధణాతున అసలుకు వడ్డీ కట్టఁబడును.

పన్నుకు రసీదు పొందుటకు రయితుకుఁ గల హక్కు.

62. (1) ఒక భూస్వామికి పన్నుకుఁగాను పైకము చెల్లించునట్టి ప్రతి రయితును, తాను చెల్లించిన మొత్తము నకుఁగానుభూస్వామిచేఁగాని భూస్వామియొక్క యుత్తరువుపొందిన యేజెంటుచేఁగాని సంతకము చేయబడిన వ్రాఁతరసీదును వెంటనే పొందుటకువానికి హక్కు కలదు,

(2) భూస్వామిగాని అతని యేజెంటుగాని ఆ రసీదుకు (కౌంటర్ ఫాయిల్) ఎదురు నకలు తయారు చేసి యుంచుకొనవలయును.

ప్రామాణికమైన రసీదులోని విషయములు.

63. (1) పైకము చెల్లించెడి కాలమందు రసీదులో ఈ క్రింది వివరణములలో భూస్వామి ఉదాహరింపఁగలవి నమూదయి యుండవలయును, అవి యేవనఁగా,—

(a) చెల్లించువానియొక్కయు పుచ్చుకొనువానియొక్కయు పేళ్లు;

(b) అధీనభూమి యే గ్రామమందున్నదో దాని పేరు;

(c) చెల్లించిన మొత్తము;

(d) ఏ యధీనభూమికిగాను పన్ను చెల్లింపఁబడెనో ఆ భూమియొక్క వివరము;

(e) ఏ సంవత్సరమునకు ఏ వాయిదాకు పైకము జమ కట్టుకొనఁబడెనో ఆ సంవత్సరమును వాయిదాయును;

(f) ఆ పైకము పూర్తిగా చెల్లించినట్లు ఎన్నఁబడినదియు లేక కొంతభాగముగా మాత్రమే చెల్లించినట్లు ఎన్నఁబడినదియు;

(g) పన్ను చెల్లించిన తేది.

అయినను, లోకల్ గవర్న్మెంటువారు, సామాన్యముగాఁగాని ఏదేని ఒక ప్రదేశమునకనిగాని లేక తరగతి సంగతులకనిగాని, సవరించిన యొక నమూనాను అప్పుడప్పుడు నిర్ణయింపవచ్చును.

(2) ఈ సెక్షనులో కోరియుండు వివరములు ఒక రసీదులో సరిగా ఉండనియెడల, ఆ రసీదు ఏ తేదిని యియ్యఁబడెనో ఆ తేదివఱకును పన్నుబాకీలు అన్నియు పూర్తిగా చెల్లించినందుకు అది చెల్లుచీటిగా నున్నట్లు ఊహింపవచ్చును.

వాయిదాలకయి చెల్లించు పైకములను జమ పెట్టుట.

64. (1) పన్నుకుఁగాను రయితు పైకము చెల్లించునపుడు, అతఁడు తాను ఆ పైకమును ఏ సంవత్సరమునకు ఏ వాయిదాకు జమపెట్టవలసినదిగా కోరుచున్నాఁడో దానిని చెప్పవలయును; అంతట ఆ పైకమును అదేప్రకారమే జమపెట్టవలయును.

(2) అతఁడు అట్లు చెప్పనియెడల, ఆ పైకమును, భూస్వామి యిష్టప్రకారము కాలాదాఁటని యే బాకీకిఁగానైనను జమపెట్టుకొనవచ్చును.

రసీదు ఇయ్యనందులకు (కాంపెన్సేషను) ప్రతీకారము.

65. రయితు చెల్లించినట్టి యే పన్నుకైనను 62 వ 63 వ సెక్షనులయొక్క నిబంధనల ప్రకారము ఉన్న ఒక రసీదును అతనికి ఇచ్చుటకుఁగాని, చెల్లింపఁబడిన పన్నును ఏ సంవత్సరమునకును వాయిదాకును జమపెట్టవలయునని సదరు రయితు కోరెనో ఆ సంవత్సరమునకును వాయిదాకును జమపెట్టుటకుఁగాని, భూస్వామి, తగిన హేతువు లేకుండ, నిరాకరించినయెడల, కలెక్టరునెదుట వ్యాజ్యెము తెచ్చి చెల్లింపఁబడిన పన్ను మొత్తమునకు లేక కిమ్మతుకు ఇబ్బడికి మించకుండ (కాంపెన్సేషను) ప్రతీకారమును అతనివద్దనుండి రాఁబట్టుకొనుటకు సదరు రయితుకు హక్కు కలదు.

చెల్లింపవలసిన స్థలము.

66. రయితు తన పన్నును ఈ యాక్టు ననుసరించి ధరావతు చేయఁగూడిన సంగతులలోతప్ప పైకమును భూస్వామియొక్క గ్రామపుకచ్చేరియందైనను, లేక అధీనభూమి ఉండెడిగ్రామమునకు అయిదు మైళ్లకులోఁగానుండునట్టియు భూస్వామి అందుకని నేమించునట్టియు వేఱొక అనుకూలమైన స్థలమందైనను, చెల్లింపవలయును;

అయినను, లోకల్ గవర్నమెంటువారు నిర్ణయించునట్టి విధుల ననుసరించి రయితులు తమపన్నును పోస్టల్ మనియార్డర్లద్వారా భూస్వామికి చెల్లింపవచ్చును.

మఱియును, పన్ను ధాన్యరూపముగా చెల్లింపవలసి యుండునపుడు, అది యధీనభూమియుండు గ్రామములోని భూస్వామియొక్క

కణేజమువద్ద నయినను లేక గ్రామమునకు పదిమయిళ్లకులోఁగా భూస్వామి అందువిషయమై ఏర్పాటు చేయునటువంటి వేఱె కణేజమువద్ద నయినను ఒప్పగింపవలయును.

పన్నును పుచ్చుకొనుటకు భూస్వామిగా అంగీకరింపఁబడిన లేక నియమింపఁబడిన మనుష్యుని రసీదుయొక్క ఫలము.

67. భూస్వామికి పన్ను చేరవలసియుండు నెడల, పన్నును పుచ్చుకొనుటకుఁగాను 3 వ సెక్షనుయొక్క (5) వ సబ్ సెక్షనునుబట్టి భూస్వామిగా అంగీకరింపఁబడిన లేక నియమింపఁబడిన మనుష్యుఁడు, ఆ విషయమై చెల్లింపఁబడిన యే పైకమునకుఁగానయినను ఇచ్చిన రసీదు, ఆ పన్ను చెల్లించివేయఁబడిన దనుటకు చాలినంత రుజువుగా నుండును. పన్ను చెల్లింపవలసియుండు మనుష్యుఁడు, అట్లు అంగీకరింపఁబడిన లేక నియమింపఁబడిన మనుష్యుఁడు తెచ్చిన దావాకు, పన్ను ఒక మూఁడవ మనుష్యునికి చేరవలసియున్నదని ఎదురువాదము చేయుటకు అతనికి హక్కు ఉండదు. అయినను, ఈ సెక్షనులో నుండున దేదియును అట్లు అంగీకరింపఁబడిన లేక నియమింపఁబడిన భూస్వామిమీఁద అట్టి మూఁడవ మనుష్యునికిఁగల యే పరిహారమునుగాని బాధింపదు.

పన్నును ధరావతు ఉంచుట.

పన్నును ధరావతు ఉంచుటకు దరఖాస్తు.

68. (1) ఈ క్రిందివిషయములలో ఎందులోనయినను, పన్ను బాకీయుండి దానిని ద్రవ్యరూపముగా చెల్లింపవలసియున్నపుడు, అనఁగా—

(a) రయితు తాను బాకీగానున్న పన్నుకుఁగాను పైకమును ఇయ్యవచ్చినపుడు భూస్వామి దానిని తీసికొనకగాని దానికి రసీదును ఇయ్యకగాని నిరాకరించినపుడు;

(*b*) ఆ పన్ను ఇద్దఱికి లేక యెక్కువమంది మనుష్యులకు ఉమ్మడిగా చెల్లింపఁదగియుండి ఆ పైకమునకు ఆ మనుష్యుల ఉమ్మడిరసీదును రయితు పొందఁజాలక యున్నపుడును, వారి తరఫున పన్నును పుచ్చుకొను టకు ఏ మనుష్యుఁడును అధికారము పొంది యుం డనపుడును; లేక

(*c*) ఆ పన్నును వసూలుచేయుటకు హక్కు తమ కున్నదని యిద్దఱుగాని యెక్కువమందిగాని ప్రత్యేకము ప్ర త్యేకముగ అడుగునపుడు, లేక బాకీ యయినపన్ను ను పుచ్చుకొనుటకు ఎవనికి హక్కు ఉన్నదో దాని విషయమై రయితుకు వాస్తవమైన సందేహము కలు గునపుడు;

అప్పుడు బాకీగానున్న ఆ పన్నుమొత్తమును యావత్తు సదరు కలెక్టరు ఆఫీసులోఁగాని లోకల్ గవర్న్మెంటువారు నేమించునట్టి వేఱె ఆఫీసరుయొక్క ఆఫీసులోఁగాని ధరావతు ఉంచుటకు సెలవుకుఁగాను సదరు రయితు సదరు కలెక్టరుకుఁగాని ఆ వేఱె ఆఫీసరుకుఁగాని ఒక వ్రాఁతమూలమైన దరఖాస్తును పెట్టుకొనవచ్చును.

(2) ఆ దరఖాస్తులో అది యేకారణములమీఁద చేయఁబడి నదో వాని వివరణము తెలిపియుండవలయును, మఱియు చెల్లించెడి ఆ పైకమును పలానిపద్దుకు లేక పద్దులకు జమపెట్టవలయునని తెలుపవ లయును; అదిగాక దానిలో—

సంగతి (a) లో, ఆ ధరావతు ఎవని లెక్కలో జమ వ్రాయ వలెనో వాని పేరు తెలుపవలయును ;

సంగతి (b) లో, ఎవరికి పన్ను బాకీగానున్నదో ఆ మను

ష్యులయొక్క లేక వారిలో ఎన్నిమందిని రయితు ఉదాహరింపఁగలిగి యుండునో అన్నిమందియొక్క పేర్లు తెలుపవలయును ; మఱియు

సంగతి (c) లో, పన్ను కడపట ఎవరికి చెల్లింపఁబడినదో ఆ మనుష్యుని లేక మనుష్యుల యొక్కయు, ఇప్పుడు దాని అడుఁగునట్టి మనుష్యుని లేక మనుష్యులయొక్కయు పేర్లు, తెలుపవలయును.

(3) ఆ దరఖాస్తు ప్లెయింటువలెనే చేవ్రాలు చేయఁబడి నిరూపింపఁబడవలయును, మఱియు దానితోఁగూడ కన్పులకుఁగాను లోకల్ గవర్న్మెంటువారు విధిద్వారా నిర్ణయించునట్టి పైకమును పంపవలయును.

రెవిన్యూ ఆఫీసులో ధరావతుగా ఉంచినందుకు రసీదు సరియైన చెల్లుచీటి అగుట.

69. (1) కలెక్టరుకుఁగాని పై కడపటి సెక్షనునుబట్టి యెవరికి దరఖాస్తు చేసికొనఁబడునో అట్టి వేఱె ఆఫీసరుకుఁగాని, దరఖాస్తుదారుఁడు ఆ సెక్షనును అనుసరించి పన్నును ధరావతుగా ఉంచుటకు హక్కు కలిగియున్నట్లు అగపడిన పక్షమున, అతఁడు ఆ మొత్తమును పుచ్చుకొని దానికి ఒక రసీదు ఇయ్యవలయును.

(2) పైని చెప్పినట్లు ధరావతుగా ఉంచినట్టి పన్ను మొత్తమునకు, ఈ సెక్షనునుబట్టి యియ్యఁబడిన రసీదు, చెల్లుచీటిగానుండి—

పై కడపటి సెక్షనుయొక్క (a) సంగతిలో, ఆ ధరావతు ఎవనిలెక్కలో జమవ్రాయఁబడవలయునని దరఖాస్తులో ఉదాహరింపఁబడియున్నదో ఆ మనుష్యుఁడు,

ఆ సెక్షనుయొక్క (b) సంగతిలో, ఎవరికి ఆ పన్ను బాకీగానున్నదో ఆ మనుష్యులు, మఱియు

ఆ సెక్షనుయొక్క (c) సంగతిలో, ఆ పన్ను పుచ్చుకొనుటకు హక్కు కలిగిన మనుష్యుఁడు, ఆ పన్ను మొత్తమును పుచ్చుకొనిన ఎట్లో ఆ విధముననను అంతవఱకును చెల్లును.

ధరావతు తీసికొన్నట్లు ప్రకటన.

70. (1) ఆ ధరావతును తీసికొన్న కలెక్టరుగాని వేఱె ఆఫీసరుగాని దానిని పుచ్చుకొన్నదానిగుఱించి ఒక ప్రకటనను ముఖ్యమయిన విషయము లన్నిటిని అందులో వివరించి తన ఆఫీసులో వెల్లడియయిన స్థలమందు ఆ డిస్ట్రిక్టుయొక్క దేశభాషలో వెంటనే అంటింపించవలయును.

(2) ఏ తేదిని అట్టి ప్రకటన అంటింపఁబడినదో దాని వెంబడి పదునేనుదినముల కాలములోఁగా దీని వెంబడి తర్వాత సెక్షనును అనుసరించి ధరావతు మొత్తమును ఇచ్చివేయనిపక్షమున, సదరు కలెక్టరుగాని వేఱె ఆఫీసరుగాని వెంటనే—

68 వ సెక్షనుయొక్క (a) సంగతిలో, ఆ ధరావతు ఎవని పేర జమవ్రాయవలయునని దరఖాస్తులో నుదాహరింపఁబడినదో ఆ మనుష్యునకు ఆ ధరావతు పుచ్చుకొన్నట్లు నోటీసును జారీచేయించవలయును ;

ఆ సెక్షనుయొక్క (b) సంగతిలో, ధరావతు పుచ్చుకొన్నట్లు ఒక నోటీసు, భూస్వామియొక్క గ్రామపు ఆఫీసునందు లేక వాసస్థలమందును, మఱియు ఏ గ్రామములో ఆ యధీనభూమి యున్నదో అందులో వెల్లడియైన ఒక స్థలమందును దానిని తగిలింపించవలయును ; మఱియు

ఆ సెక్షనుయొక్క (c) సంగతిలో, ఎవరికి ధరావతుకు దావా కలదని లేక ఆ ధరావతును పుచ్చుకొనుటకు హక్కు

కలవని కలెక్టరు లేక వేజె ఆఫీసరు నమ్ముటకు కారణ మున్నదో అట్టి ప్రతి మనుష్యునకు అదేవిధమగు నోటీసును జారీచేయించవలయును.

ధరావతును చెల్లించుట లేక మరల వాపసుచేయుట.

71. (1) ఆ ధరావతు మొత్తమును కలెక్టరుగాని వేజె ఆఫీసరుగాని. యెవఁడు దానికి హక్కు కలిగి యున్నాఁడని తనకు కనిపించునో అట్టియే మనుష్యునకైన ఇచ్చివేయవచ్చును, లేక తనకు యుక్తమని తోఁచునెడల, అట్లు హక్కుగల మనుష్యుఁడెవఁడైనది సివిల్ కోర్టువారు తీర్పుచేయువఱకు ఆ మొత్తమును ఉంచుకొనవచ్చును; మఱియు, ఆ ధరావతు 68 వ సెక్షనుయొక్క (1) టి సబ్ సెక్షనులోని (c) క్లాజు ననుసరించి చేయఁబడియుండి, వివాదపడు పార్టీలు పైకము చెల్లించునట్లు ఉమ్మడిగా దరఖాస్తు చేసికొననిసంగతిలో, అట్లు తీర్పు చేయువఱకు ఆ మొత్తమును ఉంచుకొనవలయును.

(2) ఆ పైకమును మనిఆర్డర్ కమిషను త్రోసికొని లోకల్ గవర్న్మెంటువారు నిర్ణయించెడు విధుల ననుసరించి పోస్టల్ మనిఆర్డర్ ద్వారా చెల్లించవచ్చును.

(3) ధరావతు ఎప్పుడు చేయఁబడెనో ఆ తేదినుండి మూఁడుసంవత్సరములు గడచి పోకమునుపు ఈ సెక్షనును అనుసరించి పైకము ఏదియు ఇచ్చివేయఁబడనిపక్షమున, తగిన కోర్టువారి విరుద్ధమైన హుకుము ఏదియు లేనిచో, ధరావతు ఉంచినవాఁడు దరఖాస్తుపెట్టుకొని యెవరివద్ద పన్ను ధరావతు ఉంపఁబడ్డదో ఆ కలెక్టరుగాని వేజె ఆఫీసరుగాని యిచ్చిన రసీదును మరల ఇచ్చివేసినమీఁదట, లేక ధరావతు చేసినందులకై కలెక్టరుకు చాలినంతటిదిగ తోఁచునట్టి వేజె ఆధారమును చూపినమీఁదట, అతనికి ఆ ధరావతు మొత్తమును మరల వాపసు చేయవచ్చును.

అట్టి యే ధరావతు మొత్తమునైనను పుచ్చుకొనుటకు హక్కు కలిగిన యే మనుష్యుఁడైనను ఈ సెక్షనును అనుసరించి అది యెవనికి ఇచ్చివేయఁబడినదో ఆ మనుష్యునివద్దనుండి సివిల్ కోర్టులో వ్యాజ్యము ద్వారా రాఁబట్టుకొనుటకు ఈ సెక్షనులో నుండునది యేదియు ఆటంకపఱచదు.

వ్యాజ్యములు తెచ్చుటకు ఆటంకపర్చుట.

72. 68 నుండి 71 వఱకుఁగల సెక్షన్లననుసరించి ధరావతునుగుఱించి కలెక్టరుగాని వేఱె ఆఫీసరుగాని చేసిన యే సంగతినిగుఱించియైనను ఆలోచనసభలోని యిండియా స్టేట్ సెక్రెటరిగారిమీఁదఁగాని యే గవర్న్మెంటు ఉద్యోగస్థుని మీఁదఁగానివ్యాజ్యము లేక యితర చర్య యేదియు జరిగింపఁగూడదు.

మహాసూలును మదింపు వేయుటయు పంపకము చేయుటయు.

పంటయొక్క స్వాధీనమును గుఱించి హక్కులును జవాబుదారీలును.

73. (1) పొలములోనున్న పంటను మదింపువేసి పన్ను పుచ్చుకొనునపుడు, రయితుకు ఆ పంటను తనయధీనములోనే ఉంచుకొనుటకు స్వాతంత్ర్య ముండును.

(2) మహాసూలును పంపకము చేసి పన్ను పుచ్చుకొనునపుడు, ఆ మహాసూలు పంపకము చేయఁబడువఱకు రయితు దానిని యావత్తు తన యధీనములో నుంచుకొనుటకు హక్కుదారుఁడగును; కాని, సదరు మహాసూలును సరియైన కాలములో క్రమముగా పంపకము చేయుటను ఆటంకపఱుపఁగు కాలములోఁగాని విధముగాఁగాని ఆ మహాసూలులోని యే భాగమునయినను :ఊడ్పుకళ్లములోనుండి తీసికొనిపోవుటకు వానికి హక్కు ఉండదు.

(3) భూస్వామిదియొక్క ఆటంక మేమియు లేకుండనే ఈ రెండు సందర్భములలో దేనిలోనైనను కృషివిషయముల క్రమపద్ధతిని

బట్టి మహసూలును కోసి నుఋపిడి చేయుటకు రయితుకు హక్కు కలదు. కాని, పంటను కోయుటకు లేక సేకరించుటకు ఆరంభించుటకు పూర్వము రయితు తా నట్లు చేయఁదలఁచి యున్నానని భూస్వామికిఁగాని అతని యుత్తరువు పొందిన యేజెంటుకుఁగాని యుక్తమైన వర్తమానము తెలియఁజేయవలయును.

(4) పంటను లేక మహసూలును క్రమముగా మదింపు వేయుటనుగాని పంపకము చేయుటనుగాని ఆటంకపఱచునట్టి కాలములో లేక అట్టివిధమున పంటలోఁగాని మహసూలులోఁగాని ఏమాత్రమున యిన రయితు కోయుపక్షమున లేక తీసికొనిపోవు పక్షమున. పొరుగున నుండు అదేమాదిరి భూమిలో ఆ కోఁతకే యెంత పూర్ణ ఫలము ఆయెనో అంత పూర్ణముగా ఆ మహసూలు ఉండియున్నట్లు గ్రహింపఁబడును.

మహసూలును మదింపువేయుటకుఁగాను లేక పంపకము చేయుటకుఁగాను లేక తీర్మానించుటకుఁగాను కలెక్టరుకు దరఖాస్తుపెట్టుకొనుట.

74. పన్నును పంటమదింపు మూలముగఁగాని మహసూలు పంపకము మూలముగఁగాని తీసికొనునప్పుడు—

(*a*) మదింపు వేయుటకుఁగాని పంపకము చేయుటకుఁగాని సరియయినకాలములో భూస్వామియైనను రయితైనను తానుగఁగాని లేక యేజెంటు మూలముగఁగాని హాజరుగాక తప్పిపోయిన పక్షమున; లేక

(*b*) పంటయొక్క పరిమితిని గుఱించియును కిస్మతును గుఱించియును లేక 73 వ సెక్షనుయొక్క (4) వ సబ్ సెక్షను ననుసరించి పూర్ణమైనపంట యింతమాత్రమనుటను గుఱించియు, లేక ఆ మహసూలుయొక్క పంపకమునుగుఱించియును,వివాదముడున్న పక్షమున,

మహాసూలును పంపకము చేయుటకుఁగాని మదింపు వేయుట కుఁగాని తీర్మానించుటకుఁగాని, ఒక యుద్యోగస్థుని నేమించుమని యిరు పార్టీలలో నొకరు కలెక్టరుకు దరఖాస్తు పెట్టుకొనవచ్చును.

సదరు దరఖాస్తుతోఁడ దరఖాస్తుదారుఁడు, లోకల్ గవర్న్మెంటు వారు ఇందువిషయమై చేయఁబడు విధులలో నిర్ణయించునట్టి రుసు మును ధరావతు చేయవలయును.

75. (1) అట్టి దరఖాస్తు అందినమీఁదట కలెక్టరు, నోటీసులో వివరింపఁబడు తారీఖునను కాలమందును స్థలమందును హాజరు రమ్మని యెదురుపార్టీకి వ్రాఁతమూలమైన నోటీసు జారీచేసి, అట్టి పంపకముగాని మదింపుగాని తీర్మానముగాని చేయఁగలందులకై ఒక ఆఫీసరును నియోగింపవలయును.

అట్టి దరఖాస్తుపైని చర్య.

(2) పన్ను పంపకముమూలముగానైనను మదింపుమూల ముగానైనను పుచ్చుకోఁబడుట లేదనిగాని పన్ను ఏదియు చెల్లింపవల సినది లేదనిగాని యెదురుపార్టీ ఆక్షేపించునెడల, అట్లు నియోగింపఁ బడిన ఆఫీసరు సదరు ఆక్షేపమును రెకార్డుచేయవలసినది, కాని, అతఁ డు ఇందులో నీక్రింద నిబంధించియున్న ప్రకారము జరిగింపవలయును.

(3) నేమింపఁబడిన తేదినిగాని దానికి పూర్వముగాని సదరు వివాదము రాజీ కానియెడల, అతఁడు మహాసూలును పంపకముచేయు విషయములో, లేక పంటను మదింపువేయు లేక తీర్మానించు విషయ ములో సాయముగా నుండుటకై యిరుగుపొరుగున వాసముచేయువాని నొకనిని నిర్ణయింపఁబడిన కాలములోపల అస్సెసరుగా నేమించుకొను మని సదరు పార్టీలలో ప్రతివానిని కోరవచ్చును.

(4) ఆ పార్టీలు ఇరువురిలో నెవరుగాని హాజరగుటకు తప్పినయెడల లేక అస్సెసరును నేమించుటకు తప్పినయెడల, అట్లు నియోగింపఁబడిన ఆఫీసరు వానికిఁగాను ఒక అస్సెసరును నేమింపవలయును.

(5) అట్లు నియోగింపఁబడిన ఆఫీసరు. సదరు అస్సెసర్ల అభిప్రాయములను రెకార్డుచేయవలయును, మఱియు తాను తీర్పుచేయు నప్పుడు ఆ యభిప్రాయములను యోచింపవలయును; కాని, అతఁడు వానిచే బద్ధుఁడై యుండఁడు.

(6) మహసూలును పంపకముచేయు విషయములో, పార్టీలు ఆ తీర్పును ఒప్పుకొనునెడల, సదరు పంపకము ఆ ప్రకారము చేయవలయును. పార్టీలు అట్టి పంపకమును ఒప్పుకోనియెడలను, పైరుయొక్క మదింపుమీఁద పన్ను చెల్లింపవలసియుండు యావత్తు సంగతులలోను, లేక పూర్ణమైన పంటయొక్క కిమ్మతును నిశ్చయింపవలసియున్నప్పుడును, సదరు నియోగింపఁబడిన ఆఫీసరు ఆ మహసూలునుగాని పంటనుగాని మదింపువేసి, చెల్లింపవలసిన పన్నును నిశ్చయింపవలయును. అంతట అతఁడు పార్టీలకు నోటీసు ఇచ్చిన తర్వాత తన తీర్పు చెప్పి దానిని తన చర్యలను గుఱించిన రిపోర్టుతోఁగూడ కలెక్టరుకు పంపవలయును.

(7) అస్సెసర్లు రెవిన్యూ ఆఫీసరుతో ఏకీభవించునెడల తప్ప, తీర్పుచెప్పిన తేదికి తర్వాత ఒక వారములోఁగా సదరు పార్టీలు ఆ తీర్పుపైన ఆక్షేపములు దాఖలు చేయవచ్చును; కలెక్టరు ఆ యాక్షేపములను విని, అగత్యమని తోఁచెడి వేఱె విచారణ (యేదైన నున్నయెడల) చేసి, వానిమీఁద ఉత్తరువులు జారీచేయవలయును. అస్సెసర్లు రెవిన్యూ ఆఫీసరుతో ఏకీభవించునపుడు, సదరు తీర్పు ఆఖరుదై యుండవలెను.

పన్ను, పంపకము మూలముగా లేక మదింపుమూలముగా చెల్లింపఁదగినది కాదనిగాని లేక పన్ను ఏదియు చెల్లింపవలసినది లేదనిగాని ఆక్షేపము దాఖలు చేయఁబడినయెడలను, ఆ యాక్షేపమును కలెక్టరు ఆమోదించునెడలను, అతఁడు ఆ తీర్పును రద్దుచేయవచ్చును.

వేఱె యే యాక్షేపమైన దాఖలు చేయఁబడినయెడలఁగాని, లేక ఆక్షేపము ఏదియు దాఖలు చేయఁబడని యెడలఁగాని, కలెక్టరు సదరు తీర్పును కాయపఱ్చవచ్చును లేక పార్టీలు చెప్పుదానిని వినుటకు వారికి వీలు కలుగఁజేసిన తర్వాత తనకు యుక్తమని తోఁచునట్లు సదరు తీర్పును సవరింపవచ్చును; మఱియు అతఁడు పన్నును, కర్చులు ఏవైన నున్నయెడల వానిని, చెల్లించుటకై ఉత్తరువు జారీచేయవచ్చును; అట్టి యుత్తరువు ఆఖరుదై యుండును, మఱియును పన్ను బాకీలకుఁగానైన డిక్రీవలెనె చెల్లుబడి కలిగి యుండును.

(8) ఈసెక్షను ననుసరించిన యేచర్యలలోఁగాని, కలెక్టరు, మదింపు వేయఁబడువఱకుఁగాని పంపకము చేయఁబడువఱకుఁగాని మహసూలును తీసికొని పోకుండ ఉత్తరువుమూలముగా ఆఁపవచ్చును.

ప్రవేశించుటకుఁగల అధికారము.

76. పంపకముచేయు నిమిత్తమును మదింపువేయునిమిత్తమును, సదరు నియోగింపఁబడిన ఆఫిసరు, తన అస్సెసర్లతోఁగూడ, మహసూలు ఏ భూమిమీఁద లేక యే కట్టడములోపల ఉన్నదో ఆ భూమిలో లేక కట్టడములో ప్రవేశింపవచ్చును.

## 6 వ అధ్యాయము.

### పన్నును, వ్యాజ్యేముచేసిగాని చరాస్తిని లేక అధీనభూమిని జప్తుచేసి విక్రయించిగాని రాఁబట్టుకొనుట.

బాకీలను వ్యాజ్యేముచేసిగా నిజప్తుచేసిగానిరాఁబట్టుకొనుట.

77. పన్నుబాకీ చెల్లింపవలసినదిగా ఏర్పడిన తర్వాత ఎప్పుడయినను—

(i) భూస్వామి సదరు బాకీని రాఁబట్టుకొనుటకు, కలెక్టరు నెదుట వ్యాజ్యేము తేవచ్చును, మఱియు

(ii) భూస్వామి, కడచిన పండ్రెండు నెలలోఁగా బాకీయేర్పడిన పన్నువిషయమై ఈ యాక్టునుబట్టి తేనకు హక్కుగల మఱి యే యితర పరిహారమునకైన తోడుగ, అట్లు చెల్లింపక తప్పిపోయిన రయితుయొక్క చరాస్తిని లేక పైర్లను లేక సదరు తప్పిపోయిన రయితుయొక్క అధీనములోనున్న భూమియొక్క లేక చెట్లయొక్క మహసూలును, తేన సొంత జవాబుదారి మీఁద జప్తుచేయవచ్చును.

అయినను ఈ క్రింది వస్తువులను బాకీనిమిత్తము జప్తుచేయఁగూడదు:—

(*a*) సదరు తప్పిపోయినవానియొక్కయు, వాని భార్యయొక్కయు బిడ్డలయొక్కయు ధరించు వస్త్రములను, వంటపాత్రలను, పడకలను, పక్కబట్టలు వగైరాలను, తేన మతాచారప్రకారము ఒక స్త్రీ ఇచ్చివేయఁగూడని ధరించెడి యాభరణములను;

(b) అతని నాగళ్లను, నాగుబడి పనిముట్లను, దుక్కి పశువులను, రయితుగాని సాగుబడి చేయువాఁడుగాని చేర్చిపెట్టిన యెరువును మఱుసటి సంవత్సరమందు అధీనభూమిని క్రమముగాసాగుబడి చేయుటకు అగత్యమై యుండునట్టి వి త్తనపు ధాన్యమును.

78. (1) జప్తుచేయుటకు పూర్వముగాని జప్తుచేయునప్పుడుగాని, భూస్వామిగానైనను క్రమముగా అధికారము పొందిన అతని యేజెంటుగానైనను ఉండఁగలట్టి జప్తుదారుఁడు, బాకీ మొత్తమును తెలుపుచు వ్రాఁతమూలమయిన యొక డిమాండును, ఆ డిమాండు ఏ కారణముల చేత చేయఁబడుచున్నదో ఆ కారణములను తెలిపెడి లెక్కతో సహా, బాకీ చెల్లింపక తప్పిపోయినవానికి అందఁజేయవలయును.

జప్తు ఎట్లు చేయవలయును.

(2) సదరు డిమాండులోను లెక్కలోను జప్తుదారుఁడు తేది వేసి సంతకముచేసి దాని నకలును, చెల్లింపక తప్పిపోయినవానికిఁగాని అతని మామూలు వాసస్థలమయినది జప్తు ఏభూమికి సంబంధించియున్నదో ఆ భూమికి సమీపమందుండునపక్షమున అట్టి వాసస్థలమందుండు అతని కుటుంబములో యుక్తవయస్సువచ్చిన యేమగవానికయినఁగాని, చెల్లింపక తప్పిపోయినవానిచే అధికారము పొందిన యే జెంటుకుఁగాని, బాకీ ఏ తేదిని చెల్లింపవలసి యుండెనో ఆ తేదినుండి ఒక సంవత్సరము లోఁగా ఇచ్చి (సదరు డిమాండును లెక్కను) అతనికి అందఁజేయవలెను; లేక అట్లు అందఁజేయుట సాధ్యము కానిపక్షమందు, నోటీసు నకలును, సదరు నోటీసు ఏ భూమికి సంబంధించినదో ఆ భూమిలో వెల్లడియయిన తావులో అంటించుట ద్వారా అందఁజేయవలెను. సదరు డిమాం

డులో...

(a) రావలసిన బాకీమొత్తమును, వడ్డీ ఉన్నయెడల దానిని,

(b) ఏ యధీనభూమి విషయమై అది రావలసియున్నదో దానిని,

(c) ఏ కాలమునకుఁగాను అది రావలసి యున్నదో ఆ కాలమును, వివరింపవలయును.

బాకీకి జప్తు తగినంతదిగా నుండవలెను: సొత్తుజాబితానుఖామందునకు ఇచ్చి నకలును విక్రయించు ఆఫీసరునకుపంపవలెను

79. (1) డిమాండు తత్క్షణమే చెల్లింపఁబడిననే తప్ప, జప్తుదారుఁడు బాకీమొత్తమునకును జప్తుకర్చులకును కావలసినంతమట్టుకు సొత్తును జప్తు చేయవచ్చును. మఱియు అతఁడు సదరు సొత్తుకు ఒక జాబితాను లేక వివరణమును వెంటనే తయారుచేసి దానిలో తేది వేసి సంతకముచేసి, దానిని తప్పిపోయినవానికి ఆలస్యము చేయకుండ పైకడపటి సెక్షనులో వ్రాఁతమూలమైన డిమాండును అందఁజేయుటకు నిబంధించియుండు ప్రకారము అందఁజేయవలెను అట్టి జాబితాయొక్క లేక వివరణముయొక్క నకలును, వ్రాఁతమూలమైన డిమాండుయొక్కయు లెక్కయొక్కయు నకలును, బాకీలకుఁగాను జప్తు చేయఁబడిన సొత్తును విక్రయించుటకు 1839 వ సంవత్సరపు మదరాసు 7 వ ఆక్టునను సరించి అధికారము పొందినట్టియు ఇందులో నికముందు విక్రయించు ఆఫిసరు అని చెప్పఁబడునట్టియు పబ్లిక్ ఆఫిసరునకు, తప్పిపోయినవానికి డిమాండును అందఁజేసిన పది దినములలోఁగా, జప్తుదారుఁడు పంపవలెను.

(2) సాగుబడి చేసినవాఁడు తప్పిపోయినవాఁడు కాకుండ ఇతరుఁడని జప్తుదారునికి తెలిసియుండునెడల, డిమాండుయొక్కయు సదరు సొత్తు జాబితా లేక సొత్తువివరణము యొక్కయు నకలును అదే విధముగానే సదరు సాగుబడి చేసినవానికి అందఁజేయవలెను లేక యియ్యవలెను.

80. జప్తుచేయుటకు అధికారముగల మనుష్యుఁడు నెమ్మదికి ఏ భంగమును కలుగకుండ ఆఁపుటకు ఆవశ్యకమయిన సాహాయ్యమునకుఁగాను అత్యంత సమీపమందుండు పోలీసు స్టేషనులో అడుగుకొనవచ్చును. అట్లు అడుగుకొనఁబడిన యాయధికారి అట్టిపని నిమిత్తము అట్టి జప్తుకాలమందు హాజరయి యుండునట్లు ఒక పోలీసు ఆఫిసరునుగాని యెక్కువమందినిగాని పంపవలయును.

జప్తుదారుఁడు పోలీసు సాయమును పొందవచ్చును.

81. జప్తు అతివిశేషముగా నుండఁగూడదు; అనఁగా, జప్తుచేయఁబడిన యాస్తియొక్క విలువ, రావలసిన బాకీ మొత్తమునకును జప్తుకర్చులకును సాధ్యమగునంతమట్టుకు సమానముగా ఉండవలయును.

జప్తు బాకీకి తగినంతదిగా ఉండవలయును.

82. జప్తు సూర్యోదయమునకు తర్వాతను సూర్యాస్తమయమునకు ముందును చేయవలయును, గాని వేఱె వేళలందు చేయఁగూడదు.

జప్తువేళ.

83. (1) జప్తు చేయఁబడియున్నను నిమిత్తము లేకుండ, కోయకుండ నిలిచియున్న పైర్లను సేకరింపఁబడని యితర ఫలితమును, సదరు పైరుయొక్క సొంతగాఁడు కాపాడవచ్చును, మఱియు జప్తుదారునికి నోటీసు ఇచ్చిన తర్వాత కోయవచ్చును సేకరింపవచ్చును.

మహాసూలును కోసి భద్రము చేయుటకు హక్కు.

(2) ఆ పైరుయొక్క సొంతగాఁడు సదరు పైరును లేక ఫలితమును కాపాడుటకు, కోయుటకు లేక సేకరించుటకు అశ్రద్ధ చేయునెడల, జప్తుదారుఁడు సదరు సొంతగాని కర్చుమీఁద అట్లు చేయవచ్చును.

(3) జప్తు చేయఁబడిన సొత్తును ఆ కార్యమునకై జప్తుదారునిచే నేమింపఁబడు మనుష్యుని హవాలాలో ఉంచవలయును; అట్లు నేమింపఁబడు మనుష్యుఁడు దానిని సమీపమందుండు అనుకూలమైన యొకస్థలమందు ఖాంతగాని కచ్చుమీఁద నిలువచేయవలయును.

జప్తుదారుఁడు ఏ స్థలములను బలాత్కారముగా తెఱవవచ్చును.

84. జప్తుదారుఁడు, ఏలాయమునయినను, పశువులకొట్టమునయినను, ధాన్యపుకొట్టునయినను, గిడ్డంగినయినను, విడియింటినయినను, లేక వేఱె కట్టడమునయినను, బలవంతముగా తెఱచుట చట్టపుసమ్మతముగా నుండును, మఱియు అతఁడు వెలుపటి తలుపు తెఱవఁబడియుండెడి యే వాసగృహములోనయినను ప్రవేశింపవచ్చును, మఱియు బాకీ చెల్లింపక తప్పిపోయినవానిదయినట్టియు అచ్చట ఉంపఁబడినట్టియు ఆస్తిని జప్తుచేయుటకొఱకు అట్టి వాసగృహములోని యేగది తలుపునయిన పగులఁగొట్టి తెఱవవచ్చును; అయినను, ఇందులో ఇఁకమీఁద నిబంధింపఁబడి యున్న ప్రకార మయిననే తప్ప అట్టి నివాసగృహములో జనానాకు లేక స్త్రీల నివాసమునకు ఉపయోగపడుచుండు ఏ గదియొక్క తలుపునయినను పగులగొట్టి తెఱచుటగాని అందుప్రవేశించుటగాని యెన్నఁడును అట్టి జప్తుదారునికి చట్టపు సమ్మతమై యుండనేరదు.

పోలీసు ఆఫీసరు యెదుట తలుపులు బలవంతముగా తెఱచి జనానాలో ప్రవేశించుటకు అధికారము.

85. పైకము చెల్లింపక తప్పిపోయినవాని యాస్తి, వెలుపటి తలుపు మూయఁబడియున్న నివాసగృహమందుఁగాని లేక యేకాంతస్థలమని దేశాచారమునుబట్టి యెంచఁబడుచు స్త్రీలకుఁగాను ఉపయోగపడుచుండునట్టి యే గదులలోఁగాని ఉంపఁబడియున్నదని యెంచుటకు జప్తుదారునికి కారణమున్నయెడల, అట్టి జప్తుదారుఁడు అతి

సమీపమందలి పోలీసు స్టేషను హవాలాకలిగియుండు ఆఫీసరునకు ఆ సంగతిని రిపోర్టుచేయవలయును. అందుపైని ఆ స్టేషను చార్జి కలిగి యుండు ఆఫీసరు ఆ స్థలమునకు ఒక పోలీసు ఆఫీసరును పంపవలయును. అతని యెదుట జప్తుదారుఁడు, అట్టి నివాసగృహముయొక్క వెలుపటి తలుపును మఱియు ఆ గృహములో జనానా తప్ప మఱి యే గదియొక్కయయిన తలుపును బలవంతముగా తెఱవవచ్చును. మఱియు జప్తు దారుఁడు, జనానాలో నుండు స్త్రీలను మఱొక చోటికి పంపుటకు క్రమమయిన నోటీసు ఇచ్చినతర్వాతను, (వారు దేశాచారములనుబట్టి బహిరంగముగా కనఁబడని హోదాగల స్త్రీలైనయెడల) వారిని తగి నరీతిని మఱొక చోటికి పంపుటకు ఉపాయములు కలుగఁజేసినమీఁద టను, పయికము చెల్లింపక తప్పిపోయినవానియాస్తి అచ్చట ఏదయిన ఉంపఁబడియున్నయెడల దానిని జప్తుచేయుటకయి, పోలీసు ఆఫీసరు నెదుట, జనానా గదులలో ప్రవేశింపవచ్చును. అట్టి యాస్తియేద యిన కనఁబడినయెడల, దానిని వెంటనే అట్టి గదులలోనుండి తొలఁగించి, ఆ గదులలో అదివఱకు ఉన్నవారు మరల అందు ప్రవేశించుటకు వీలుగా నుంపవలయును.

జప్తుచేయఁబడిన పశువులను లేక వస్తువులను వాడుకొనఁగూడదు.

86. జప్తుదారుఁడు జప్తుచేయఁబడిన యెడ్లచే లేక పశువులచే పని చేయింపఁగూడదు లేక జప్తుచేయఁబడిన యాస్తిని వాడుకొనఁగూడదు. పశువులకు లేక యితర జీవజంతువులకు కావలసిన యాహారమును అతఁడు పెట్టవలయును, మఱియు అందులకుఁగాను అయ్యేడి కర్చు చెల్లింపక తప్పిపోయిన రయితుమీఁద కర్చుగా నేర్పడి జప్తుకర్చుగా రాఁబట్టుకొనఁదగి యుండును.

డిపాసిటు చేసిన మీఁదటఁ గాని పైకము ఇచ్చిన మీఁదటఁ గాని లేక జామీను ఇచ్చినమీఁదటఁగాని జప్తును విడుదలచేయుట.

87. (1) ఈ యధ్యాయమునుబట్టి జప్తుచేయఁబడినమీఁదటను విక్రయమునకుఁ గాను నియమింపఁబడిన తేదికి ముందు ఎప్పుడైనను, పైకము చెల్లింపక తప్పిపోయినవాఁడు, సాగుబడి చేసినవాఁడు లేక ఆస్తి సొంతగాఁడు, 73 వ సెక్షను ననుసరించినట్టి వ్రాఁతమూలమైన డిమాండులో ఉదాహరింపఁబడియున్న మొత్తమును, తర్వాత ఏర్పడిన వడ్డీతోఁడను తగిలిన కర్చులతోఁడను జప్తుదారునికి టెండరు చేయవచ్చును లేక యిచ్చివేయవచ్చును లేక జప్తుదారునికి తృప్తికరముగా జామీను ఇయ్యవచ్చును, అందుమీఁదట ఆ జప్తుదారుఁడు ఆ టెండరును, పైకము చెల్లును, లేక జామీనును గుఱించి వ్రాఁతమూలమగు (అక్నాలెడ్జ్‌మెంట్) చెల్లు చీటిని ఇచ్చి వెంటనే ఆ జప్తును విడుదలచేయవలయును.

(2) జప్తుచేయఁబడిన యాస్తివిక్రయింపఁబడక ముందు ఎప్పుడైనను, తప్పిపోయినవాఁడుగాని, సాగుబడిచేసినవాఁడుగాని లేక జప్తుచేయఁబడిన సొత్తుకు సొంతగాఁడుగాని. 73 వ సెక్షను ననుసరించినట్టి వ్రాఁతమూలమైన డిమాండులో ఉదాహరింపఁబడియున్న మొత్తమును, తర్వాత ఏర్పడిన వడ్డీతోఁడను కర్చులతోఁడను విక్రయించు ఆఫీసరువద్ద చెల్లించినయెడల, సదరు విక్రయించు ఆఫీసరు దానికి రసీదు ఇచ్చి వెంటనే జప్తును విడుదలచేయవలయును.

జప్తుచేయఁబడిన యాస్తి నశించినందుకు లేక దానికి హాని కలిగినందుకు జప్తుదారుని పూచి.

88. జప్తు చేయఁబడిన యాస్తి జప్తుదారునివశములోనుండఁగా, అతఁడు దానిని కాపాడుటకు యుక్తమయినంత జాగ్రత పుచ్చుకొనని కారణముచేత, అది దొంగిలిపోయినయెడల, కనఁబడకపోయినయెడల, చెడిపోయినయెడల లేక నశించిపోయినయెడల, జప్తుదారునిమీఁద సొంతగాఁడు నష్టికిఁగాను కలెక్టరు నెదుట వ్యాజ్యెము తేవచ్చును.

89. జప్తు చేయఁబడియున్న చరాస్తిలో దేనికయిన హక్కు లేక బాధ్యత కలదని దావాచేసెడి మూఁడవ మనుష్యుఁడు, విక్రయపు తేదికిముందు కలెక్టరునకుఁగాని విక్రయము జరిగించు ఆఫీసరునకుఁగాని దరఖాస్తు పెట్టుకోవచ్చును; అంతట కలెక్టరు వెంటనే విచారణచేసి లేక చేయించి, తగినకారణము కనఁబడినయెడల, అట్టి సొత్తు విక్రయమును నిలుపుదల చేయవచ్చును. కలెక్టరు ఆ దావానుగుఱించి తనకుయుక్తమని తోఁచునట్టి హుకుమును జారీచేయనలయును.

జప్తుచేయఁబడినయాస్తిలో మూఁడవ మనుష్యునికిఁగల హక్కునుగుఱించి లేక బాధ్యతను గుఱించి దావా.

90. జప్తుదారుఁడు దరఖాస్తు పెట్టుకొనినమీఁదట,—

జప్తు చేయఁబడకుండ ఆఁపుటకైదగాగా ఎత్తికొనిపోయినట్టి ఆస్తిని లేక జప్తుచేయఁబడినతర్వాత బలాత్కారముగాఁగాని రహస్యముగాఁగాని తీసికొనిపోయినట్టి ఆస్తిని ఒప్పగించుట.

(*a*) బాకీలకుఁగాను జప్తు చేయఁబడకుండ ఆఁపుటకయి పైకము చెల్లింపక తప్పిపోయినవాఁడు చరాస్తిని దగాగా ఎత్తికొనిపోయినాఁడని,

(*b*) ఒకతడవ జప్తుచేయఁబడిన చరాస్తిని ఏ మనుష్యుఁడయినను బలాత్కారముగాఁగాని రహస్యముగాఁగాని తీసికొని పోయినాఁడని,

కలెక్టరుకు తృప్తికరముగా రుజువు చేయఁబడినయెడల, కలెక్టరు జప్తుదారునికి ఆ యాస్తిని ఇచ్చివేయవలయునని లేక దాని విలువను చెల్లింపవలయునని ఆజ్ఞాపించుచు హుకుము జారీచేయవలయును.

91. 89 వ లేక 90 వ సెక్షను ననుసరించి ఆస్తియేదైనను జప్తుదారునికి ఒప్పగించి వేయునట్లుగాని ఇచ్చివేయునట్లుగాని లేక దాని విలువను చెల్లించునట్లుగాని ఆజ్ఞాపించుచు జారీచేసెడి

(కాంపెన్సేషనుకు) ప్రతీకారమునకుఁగాను వ్యాజ్యము.

యుత్తరువువలన తృప్తిఁజెందని యే మనుష్యుఁడయినను, సదరు జప్తుదారునిమీఁద (కాంపెన్సేషనుకు) ప్రతీకారమునకుఁగాను సివిల్ కోర్టులో వ్యాజ్యెము తేవచ్చును.

విక్రయమునకుఁగాను దరఖాస్తు.

92. (1) జప్తుదారుఁడు 79 వ సెక్షనులో చెప్పఁబడినట్టి జాబితాలోఁగాని వివరణములోఁగాని ఉదాహరింపఁబడిన సొత్తును విక్రయించుటకయి విక్రయించు ఆఫీసరునకు జప్తుతారీఖునుండి పదునేను దినములలోఁగా దరఖాస్తు చేసికోవలయును.

(2) అట్టి దరఖాస్తు ఏదియు చేసికోఁబడనియెడల, సదరు సొత్తుమీఁది జప్తు సదరు పదునేనుదినములకాలము ముగిసినంతట అములులోనుండక నిలిచిపోవును.

దరఖాస్తులో నుండవలసిన విషయములు.

93. సదరు దరఖాస్తు వ్రాఁతమూలముగానుండవలయును; మఱియు దానిలో నీక్రింది వివరములు ఉదాహరించి యుండవలయును, అవి యేవనఁగా—

(a) చెల్లింపక తప్పిపోయినవానియొక్కయు, 79 వ సెక్షను (2) వ సబ్ సెక్షనులో నిబంధించియుండు సంగతిలో వ్యవసాయదారునియొక్కయు, పేరును వాసస్థలమును;

(b) బాకీ మొత్తమును;

(c) జప్తు తేదీయును;

(d) జప్తుచేయఁబడిన సొత్తు ఉండుస్థలమును.

నోటీసు అందఁజేయుటకురుసుము.

94. సదరు దరఖాస్తుతోకూడ జప్తుదారుఁడు, నోటీసును అందఁజేయుటకుఁగాను నిర్ణయించి యుండు రుసుమునుకూడ విక్రయించు ఆఫీసరువద్ద ఇయ్యవలయును.

దరఖాస్తుచేరినమీఁదటిచర్య.

95. (1) అట్టి దరఖాస్తును రుసుమును చేరినవెంటనే సదరు విక్రయము జరిగించు ఆఫీసరు, ఆ దరఖాస్తు నకును 79 వ సెక్షనులో ఉదాహరింపఁబడి నజాబితాకును లేక వివరణమునకును నకలొకటి కలెక్టరుకు పంపవల యును, మఱియు చెల్లింపక తప్పిపోయినవానికి ఒక నోటీసు జారీచేసి, డిమాండుచేసిన మొత్తమును చెల్లించుమనిగాని లేక జప్తును ఆక్షేపిం చుటకై సదరు నోటీసు జారీఅయిన తేదినుండి పదునేను దినములలోఁగా కలెక్టరునెదుట వ్యాజ్యెము దాఖలు చేయుమనిగాని కోరవలయును.

(2) 79 వ సెక్షనులోని (2) వ సబ్ సెక్షనులో నిబంధించి యుండు సంగతిలో, అదే విధమైన నోటీసును సాగుబడి చేసినవానికి జారీ చేయవలయును.

(3) విక్రయము జరిగించు ఆఫీసరు సదరు విక్రయమునకై ఒక తారీఖును హుకుముద్వారా నిర్ణయింపవలయును; ఆ దారీఖు అయినది, ఆయా సంగతికి తగినట్లు (1) వ సబ్ సెక్షను లేక (2) వ సబ్ సెక్షను ననుసరించి నోటీసు జారీచేయఁబడిన తేదినుండి పదునేను దినములకంటె తక్కువగా నుండఁగూడదు; అతఁడు దానిని, జప్తుచేయఁబడిన సొత్తు ఏ గ్రామమందు ఉన్నదో ఆ గ్రామమందు, తండోరా వేయించి ఇస్తి హారు చేయింపవలయును; మఱియు అతఁడు తన హుకుమునకు నక లొకటి సదరు గ్రామమందొక వెల్లడియైన స్థలమందు అంటింపవలయును.

విక్రయపు తేదిని నిర్ణయించుటలో, ఆ తేది, పైనిచెప్పిన యిస్తిహారు తేదినుండి యేడుదినములకంటె తక్కువ కాకుండునట్లునిర్ణ యింపవలయును.

(4) సదరు నోటీసులోను ఇస్తిహారులోను—

(a) విక్రయింపఁబడవలసిన సొత్తు ఫలానిదనియు,

(b) 93 వ సెక్షను ననుసరించిన పరఖాస్తులో ఉదాహరింపఁబడిన మొత్తము పలానిదనియు,

(c) పలాని కాలమందును స్థలమందును విక్రయము జరుగునవియు,

వివరించి యుండవలయును.

విక్రయము ఎప్పుడు జరుగవచ్చును.

96. పైని చెప్పినట్టి తప్పిపోయిన రయితుగాని వ్యవసాయదారుఁడుఁగాని, 95 వ సెక్షనులో ఉదాహరింపఁబడినట్టి నోటీసు జారీఅయిన తేదినుండి పదునేను దినములలోఁగా సదరు జప్తును రద్దుచేయుటకై కలెక్టరునెదుట నొక వ్యాజ్యెమును దాఖలుచేయక పోయినయెడలఁగాని, లేక అట్టి వ్యాజ్యెము దాఖలుచేయఁబడి అది అతనికి ప్రతికూలముగా కలెక్టరుచే తీర్పుచేయఁబడినయెడలఁగాని, లేక ఆ విక్రయము 89 వ సెక్షనును, 103 వ సెక్షనును, లేక 104 వ సెక్షనును, అనుసరించి రద్దుచేయఁబడి లేక నిలిపిపెట్టఁబడియుండని యెడలఁగాని, విక్రయము జరిగించు ఆఫీసరు, సదరు డిమాండు మొత్తము తాను ఉత్తరువుచేసినట్టి జప్తుకర్చులతోడ పూర్తిగా చెల్లింపఁబడిననే తప్ప,ఆ సొత్తునుగాని,జప్తుకర్చులతోడను విక్రయపుకర్చులతోడను సదరు డిమాండుమొత్తము వసూలగుటకు అగత్యముగనున్నంత ఆ సొత్తులోని భాగమునుగాని విక్రయించుటకు ఇందులో నిఁకముందు వివరింపఁబట్టి విధమున ఆరంభింపవచ్చును.

విక్రయ స్థలము.

97. విక్రయమును, సాధారణముగా ఆస్తిజప్తుచేయఁబడిన లేక ఉంపఁబడిన గ్రామములోఁగాని లేక ఆ యాస్తియింకను మంచిలాభముతో అమ్ముడుపోవచ్చునని విక్రయించు ఆఫీసరు అభిప్రాయపడునట్టి, జనులు కూడెడు అత్యంత సమీప స్థలమునందుఁగాని

జరపవలయును. ఏ విషయములోనైననుసరే, జప్తుదారుఁడు ఆ యాస్తిని విక్రయకాలమందును విక్రయస్థలమందును హాజరు పఱుపవలసిన వాఁడై యుండును, దానిని స్థలాంతరమునకు తీసికొనిపోవుట కయ్యెడి కర్చు జప్తుకర్చులో నొక భాగముగా నెన్నఁబడును.

నశించిపోఁదగిన వస్తువుల విక్రయము.

98. ఈ యధ్యాయములో ఏమి చెప్పియున్నను నిమిత్తములేకయే, శీఘ్రముగా నశించిపోవు స్వభావముగల పైర్లను లేక మహసూళ్లను జప్తుదారుఁడు సాధ్యమగునంత త్వరలో విక్రయింపవలయును, మఱియు సదరు విక్రయముద్వారా వచ్చెడు పైకమును విక్రయించు ఆఫీసరువద్ద ధరావతు ఉంచవలయును.

పంటలను ఎప్పుడు విక్రయింపవచ్చును.

99. (1) స్వభావమునుబట్టి పోగుచేసి యుంపఁగూడిన పంటలనుగాని ఫలితములనుగాని, అవి కోయఁబడి లేక సేకరింపఁబడి పోగు చేయఁబడుటకు సిద్ధముగానుండక మునుపు విక్రయింపఁగూడదు.

(2) స్వభావమునుబట్టి పోగుచేసి యుంపఁగూడని పంటలనుగాని ఫలితములనుగాని, అవికోయఁబడుటకు లేక సేకరింపఁబడుటకు ముందు విక్రయింపవచ్చును; మఱియు కొనువాఁడు తానుగాఁగాని ఇందుకుఁగాను తనచే నియమింపఁబడిన యే మనుష్యునిద్వారాగాని భూమిలో ప్రవేశించి వానిని కాపాడి కోయుటకు లేక సేకరించుటకు చేయవలసిన యావత్తు పనులను చేయుటకు హక్కుకలిగి యుండును.

విక్రయించు విధము.

100. విక్రయము జరిపించు ఆఫీసరుకు యుక్తమని తోఁచునట్లు ఆ సొత్తును ఒకటి లేక యెక్కువ లాట్లుగాచేసి (పబ్లిక్) వెల్లడివేలము మూలముగా అమ్మవలయును; ఆ సొత్తులో కొంత

భాగమును అమ్మినందువల్లనే జప్తుకును విక్రయమునకును అయిన ఖర్చులతోఁగూడ డిమాండు మొత్తము సరిగా వచ్చునపక్షమున, మిగత భాగమునకు జప్తును వెంటనే విడుదలచేయవలయును.

విక్రయమును (కొంతకాలము) నిలిపిపెట్టుట.

101. సదరు సొత్తును విక్రయమునకు తెచ్చినప్పుడు విక్రయించు ఆఫీసరు యొక్క యెన్నికలో దానికి సరియైన వెల రానిపక్షమునను,—

(*a*) తప్పిపోయినవాఁడుగాని వ్యవహారదారుఁడుగాని లేక ఆ సొత్తుయొక్క ఖామందుగాని అతని పక్షమున ప్రవర్తించుటకు అధికారముపొందిన మనుష్యుఁడుగాని జప్తుదారుఁడుగాని విక్రయమును మఱుసటిదినము వఱకు నిలిపిపెట్టుమని దరఖాస్తుచేసినపక్షమున, లేక

(*b*) విక్రయపు స్థలమునందుఁగాని దానికి సమీపమునఁగాని సంత జరుగుచున్న పక్షమున,

విక్రయమును ఆయా సంగతికి తగినట్లు అట్టి మఱుసటి దినము వఱకుఁగాని లేక అట్టి మఱుసటి సంతె జరుగు దినమువఱకుఁగాని ఆఁపియుంపవలయును, అప్పుడు ఆ సొత్తుకు ఎంతవెల వచ్చినప్పటికిని విక్రయమును పూర్తిచేసివేయవలయును.

కొనుగోలు సైకమును చెల్లించుట.

102. ప్రతిలాటుయొక్క వెలను విక్రయకాలమందుఁగాని విక్రయమును జరిపించునట్టి ఆఫీసరు దానికి తర్వాత ఆజ్ఞాపించునట్టి కాలమందుఁగాని చెల్లింపవలయును; అట్లు చెల్లింపక తప్పిపోవుపక్షమున ఆ సొత్తు మరల వేలము వేయఁబడి విక్రయింపఁబడును. అట్టి రెండవ విక్రయములో ధరలో తగ్గడి యేర్పడినభాగమును, అట్టి రెండవ

విక్రయమునకుంగాను తగిలెడి కర్చులనన్నిటిని, సదరు విక్రయము జరి గించు ఆఫీసరు కలెక్టరునకు సర్టిఫై చేయవలయును; మఱియు జప్తు దారుండుగాని, చెల్లింపక తప్పిపోయినవాండుగాని, వ్యవసాయదారుడు గాని, కోరునెడల అవి, అతనికిఁగల వేఱె యేదైన పరిహారమునకు భం గములేకుండ, కలెక్టరునెదుట వ్యాజ్యము తెచ్చి తప్పిపోయిన క్రయదా రునివద్దనుండి రాఁబట్టుకోఁదగి యుండును.

ఈ సెక్షను ననుసరించి తప్పిపోయిన క్రయదారునివద్దనుండి రాఁబట్టుకోఁబడిన యే మొత్తమయినను, అది విక్రయముద్వారావచ్చిన పైకముగా నుండిన నెట్లో అట్లే 106 వ సెక్షను ననుసరించి వినియో గింపఁబడవలయును.

జప్తుచేయుటలో జరిగిన అక్రమమును రిపోర్టుచేయవలసిన జవాబుదారి.

103. విక్రయించుటకు నియమింపఁబడినట్టి ఆఫీసరు ఈ యాక్టు మిమమీఁద జప్తుచేయువానిచే జరిగింపఁబడినట్టి ముఖ్యమయిన యే యక్రమమునైనను కలెక్టరుకు ఎఱుకచేయవలయును, మఱియు అట్టి సందర్భములో కలెక్టరుయొక్క హుకుము వచ్చినదాఁక సదరు ఆఫీసరు విక్రయమును ఆఁపి యుంపవచ్చును.

జప్తు చేయుటలో జరిగిన అక్రమముయొక్క ఫలము.

104. (1) 79 వ సెక్షనులో కోరఁబడిన ప్రకారము జప్తుచేయు వాఁడు రయితునకు వ్రాఁతమూలమైన డిమాండును అందఁజేయలేదనిగాని, లేక 79 వ సెక్షనులో చెప్పఁబడిన జాబితాను లేక వివరణమును అందఁజేయుటకు తప్పిపోయినాఁడనిగాని, లేక 92 వ సెక్షను ననుసరించి హుకుముకొఱకు విక్రయము జరిగించు ఆఫీసరునకు దరఖాస్తు చేసికొనుటకు తప్పిపోయినాఁడనిగాని, లేక జప్తుచేసిన సొత్తు అధికమైనదనిగాని, కలెక్టరుకు తెలియవచ్చునపుడు, సదరు కలెక్టరు ఆ

విక్రయము జరుగునట్లు ఉత్తరువు చేయనైన చేయవచ్చును, లేక యింకొక విక్రయపు నోటీసును లేక యిస్తిహారును జారీచేయునట్లు ఆజ్ఞాపించనైన ఆజ్ఞాపింపవచ్చును; అట్టి సంగతిలో, సదరు రెండవ విక్రయమునకు తగిలెడు కర్చులను, జప్తుచేయువాఁడు అచ్చుకోవలయునని ఉత్తరువుచేయవలయును.

(2) ఆ జప్తు మనస్సంకటము చేయుటకనిగాని నిరాధారమైనదనిగాని కలెక్టరుకు తెలియవచ్చినప్పుడు, అతఁడు సదరు జప్తుసొత్తును మరల ఇచ్చివేయునట్లు వుత్తరువు చేయవచ్చును.

105. కొనుగోలుపైకము పూర్తిగా చెల్లింపఁబడి యున్నప్పుడు, విక్రయము జరిపించు ఆఫీసరు సదరు సొత్తును కొనుగోలుచేసినవానికి ఒప్పగించి, కొనుగోలయిన సొత్తును చెల్లించిన ఖరీదును వివరించుచు తాను సంతకముచేసిన యొక సర్టిఫికేటును వానికియ్యవలయును.

కొనుగోలు చేసినవానికి సర్టిఫికేటు నియ్యవలయును.

106. (1) ఈ యాక్టు ననుసరించి జప్తుచేసిన ప్రతి సొత్తుయొక్క విక్రయపు పైకమునుండి, విక్రయము జరిపించు ఆఫీసరు, విక్రయపు కర్చుకుఁగాను రూపాయకు ఒక అణాకు మించని రేటు చొప్పున త్రోసికొని అట్లు త్రోసికొనిన మొత్తమును తహసీల్దారునికి పంపవలయును.

విక్రయపు పైకమును వినియోగించుట.

(2) అంతట, అతఁడు, జప్తుకుఁగానును, 95 వ సెక్షనులో చెప్పియుండెడి విక్రయపు నోటీసును ఇస్తిహారును జారీచేసినందులకుఁగానును జప్తుదారునికి తగిలిన కర్చులనుగుఱించి సదరు జప్తుదారుఁడు ఇచ్చెడు కర్చులవివరణమును పరిశీలనచేసిన తర్వాత ఎంత మొత్తమువఱకు ఇచ్చుట ఉచితమని తలఁచునో అంతమొత్తమువఱకు అట్టి కర్చులను సదరు జప్తుదారునికి చెల్లింపవలయును.

(3) శేషమును, జప్తు ఏ బాకీకిఁగాను చేయఁబడినదో ఆ బాకీని తీర్చుటకయి వినియోగింపవలయును.

(4) మిగత యేదయిన నుండినచో దానిని, ఎవరి సొత్తు విక్రయింపఁబడినదో ఆ మనుష్యునికి చేర్పవలయును; మఱియు అతఁడు, విక్రయపు పైకమునుండి చెల్లింపఁబడిన యేదేని బాకీకిఁగాను ఒక రసీదును విక్రయము జరిపించిన ఆఫీసరువద్దనుండి పొందవలయును.

(5) జప్తుదారునికిఁగాని, జప్తుచేయఁబడిన సొత్తుయొక్క సొంతగానికిఁగాని, విక్రయము జరిగించిన ఆఫీసరుయొక్క తీర్పు తృప్తికరముగా లేనిపక్షమందు, కలెక్టరు, ఆ పార్టీలు ఇరువురిలో నెవరయిన తనకు దరఖాస్తుచేసికొన్నమీఁదట, సదరు సొత్తును జప్తుచేసి దానిని విక్రయమునకు తెచ్చుటకు తగిలిన కర్చులను నిర్ధారణ చేయవలయును.

విక్రయము జరిగించు ఆఫీసరుగాని తాబేదారుగాని సొత్తుకుఁగాను పాట పెట్టకుండ లేక కొనకుండ నిషేధించుట.

107. ఈ యాక్టు ననుసరించి సొత్తు విక్రయము జరిగించెడి యే యాఫీసరును, అట్టి యాఫీసరుచే నియమింపఁబడినట్టిగాని లేక అతనికి తాబేదారుగా నుండునట్టిగాని యే మనుష్యుఁడును, అట్టి విక్రయములో విక్రయింపఁబడు సొత్తుకు దేనికిఁగాని ప్రత్యక్షముగా నయినను పరోక్షముగానయినను పాటపెట్టఁగూడదు, లేక దానియందు ఏ బాధ్యతనుగాని సంపాదింపఁగూడదు లేక సంపాదించుటకు యత్నింపఁగూడదు.

పాయకారీ రయితుగాని, వ్యవసాయదారుఁడుగాని తన భూమిఖామందుకుఁగాను చెల్లించిన మొత్తమును పన్నులోనుండి త్రోసికొనుటకు హక్కు.

108. (1) పన్నుబాకీ అయినది పాయకారీరయితువద్దనుండిగాని వ్యవసాయదారునివద్దనుండిగాని అతని సన్నిహితుఁడైన భూమిఖామందు కానట్టి వేఱె యే మనుష్యునివలననైనను జప్తుమూలమైన చర్యలద్వారా రాఁబట్టుకోఁబడినప్పుడు, ఆ పాయకారీరయితుగాని, వ్యవసాయదారుఁడుగాని, అట్లు రాఁబట్టుకోఁబడిన

మొత్తమును అట్టి భూమిశిస్తుకు తాను చెల్లింపవలసియున్నట్టి యే పన్నునుండి యయినను త్రోసికొనుటకు హక్కు కలిగియుండును; మఱి యు అట్టి భూమిశిస్తుమందు, చెల్లింపక తప్పిపోయినవాడు తానై యుం డనియెడల, తాను తన భూమిశిస్తుమందుకు చెల్లింపవలసియున్నట్టి యే పన్నునుండియైనను ఆ మొత్తమును అదే విధముగా త్రోసికొనుటకు హక్కు కలిగియుండును; ఈ ప్రకారమే, చెల్లింపక తప్పిపోయినవానివద్ద నుండి వసూలగునంతవఱకును త్రోసికొనుచు ఉండవచ్చును.

(2) 87 వ సెక్షను ననుసరించి పైకము చెల్లించెడి యే పాయకారీరయితైనను, వ్యవసాయదారుడైనను, చెల్లించిన మొత్త ములోనుండి యీ సెక్షను ననుసరించి తాను త్రోసికోకపోయినట్టి యే భాగమునైనను, చెల్లింపక తప్పిపోయినవానివద్దనుండి రాబట్టుకొనుట కై ఒక సివిల్ కోర్టులో వ్యాజ్యెము తెచ్చుటకు అతనికిగల హక్కును ఈ సెక్షనులోనుండున దేదియు బాధింపనేరదు.

భూస్వామి చేసిన జప్తుకును కోర్టువారు చేసిన (అటాచ్ మెంటు) జప్తుకును మధ్య కలుగు తగాదా.

109. 5 వ సెక్షనుయొక్క (1) టి సబ్ సెక్షను ననుసరించి మహా సూలుమీద మొదటి చార్జి గలిగినవాడై మహాసూలును జప్తుచేసెడి భూస్వామియొ క్క హక్కుకును, ఒక సివిల్ కోర్టువారు చేసి నయొక (అటాచ్ మెంటు) జప్తు ననుసరించి దావా చేసెడి మనుష్యునియొక్క హక్కు కును మధ్య తగాదా యేదయిన కలుగునప్పుడు, భూస్వామియొక్క హక్కు ప్రబలమయినదై చెల్లుబడి అగును; కాని, అట్టి భూస్వామియొక్క జప్తు కారణముగా ఆ సొత్తు కలెక్టరుచే విక్రయింపబడినయెడల, విక్రయపు పైకముయొక్క నిలువమొత్తము 106 వ సెక్షనునుబట్టి ఎవని సొత్తు విక్రయింపబడెనో వానికి చెల్లింపబడగూడదు, కాని అటాచ్ మెం

టుయొక్క ఉత్తరువు ఏ కోర్టువారిచే జారీ చేయఁబడినదో ఆ కోర్టులో అది డిపాసిటు చేయఁబడవలయును.

ఆక్షేపించిమొత్తమును టెండరుచేయుట చెల్లఁదగినదిగా ఎన్నవలయును.

110. భూస్వామి అడిగినట్టి పన్ను బాకీమొత్తమును ఆక్షేపించి టెండరు చేసియున్నను ఆ టెండరు చెల్లఁదగినదిగా ఎన్నఁబడును. అట్లు టెండరు చేసినమీఁదట జప్తుదారుఁడు సదరు సొత్తును జప్తుచేయక లేక విక్రయింపక మానుకొనుటకును, జప్తుచేయఁబడి యున్నయెడల, జప్తుచేయఁబడిన సొత్తును విడుదల చేయుటకును బద్ధుఁడయి యుండును; అయినను, అట్లు టెండరు చేయఁబడిన మొత్తము పుచ్చుకోఁబడినపుడు, సదరు పైకము ఆక్షేపముతో చెల్లింపఁబడినదనెడి సంగతిని పైకము చెల్లించెడి మనుష్యునకిచ్చెడి రసీదులో తెలుపవలయును.

రయితుయొక్క అధీనభూమిని విక్రయించుట.

అధీనభూమిని విక్రయించుట.

111. బాకీ యయినది, ఏ రెవిన్యూ సంవత్సరములో చెల్లింపఁదగినదిగా ఏర్పడినదో ఆ సంవత్సరములోఁగా చెల్లింపఁబడనియెడల, ఆ బాకీని, దాని మీఁద వడ్డీని, విక్రయమునకు కర్చు లేవయిన తగిలినయెడల ఆ కర్చులను, తీర్చుటకుఁగాను, సదరు అధీనభూమినిగాని అందలి యే భాగమునైనఁగాని యిందులో ఇఁకముందు నిబంధించియుండు ప్రకారము భూస్వామి విక్రయించడము చట్టపు సమ్మతమైయుండును.

విక్రయించుటకైన యుద్దేశమునుగుఱించి నోటీసు.

112. బాకీ యెవరికి రావలసియున్నదో అట్టి భూస్వామి, పై కడపటి సెక్షనులో కలుగఁజేయఁబడిన యధికారములను వినియోగించుకొనను ద్దేశించినపుడు, చెల్లింపక తప్పిపోయినవానికి అతఁ

డు కలెక్టరు మూలముగా వ్రాఁతమూలమగు నోటీసు అందఁజేసి, అందులో బాకీనిగుఱించి, వడ్డీనిగుఱించి, కప్పు లేవైన తగిలినయెడల వానినిగుఱించి రావలసిన మొత్తమును, అది యేకాలమునకుఁగాను బాకీగానున్నదో ఆ కాలమును, అది యే యధీనభూమి విషయమై బాకీగానున్నదో ఆ భూమిని, ఉదాహరింపవలయును; మఱియు నోటీసు అందఁజేయఁబడిన తేదిమొదలు ముప్పది దినములలోఁగా ఆ మొత్తమును అతఁడు చెల్లింపకపోయిన యెడలఁగాని విక్రయించుటకుఁగల హక్కు విషయమై ఆక్షేపించుచు కలెక్టరునెదుట దావా దాఖలుచేయని యెడలఁగాని సదరు అధీనభూమినిగాని లేక సదరు నోటీసులో ఉదాహరింపఁబడినట్టి అందలి భాగమునుగాని విక్రయింపబడునని అతనికి ఎఱుకచేయవలయును. అట్టి నోటీసును, బాకీ యే రెవిన్యూ సంవత్సరమునకుఁగాను చెల్లింపవలసినదిగా ఏర్పడినదో ఆ సంవత్సరము ఆఖరునుండి ఒక సంవత్సరములోఁగా కలెక్టరుకు పంపవలయును.

ఆ నోటీసుకు నాలుగు ప్రతులను, దానిని అందఁజేయుటకుఁగానైన రుసుముతోఁగూడ, కలెక్టరునకు పంపవలయును; ఆయన, ఒక ప్రతిని చెల్లింపక తప్పిపోయినవానికిఁగాని అధికారము పొందిన అతని యేజెంటుకుఁగాని అతని మామూలు వాసస్థలమునందుండెడు అతని కుటుంబములోని వయసువచ్చిన యొక పురుషునికిఁగాని అందఁజేయించడము ద్వారానైనను, లేక అట్లు అందఁజేయించుటకు వీలుపడనియెడల, అధీనభూమికి పదిమైళ్లకులోఁగా అతఁడు కట్టకడపట నివసించుచుండినట్లు తెలియవచ్చెడి గృహ మేదయిన నున్నయెడల దానిలో వెల్లడిగానుండు నొక భాగమందుఁగాని సదరు అధీనభూమిలో వెల్లడిగానుండు నొక భాగమందుఁగాని, అంటించడము ద్వారానైనను జారీ చేయింపవలయును.

నోటీసుయొక్క ప్రతులను ప్రతిసంగతిలోను, ఆ నోటీసు దేనికి సంబంధించినదో ఆ భూమిమీఁదను ఆ భూమి ఉండునట్టి గ్రామము మును వెల్లడిగానుండు స్థలములందు అంటింపవలయును.

అంటఁజేసిన తేదిని భూస్వామికి తెలియఁజేయుట.

113. అంటఁజేసిన తేదిన భూస్వామికి వెంటనే తపాలుమూలముగా తెలియఁజేయవలయును.

విక్రయమునకుఁగాను దరఖాస్తు.

114. బాకీమొత్తమును చెల్లింపఁబడని యెడలను సదరు నోటీసు అంటఁజేయఁబడిన తేదినుండి ముప్పది దినములలోఁగా విక్రయించుటకుఁగల హక్కునుఆక్షేపించుచు కలెక్టరునెదుట వ్యాజ్యెమేదియు తేఁబడనియెడలను, లేక చెల్లింపక తప్పిపోయినవానికి విరుద్ధముగా అట్టి వ్యాజ్యెము తీర్పు చేయఁబడిన యెడలను, భూస్వామి విక్రయమునకుఁగాను కలెక్టరునకు దరఖాస్తు పెట్టుకోవచ్చును.

114 వ సెక్షనునుబట్టి చేయఁబడు దరఖాస్తునకు కాలావధి.

115. (1) వ్యాజ్యెము తేఁబడియుండనియెడల, అట్టి దరఖాస్తును 113 వ సెక్షను ననుసరించి జారీయయిన సమాచారమును కలెక్టరు తపాలాలో వేసిన నలుబదియయిదు రోజులలోపల దాఖలు చేయవలయును.

(2) వ్యాజ్యెము తేఁబడియుండి, అది తప్పిపోయినవానికి విరుద్ధముగా తీర్మానింపఁబడిన యెడలఁగాని లేక ఉతరాయించుకొన్న యెడలఁగాని, అట్టి దరఖాస్తును, అట్లు తీర్మానింపఁబడిన లేక ఉతరాయించుకొన్న తేది లగాయతు ముప్పది రోజుల లోపల పెట్టుకోవలయును.

విక్రయించు ఆఫీసరును నియమించుట.

116. అట్టి పరభారస్తు చేరిన తత్క్షణమే కలెక్టరు విక్రయమును జరిపించుటకుంగాను ఒక ఆఫీసరును నియమింపవలయును.

విక్రయమునుగుఱించి యిస్తిహారు.

117. (1) ఆ విక్రయించు ఆఫీసరు, ఉత్తరువుద్వారా విక్రయమునకుంగాను ఒక తేదిని నిర్ణయించి, ఆ యధీనభూమి యుండునట్టి గ్రామములో తంటోరా మూలముగా దానిని చాటింపం జేయవలయును; మఱియును తన ఉత్తరువునకు నకలును ఆ గ్రామములో నొక బహిరంగ మగుచోట అంటింపవలయును.

విక్రయపు తేదిని నిర్ణయించుటలో అది ముందు చెప్పంబడిన యిస్తిహారుచేసిన తేది లగాయతు ముప్పది రోజులకు తక్కువ లేకుండ ఉండవలయును.

(2) ఆ యుత్తరువును ఇస్తిహారును,—

(a) అమ్మంబడునట్టి అధీనభూమిని, లేక అధీనభూమిలోని భాగమును;

(b) 112 వ సెక్షను ననుసరించి యియ్యంబడిన వ్రాతమూలమగు నోటీసులో నమూదు చేయంబడిన మొత్తమును కర్చులను తర్వాతి వడ్డీ యేదైన ఉండినయెడల దానిని,

(c) ఆ సొత్తు అప్పువగైరా చిక్కులకు వేనికయినలోనై విక్రయింపంబడవలసి యున్నయెడల అట్టి అప్పు వగైరా చిక్కులను,

(d) విక్రయము జరుగునట్టి కాలమును, చోటును,

ఉదాహరింపవలయును.

118. సదరు మొత్తము పూర్తిగా చెల్లింపనియెడల, విక్రయించు ఆఫీసరు, ఆ సొత్తునుగాని, లేక అందులో విక్రయపు కర్చులతో రుసుములతో సహా డిమాండు మొత్తము పూర్తిచేయుటకు కావలసినంతభాగమునుగాని విక్రయించుటకు ఇందు నీఁకమీాద చెప్పఁబడు విధముగా చర్య జరపవలయును.

బాకీయుండు మొత్తము పూర్తిగా చెల్లింపనపుడు అమ్మకము.

119. విక్రయమును, ఆ యధీనభూమి యుండునట్టి గ్రామము లోఁగాని, లేక విక్రయించు ఆఫీసరు ఆ సొత్తు బహుశః అక్కడికంటె జనులుచేరెడి చోట అధిక లాభమునకు అమ్ముడు పోవచ్చునని అభిప్రాయపడినయెడల అట్టి మిక్కిలి దగ్గఱగానుండు చోటగాని, సాధారణముగా జరుపవలయును.

విక్రయపు చోటు.

120. ఆ సొత్తును, విక్రయించు ఆఫీసరునకు సరియని తోఁచు ప్రకారము ఒకటి లేక యెక్కువ లాట్లుగా పబ్లిక్ వేలములో అమ్మవలసినది. అయినను అట్టి యే లాటుగాని, భూస్వామియొక్క అనుమతితో తప్ప, ఒక రెవిన్యూ పొలముకంటె చిన్నదిగా నుండఁగూడదు; మఱియు, జప్తుయొక్కయు అమ్మకముయొక్కయు కర్చులు సహా డిమాండు మొత్తము, సొత్తులోని యొక భాగమును విక్రయించుటవలన పూర్తిగావచ్చు పక్షమున, మిగత భాగమునుగుఱించి విక్రయమును తత్క్షణమే నిలుపవలయును.

విక్రయపు విధము.

121. సొత్తు అమ్మకమునకు తేఁబడినపుడు, విక్రయించు ఆఫీసరుయొక్క అభిప్రాయములో న్యాయమైన ధర రాకపోయి, చెల్లింపక తప్పినవాఁడుగాని, లేక వాని తరఫున ప్రవర్తించుటకు అధికారముకలిగినవాఁడుగాని, లేక భూస్వామిగాని మఱుసటి రోజువఱకు

విక్రయమును ఆఁపియుంచుట.

విక్రయమును నిలిపి యుంచవలసినదిగా అడుగుకొనినయెడల, విక్రయము ఆ దినమువఱకు నిలుపఁబడి అప్పుడు ఆ సొత్తుకు ఏధర వచ్చినప్పటికిని అమ్మకమును పూర్తిచేసి వేయవలయును.

విక్రయమును నిలిపివేయుట.

122. భూస్వామి విక్రయమునకుఁగానుచేసిన దరఖాస్తును ఉత్తరా చేసికొన్నను, లేక లాటుమీఁది పాట తెగఁదీయుటకుముందుగా ఇస్తిహారులో నమూదుచేయఁబడిన మొత్తమును విక్రయమునకు అయిన కర్చులను విక్రయించు ఆఫీసరునకు టెండరు చేసినను, లేక అట్టి మొత్తమును కలెక్టరుకు చెల్లించినట్టు ఆయనకు తృప్తికరమగు సాక్ష్యమును చూపించినను, అట్టి ప్రతి విక్రయమును నిలిపివేయవలయును.

కొనుగోలు పైకమును చెల్లించుట.

123. ప్రతి లాటుయొక్క క్రయమును, విక్రయసమయములో, లేక దానితర్వాత ఎంత త్వరలో చెల్లింపవలెనని విక్రయించు ఆఫీసరు ఆజ్ఞాపించునో అంత త్వరలో, చెల్లింపవలయును; అట్లు చెల్లింపనిపక్షమున ఆ సొత్తు మరల వేలము వేయఁబడి విక్రయింపబడును. అట్టి రెండవ విక్రయములో ధర తగ్గినయెడల అట్లు తగ్గిన మొత్తమును అట్టి రెండవ విక్రయమునకగు అన్ని కర్చులను విక్రయించు ఆఫీసరు కలెక్టరుకు సర్టిఫై చేయవలయును. తనకుండునట్టి యితర పరిహారమునకు దేనికిని లోపములేకుండ భూస్వామిగాని డిమాండు చెల్లింపక తప్పిపోయినవాఁడుగాని, కలెక్టరునెదుట వ్యాజ్యము తెచ్చి తప్పిపోయిన కొనుగోలుదారునివలన, సదరు తగ్గిన మొత్తమును కర్చులను రాఁబట్టుకొనఁదగి యుండును.

ఈ సెక్షను ననుసరించి తప్పిపోయిన కొనుగోలుదారునివలన రాఁబట్టఁబడిన యే మొత్తమైనను, 127 వ సెక్షను ననుసరించి, విక్రయమువలన తేలిన పైకము ఎట్లో అట్లు వ్యవహరింపఁబడును.

కొను.గోలు పైకము కలెక్టరుకు పంపవలయును.

124. (1) విక్రయించు ఆఫీసరుచే వసూలుచేయఁబడిన కొనుగోలు పైకమంతయును తత్క్షణమే కలెక్టరుకు పంపవలయును.

కొనుగోలుదారునికి సర్టిఫికేటు.

(2) కొనుగోలు పైకము పూర్తిగా చెల్లించినమీఁదటను, విక్రయపు తేదినుండి ముప్పదిదినములు గడచినమీఁదటను, కలెక్టరు, 131 వ సెక్షనననుసరించి విక్రయమును రద్దుచేయుటకై దరఖాస్తు ఏదియు పెట్టుకోఁబడనియెడలఁగాని, లేక అట్టి దరఖాస్తు పెట్టుకోఁబడి అది నిరాకరింపఁబడినయెడలఁగాని, కలెక్టరు కొనుగోలుదారునికి, విక్రయింపఁబడిన సొత్తును, కొన్నవానిపేరును, విక్రయపు తేదిని, చెల్లింపఁబడిన మొత్తమును తెలియపఱుచుచు ఒక సర్టిఫికేటును ఇచ్చి, విక్రయింపఁబడిన సొత్తును వాని స్వాధీనము చేయవలయును.

అప్పు వగైరా చిక్కులు.

125. ఒక అధీనభూమి లేక ఒక అధీనభూమి తాలూకు భాగము దాని విషయమై చెల్లింపవలసిన బాకీకిఁగాను విక్రయింపఁబడునపుడు, భూస్వామి యొక్క వ్రాఁతమూలమగు రిజిస్టరైన సెలవుతో రైతు అందులో కలుగఁజేసిన యేదైన హక్కునకును లేక బాధ్యతకును, ఈ యాక్టు జారీకాక పూర్వము కలుగఁచేయఁబడిన యేవైన అప్పువగైరా చిక్కులకును, లోఁబడి కొనుగోలుదారుఁడు తీసికోవలయును.

విక్రయమునకు తేఁబడవలసిన అధీనభూమియొక్క విస్తీర్ణము.

126. భూస్వామిచే విక్రయమునకు తేఁబడిన అధీనభూమిలోని భాగము బాకీ నిలువమొత్తమునకును కర్చులకును సాధ్యమైనంతవఱకు సమానమయిన వెల గలదిగా ఉండవలయును.

విక్రయపు పైకమును పరిష్కరించివేయుటకు విధులు.

127. ఈ యధ్యాయము ననుసరించి అధీనభూమిని విక్రయింపఁగా వచ్చిన పైకమును పరిష్కరించివేయుటలో, ఈ క్రింది విధులు గమనింపవలయును, అనగా.—

(*a*) ఆ యధీనభూమిని విక్రయమునకు తెచ్చుటలో భూస్వామికి తగిలిన కర్చులను మొట్టమొదట చెల్లించి వేయవలయును.

(*b*) అటుపైని భూస్వామికినిలువయుండు బాకీని, దానిచెల్లించు తేదివఱకు కూడిన వడ్డీని, చెల్లించివేయవలయును.

(*c*) ఈ మొత్తములు చెల్లించిన తర్వాత పైకము నిలువయుండినయెడల, అందులోనుండి దరఖాస్తు లేక వ్యాజ్యేము దాఖలయిన తేదికిని విక్రయము జరిగిన తేదికిని మధ్య ఆ యధీనభూమికిగాను బాకీపడ్డ పన్ను ఏదయిననుండినయెడల దానిని భూస్వామికి చెల్లింపవలయును. బాకీ యియ్యక తప్పిపోయినవాఁడు విక్రయించు ఆఫీసరువద్ద అట్లు చెల్లించిన మొత్తమునకుఁగాను రసీదు పొందును; ఈ క్లాజు ననుసరించి యే మొత్తమునయినను పొందుటకు భూస్వామియొక్క హక్కునుగుఱించి తప్పిపోయినవాఁడు వివాదముచేసినయెడల, కలెక్టరు ఆ వివాదమును వ్యాజ్యేముగా రిజిష్టరుచేసికొని, దానిని తీర్మానించుటకు చర్య జరిపింపవలయును.

అయినను విక్రయముతారీఖు మొదలుకొని ముప్పదిరోజులు గడచునంతవఱకు, ఈ సెక్షనుయొక్క (a), (b), (c) క్లాజుల ననుసరించి, భూస్వామికి ఏ పైకమును ఇయ్యఁగూడదు.

(*d*) క్లాజు (c) లో చెప్పఁబడిన మొత్తమును చెల్లించిన తర్వాత (ఏదైనను) నిలువయుండు మొత్తమును ఏ సివిల్ కోర్టుయొక్కయయిన వ్యతిరిక్తమగు ఉత్తరువునకులోఁబడి, తప్పిపోయినవానికి, వాని దరఖాస్తు మీఁద, విక్రయము జరిగిన తారీఖుమొదలు మూఁడునెలలు గడచినతర్వాత, చెల్లింపవలయును.

అధీనభూమి విషయములో హక్కుగలవాఁడు బాకీమొత్తమును చెల్లించుయెడల వానికిఁ గల హక్కు.

128. (1) అధీనభూమినిగాని ఆ భూమిలో నొక భాగమును గాని విక్రయించుటకు ఇస్తిహారు చేయఁబడినప్పుడును, సదరు విక్రయమువలన బాధింపఁబడునట్టి యే బాధ్యతనయినను దాని యందు కలిగియుండెడి యే మనుష్యుఁడయిన, ఆ విక్రయమును ఆఁపుటకయి 122 వ సెక్షను ననుసరించి కావలసియున్న మొత్తమును కలెక్టరునకుఁగాని విక్రయము జరిగించెడు ఆఫీసరునకుఁగాని చెల్లించినయెడలను,—

(*a*) అట్లు అతఁడు చెల్లించినమొత్తము, సంవత్సరమునకు నూటికి ఆఱు చొప్పున వడ్డీగల ఋణముగా భావింపఁబడి సదరు అధీనభూమిమీఁద చార్జి చేయఁబడును ; మఱియు

(*b*) అట్టి చార్జియయినది, పన్ను బాకీకిఁగా నయినట్టి చార్జియు ఈ సెక్షను ననుసరించిన ముందుగా ఏర్పడియున్న యేదేని చార్జియు తప్ప, తక్కిన ప్రతి చార్జికంటెను ముందుగా చెల్లింపఁదగి యుండును.

(2) ఈ సెక్షనులో నుండునది యేదియు, అట్టి యే మనుష్యుఁడయినను పొందఁగలిగిన వేఱేదే పరిహారమునుగాని బాధింపదు.

రయితుకుఁగాను చెల్లింపఁబడిన మొత్తమును పన్నునుండి త్రోసికొనుటకు పాయకారీ రయితుకుఁగాని లోపాయకారీ రయితుకుఁగానిఉండుహక్కు.

129. తప్పిపోవు రయితుయొక్క ఆధీనభూమిగాని అందలిభాగముగాని విక్రయించుటకుఁగాను ఇస్తిహారు చేయఁబడియుండి, ఆ విక్రయమువలన తన బాధ్యతకు బాధ కలుగునట్టి అందలియే పాయకారి రయితుగాని లోపాయకారి రయితుగాని ఆ విక్రయమును ఆఁపుటకయి 122 వ సెక్షను ననుసరించి కావలసిన మొత్తమును కలెక్టరునకుఁగాని లేక విక్రయము జరిగించు ఆఫీసరునకుఁగాని చెల్లించినయెడల, అతఁడు, చట్టములో తనకై నిబంధింపఁబడిన యేదయిన నితర పరిహారముతో సహా, అట్లు చెల్లింపఁబడిన మొత్తము యావత్తుగాని అందులో నేభాగమయినఁగాని తన సన్నిహితుఁడైన భూమిఖామందుకు తాను చెల్లింపవలసిన యేపన్నులోనుండియైనను మినహాయించుకొనవచ్చును; మఱియు ఆ భూమిఖామందు, చెల్లింపక తప్పినవాఁడు తానై యుండనియెడల, అట్లు త్రోసికోఁబడిన మొత్తమును తన సన్నిహితుఁడైన భూమిఖామందుకు తాను చెల్లింపవలసిన యే పన్నునుండియైన అదే విధముగా త్రోసికొనవచ్చును; ఈ ప్రకారమే, చెల్లింపకతప్పిపోయినవానివద్దనుండి వసూలగువఱకును త్రోసికొనుచుండవచ్చును.

భూస్వామి వేలములో (బిడ్డు) పాట పెట్టవచ్చును.

130. బాకీకిఁగాను రయితుయొక్క అధీనభూమినిగాని అందలిభాగమునుగాని విక్రయమునకు తెచ్చిన భూస్వామి, సదరు అధీనభూమికిఁగాని అందలిభాగమునకుఁగాని వేలములో పాట పెట్టవచ్చును లేక కొనుగోలు చేయవచ్చును.

విక్రయమును రద్దుపఱచుటకై, చెల్లింపక తప్పిపోయిన రయితు దరఖాస్తు పెట్టుట

131. (1) ఒక రయితుయొక్క అధీనభూమిగాని అందలి భాగముగాని దానిమీఁద చెల్లింపవలసిన బాకీకిఁగాను విక్రయింపఁబడినపుడు, అట్లు చెల్లింపక తప్పిపోయిన రయితుగాని, విక్రయమువలన బాధింపఁబడిన హక్కు లేక

బాధ్యత అందుగల యే మనుష్యుఁడుగాని, విక్రయపు తేదినుండి ముప్పది దినములలోఁగా నెప్పుడయినను,

విక్రయపు ఇస్తిహారు తేదినుండి యీవల భూస్వామికి చేరియుండు యే మొత్తమునైనను తీసివేసి, విక్రయపు ఇస్తిహారులో, రాఁబట్టుకొనుటకై విక్రయము జరిగించుటకు ఉత్తరువు చేయఁబడినదిగా ఉదాహరింపఁబడియుండు మొత్తమును, సదరు అధీనభూమిని విక్రయమునకు తెచ్చుటకై భూస్వామికి అటుపిమ్మట కర్చు లేవైనతగులునెడల ఆ కర్చులతోఁగూడ భూస్వామికి చెల్లించుటకుఁగా నేమి,

కొనుగోలుపయికములో నూటికి అయిదువంతునకు సమానమగు మొత్తమును కొన్నవారికి చెల్లించుటకుఁగా నేమి,

కలెక్టరువద్ద డిపాసిటుచేసి, ఆ విక్రయమును రద్దుపఱుచుటకు ఆ యాఫిసరునకు దరఖాస్తు పెట్టుకొనవచ్చును.

(2) అట్టి డిపాసిటు ఆ ముప్పది దినములలోఁగా చేయఁబడినయెడల, కలెక్టరు ఆ విక్రయమును రద్దుపఱుచు హుకుమును జారీచేయవలయును, మఱియు సివిల్ ప్రొసీజరుకోడుయొక్క 315 వ సెక్షను లోని నిబంధనలు అట్లు రద్దుపఱుపఁబడిన విక్రయ విషయములో ప్రయోగపడును.

పన్ను బాకీలకుఁగానైన డిక్రీలను అములు నెఱవేర్చుటకు 6 వ అధ్యాయము ప్రయోగపడుట.

132. ఈ యధ్యాయములోని నిబంధనలు, సాధ్యమైనంతమట్టుకు, పన్ను బాకీకిఁగానైన ఏడిక్రీనైనను ఒక రెవిన్యూకోర్టువారు అములు నెఱవేర్చుటకు ప్రయోగపడఁదగి యుండును.

133. కలెక్టరు, (*a*) ఈ యాక్టు ననుసరించినట్టి యొకవ్యాజ్యెముతో బాకీఁగానైన డిక్రీని అమలు జరుపునప్పుడుగాని, (*b*) చెల్లింపక తప్పిపోయిన యే మనుష్యుని అధీనభూమిని ఈ యధ్యాయముయొక్క నిబంధనల ననుసరించి విక్రయింపవలయునో ఆ మనుష్యుఁడు దరఖాస్తు చేసికొన్నమీఁదటఁగాని, సదరు అధీనభూమినైనను అందలి భాగమునైనను విక్రయించుటకు ఉత్తరవు జారీచేయుటకు పూర్వమును, చెల్లింపకతప్పిపోయినవాఁడు సదరు అప్పుమొత్తమునకును కర్చులకును వడ్డికిని కలెక్టరుకు తృప్తికరమైనట్టి జామీను ఇచ్చినమీఁదటను, బాకీగా నుండుమొత్తమును ఇంతకాలములోపల చెల్లింపవలసిన దని సదరు చెల్లింపకతప్పిపోయిన వానికి అవకాశ మియ్యవచ్చును; అయినను, లోకల్ గవర్నమెంటువారు సామాన్యమైన లేక విశేషమైన ఉత్తరువు ద్వారా అంతకంటె దీర్ఘకాలము ఇచ్చుటకు అధికార మిచ్చిననే తప్ప, అట్లు ఇయ్యఁబడినట్టి యే కాలముగాని కాలములమొత్తముగాని రెండు మాసములకు మించఁగూడదు.

డిక్రీని అమలు జరిగేటప్పుడే కలెక్టరు, పైకము చెల్లించుటకుఁగాను చెల్లింపకతప్పిపోయినవానికి అవకాశ మియ్యవచ్చును.

134. చరాస్తిని జప్తుచేసి విక్రయించడము ద్వారా ఒక రయితు నుండి పన్నును రాఁబట్టుకొనుటకై యీ యధ్యాయములో నుండెడు నిబంధనలు, సాధ్యమైనంతవఱకు,—

ఈ యధ్యాయములోని నిబంధనల ప్రయోగమును వ్యాపింపఁ జేయుట.

(1) భూస్వామియును ఎస్టేటులోని ఖానిగీ భూమియొక్క పాయకారి రయితును పట్టాలు ముచ్చిలికాలు మార్చుకొని యున్నయెడల, భూస్వామి అట్టి పాయకారి రయితునుండి పన్నును రాఁబట్టుకొనుటకును,

(2) గవర్నమెంటు వారితో రయితువారీ ఏర్పాటునుబట్టి యున్నట్టిగాని, ఏ విధముగానయినను భూమిశిస్తును గవర్నమెంటువారికి సూటిగా చెల్లింపవలసి యున్నట్టి గాని భూమిఖామందయినను, స్వామ్యప్రహక్కు గల భూమికి ఖామందుగా రిజిష్టరులో దాఖలై యుండు వేళ యే మనుష్యుఁడైనను, తాను ఏ పాయకారీ రయితువద్ద అతఁడు చెల్లించవలసిన పన్ను వివరించి యున్నట్టి వ్రాతమూలమైన యొడంబడికను పుచ్చుకొని యున్నాఁడో అట్టి పాయకారీ రయితునుండి పన్నును రాఁబట్టుకొనుటకును.

ప్రయోగించును.

---

వగ 7 వ అధ్యాయము.

(ఇరిగేషన్) నీటిపాఱుదల వొర్కులను పనులను మరమ్మతుచేయుట.

(ఇరిగేషన్) నీటిపాఱుదల వొర్కులను మరమ్మతు చేయుటకుఁగాను డిస్ట్రిక్టు కలెక్టరుకు దరఖాస్తు.

135. ఒక భూస్వామిక్రింద నీటిపారుదల గల భూమిని కలిగి యున్నట్టియు ఒక నీటిపాఱుదల వొర్కుక్రింది ఆయకట్టుయొక్క పన్నులో పాతికవాసికంటె తక్కువకాకుండ చెల్లించుచున్నట్టియు యే రయితుగాని రయితులుగాని, తాను లేక తాము కలిగియున్నభూమి దేనిమూలముగ పాఱుదల గలిగియున్నదో ఆ నీటి పాఱుదలవొర్కు, మరమ్మతు కావలసిన స్థితిలో నున్నదనియు, తాను లేక తాము దరఖాస్తు చేసికొన్న మీఁదట అగత్యమైన మరమ్మతులు చేయించుటకు భూస్వామి నిరాకరించినాఁడనియు లేక అశ్రద్ధ చేసినాఁడనియు, అందువలన తాను లేక

తాము పాఱుదలవలన పెరిగెడి పైరు పెట్టుటకు అసమర్థులై యున్నా మనియు చెప్పుచు, సదరు వొర్క్కు మరమ్మతు చేయించుటకుగాను 137 వ సెక్షను ననుసరించి హుకుమును జారీ చేయించునట్లు ప్రార్థించుచు, డిస్ట్రిక్టు కలెక్టరుకు దరఖాస్తు పెట్టుకొనవచ్చును. అవశ్యకమని తోచునట్టి మరమ్మతులయొక్క స్వభావమును, ఆ వొర్క్కువల్ల నీరు పాఱునట్టి భూమియొక్క విస్తారమును, దానివల్ల రాగల పన్నును, గుఱించి ఆ దరఖాస్తులో చాలినంత సవిస్తరముగా వివరింపవలయును. అంతట డిస్ట్రిక్టు కలెక్టరు సొంతముగా నయినను, డెప్యూటీ తహసీల్దారు హోదాకు తక్కువ కానట్టి తనకు తాబేదారయిన యొక ఆఫీసరునకు సదరు విచారణను నియోగించి అతని ద్వారా యయినను, ఆ దరఖాస్తు నకలును ఒక నోటీసును భూస్వామికి అందింపజేసి, సదరు దరఖాస్తులో కోరబడినట్టి హుకుము ఎందుకు జారీ కాగూడదో దానికి హేతువును, నోటీసులో చెప్పబడిన తేదిని, తెలుపుమనవలయును. అదిగాక ఆ నీటి పాఱుదలభూమి యే గ్రామములో లేక గ్రామములలో నున్నదో అక్కడ ఆ నోటీసును అంటింపవలయును.

దరఖాస్తుమీద విచారణ.

136. ఆ నోటీసులో నిర్ణయించిన తేదిని గాని లేక విచారణ యే దినమునకు ఆపబడునో ఆ వేఱె తేదినగాని, దరఖాస్తుదారుని లేక దరఖాస్తుదార్లను, భూస్వామిని, ఆ నీటిపాఱుదల వొర్క్కుద్వారా పాఱుదల యగునట్టి భూమిలో నుండెడి యే రయితులయిన హాజరై యున్నయెడల వారిని, సదరు డిస్ట్రిక్టు కలెక్టరు లేక పైజెప్పిన ఆఫీసరు విచారణ చేయవలయును, మఱియు అతనికి యుక్తమని తోచిన యే సాక్ష్యమునైనను తీసికొనవచ్చును. డిస్ట్రిక్టు కలెక్టరుచే గాక వేఱె ఆఫీసరుచే సదరు విచారణ చేయబడిన పక్షమున అతడు దానిగుఱించి డిస్ట్రిక్టు కలెక్టరుకు రిపోర్టు పంపవలయును.

137. ఆ వొర్క్సువల్ల నీరుపాఱునట్టి భూమివిషయములో భూస్వామికి చెల్లింపనగు పన్ను ఆ భూమికి అట్లు నీరు పాఱుదల కాకుండునెడల ఎంతగా నుం

విచారణమీఁద హుకుము.

డునో అంతకంటె అధికముగా ఉన్నదనియును, దానిని ఆధారముగాఁ గల భూములయొక్క నీటిపాఱుదలను అది వస్తుతః అభ్యంతరపర్చునంతటి బేమరామతుస్థితిలో ఉన్నదనియు, ఆ బేమరామతుస్థితియైనది రయితుల దుష్కృత్యములవలనగాని రయితులు 1858 వ సంవత్సరపు మదరాసు 1 టి ఆక్టుయొక్క నిబంధనల ననుసరించి చేయుటకు బద్ధులై యుండు నట్టి చిల్లర మరమ్మతులు చేయక పోవుటవలనఁగాని కలిగినది కాదనియు, డిస్ట్రిక్టు కలెక్టరు తృప్తిపడినయెడల, అతఁడు దరఖాస్తులో వివరింపఁబడి నట్టి లేక విచారణకాలమందు చూపఁబడినట్టి పనులలో ఏవి ఆ నీటి పాఱుదలవొర్క్సును తగిన స్థితిలోకి తెచ్చుటకు అగత్యమయినవియు, వానికి పట్టఁగల మదింపుతగులుబడి యిట్టిదనియు, తెలుపుచు, మఱియు నిర్ణయింపఁబడిన కాలములోఁగా ఆ వొర్క్సులను నెఱవేర్చవలయునని భూస్వామిని కోరుచు. ఒక హుకుము జారీ చేయవలయును. మఱియు భూస్వామి ఆ వొర్క్సులను నెఱవేర్చుటకు నిరాకరించిన యెడలఁగాని, లేక నిర్ణయింపఁబడిన కాలములోనైనను డిస్ట్రిక్టు కలెక్టరు ఉత్తరు విచ్చు నట్టి హెచ్చుకాలములోనైనను వానిని నెఱవేర్చుటకు అశ్రద్ధ చేసిన యెడలగాని, కలెక్టరుకు దరఖాస్తు చేసికొన్నమీఁదట, దరఖాస్తుదారుని ఒక్కనిమాత్రమయినను వానితోఁగూడ చేరుటకు ఇష్టపడు వేఱె యే రయితుతోఁగూడనయినను, సదరు వొర్క్సులలో దేనినయినఁగాని అన్నిటినిగాని కలెక్టరు నిర్ణయించునట్టి న్యాయమైన కాలములోఁగా నెఱ వేర్చుటకు అధికారమీయవచ్చును. అయినను, అట్టి పనులు మరమ్మతు పనులయి మాత్రము ఉండవలయునే గాని, భూస్వామి సమ్మతిమీఁద నయిననే తప్ప క్రొత్తగా చేర్చెడి పనులుగాని అభివృద్ధి పనులుగాని

వానిలో చేర్పఁగూడదు; మఱియు, దేశాచారమును బట్టి నీటి వరవ కాలువలను పాఱుదలకాలువలను ప్రతి సంవత్సరము రయితులే బాగు పర్చవలసి యుండునట్టి పనివంటి యే చిల్లర పనులను వానిలో చేర్పఁగూడదు.

ఆ నీటి పాఱుదల వోర్కును కాపాడవలసిన పూచీయైనది, శాశ్వతపు ఫైసలాయతికి పూర్వము ఇయ్యఁబడి బ్రిటిష్ గవర్నమెంటువారిచే ఖాయపఱుపఁబడినట్టియు జోడీమాత్రము కట్టఁబడి యుండునట్టియు దశబంధము ఇనామును కలిగియుండు ఇనాముదారునియందు ఉంపఁబడి యున్నదనిగాని లేక వేఱొకవిధముగా తనయందు లేకుండ ట్రాన్స్ఫరు చేయబడినదనిగాని భూస్వామి స్థాపించుపక్షమున. లేక సదరు వోర్కును మరమ్మతు చేయుటచేత భూస్వామికిని రయితులకును లాభకరమని డిస్ట్రిక్టు కలెక్టరు తృప్తిచెందిననే తప్ప, సదరు డిస్ట్రిక్టు కలెక్టరు ఈ సెక్షనును బట్టి హుకుము జారీ చేయకూడదు.

వోర్కు కొంతవఱకు ఒక యెస్టేటుకును కొంతవఱకు గవర్నమెంటుభూమికినిఉపయోగించునెడలచర్య.

138. (1) నీటిపాఱుదల వోర్కు కొంతవఱకు ఒక యెస్టేటుకును, కొంతవఱకు గవర్నమెంటు భూమికిని ఉపయోగించునెడల, పైని చెప్పినట్లు మరమ్మతును సాధారణముగా డిస్ట్రిక్టు కలెక్టరే చేయవలెను. భూస్వామికి నోటీసు ఇచ్చి. సదరు మరమ్మతుకు అయినట్లు చెప్పఁబడిన కర్చును పరీక్షించుటకును దానినిగుఱించి అతనికి ఆక్షేపమేమైన నున్న యెడల అది చేయుటకు అతనికి అవకాశ మిచ్చినమీఁదట, దానికి తగిలెడి కర్చులు, సదరు వోర్కు మూలమున నీరుపాఱుటకు హక్కు కలిగి యున్నట్లు రిజిస్టరయి యుండు భూమి విస్తీర్ణము ఎంత గవర్నమెంటుదై యున్నదో సదరు వోర్కుమూలమున వేఱే చార్జి లేకుండ నీళ్లుపాఱించు

కొనుటకు భూస్వామి హక్కు కలిగియుండు భూమియొక్క విస్తీర్ణము ఎంత భూస్వామిదై యున్నదో ఆ దామాషా ప్రకారము గవర్నమెంటు వారును భూస్వామియును పంచుకొనవలయును. భూస్వామివద్దనుండి రావలసినట్టిభాగము. లాండ్ రెవిన్యూబాకీవలె రాబట్టుకొనదగియుండును.

(2) 1 టి సబ్ సెక్షనులో నుండునది యేదియు. గవర్నమెంటు వారివిగా నుండెడి యేనీటిపాఱుదల వొర్కులను కాపాడుటకు గవర్నమెంటువారు బద్ధులై యుందురో, మఱియు అట్టి యే నీటి పాఱుదల వొర్కులనుండి భూస్వామి చార్జిలేకుండ నీటి సరఫరా పొందుటకు హక్కు కలిగియుండునో, అట్టి వొర్కులకు ప్రయోగింపదు.

గవర్నమెంటువారివిగా నుండు వొర్కుల విషయములో మినహాయింపు.

(3) ఈ సెక్షనును అనుసరించి డిస్ట్రిక్టు కలెక్టరుయొక్క ఉత్తరువు భూస్వామికి అతృప్తికరముగా నుండినయెడల, సదరు భూస్వామి, ఈ క్రింది కారణములలో:—

(*a*) నీటిపాఱుదల వొర్కును రిపేరు చేయవలసిన బాధ్యత తనకు లేదనుట;

(*b*) (1) టి సబ్ సెక్షనునుబట్టి తాను చెల్లించవలసియుండు చార్జియొక్క భాగమైనది తప్పుగా లెక్కింపఁబడినదనుట;

వీనిలో దేనినిబట్టి యయినను. సదరు ఉత్తరువును కొట్టివేయుటకు లేక మార్చుటకు సివిల్ కోర్టులో వ్యాజ్యెము చేయవచ్చును.

ఉత్తరువు కొట్టివేయఁబడినయెడలఁగాని లేక మార్చివేయఁబడినయెడలఁగాని అన్యాయముగా వసూలు అయినదని కనుఁగొనఁబడిన యే మొత్తమునైనను మరల వాపసు చేయవలయునని కోర్టువారు ఉత్తరువు చేయవలయును.

139. 137 వ సెక్షను ననుసరించి యే వోర్కులయినను రయితులు చేయవచ్చునని కలెక్టరు ఉత్తరువు చేసినయెడల. దానిని చేయుటకు అధికారము పొందిన పార్టీలు సదరు వోర్కులను ముగించినతర్వాత తగులుబడిని రాఁబట్టుకొనుటకు ఉత్తరువు నిమిత్తము డిస్ట్రిక్టు కలెక్టరునకు దరఖాస్తు చేసికొనవచ్చును. అంతట డిస్ట్రిక్టు కలెక్టరు దరఖాస్తునకు ఆక్షేపణలు చేయుటకు భూస్వామికి అవకాశమిచ్చి, ఆ వోర్కుల క్రమముగాను నిర్ణయింపఁబడిన కాలములోను చేయఁబడినవనియు, కోరఁబడిన తగులుబడి అమితము కాదనియు, తనకు తృప్తికరముగా తెలియుటకు ఆవశ్యకమని తనకు తోఁచునట్టి ప్రయత్నములు చేయవలయును తనకు అట్లు తృప్తియయిన యెడల చేయఁబడిన వోర్కులకుఁగాను యుక్తముగా చేరవలసినట్లు తనకు తోఁచునట్టి మొత్తమును ఉదాహరించుచు అతఁడు హుకుము జారీ చేయవలయును. అట్టి హుకుములో మదింపులయొక్కయు ఫీకీ యొక్కయు తగులుబడిని చేర్చవచ్చును. పిమ్మట అతఁడు హుకుములో ఉదాహరించి యుండు మొత్తమును చెల్లించుమని భూస్వామిని ముందు అడుగవచ్చును. భూస్వామి సదరు మొత్తము ఇయ్యనన్నపక్షమున, డిస్ట్రిక్టు కలెక్టరు ఆ నీటిపాఱుదల వోర్కుక్రింద భూమిని పెట్టుకొని యున్న రయితులవద్దనుండి ఆ మొత్తమును రాఁబట్టుటకు హుకుమును జారీచేయవలయును. ఆ హుకుములో ప్రతి రయితును తాను అట్లు పెట్టుకొనియున్న భూమియొక్క పన్ను దామాషాప్రకారము వాఁడు చెల్లింపఁదగిన మొత్తమును తెలుపవలయును; ఈ సెక్షను ననుసరించి రయితులు చెల్లింపవలసిన లేక భూస్వామి చెల్లించునట్లు ఒప్పుకొనిన యే మొత్తమయినను, హుకుము తేదినుండి సంవత్సరమునకు నూటికి ఆఱువంతున వడ్డీతో సహా, భూమిశిస్తు బాకీవలెనే రాఁబట్టుకొనఁదగి యుండును.

మరమ్మతుయొక్క తగులుబడిని రయితులవద్దనుండి రాఁబట్టుట.

140. చేయఁబడిన వొర్కు లకు తనికీచేయుటకు అయినట్టి ఖర్చులు బడి యేదయిన నుండెనేని దానిని త్రోసివేసి రాఁబట్టిన మొత్తము 137 వ సెక్షనును బట్టి సదరు వొర్కులను చేయుటకు అధికారము పొందిన పార్టీలకు చెల్లింపవలయును.

మరమ్మతులుచేయు మనుష్యులకు పైకము ఇచ్చుట.

141. ఏ నీటిపాఱుదల విషయములోనయినను 139 వ సెక్షను యొక్క నిబంధనలనుబట్టి యే మొత్తముగాని ఎవనినుండి రాఁబట్టఁబడెనో అట్టి ప్రతి రయితును తాను భూస్వామికి చెల్లింపవలసినట్టి పన్నునుండి సదరు వొర్కుక్రింద రయితు అధీనమందుండు భూమికి నీరు పాఱినయెడల వేయఁబడు రేటుకును నీరు పాఱనియెడల వేయఁబడు రేటుకును గల తారతమ్య మెంతో అంత మొత్తమును త్రోసికొనుటకు హక్కు కలిగి యుండును: నీటిపాఱుదల [illegible] రేటు తెలియనియెడల, కలెక్టరు దరఖాస్తు చేయఁబడినమీఁదట ఆ గ్రామములో లేక చుట్టు ప్రక్కలనుండు గ్రామములలో అటువంటి విధమును అనుకూల్యములను గల మెట్టభూముల రేట్లనుబట్టి దానిని నిశ్చయింపవలయును. ఒక రయితు తన యధీనభూమియందు పాఱుదల గల భూమిని పాఱుదల లేని భూమిని ఈ రెంటిని ఐక్యపఱుపఁబడిన పన్నులోనై కలిగియుండి నీటి పాఱుదల అయ్యెడి రేటు తెలియనప్పుడు, కలెక్టరు దరఖాస్తు చేసికోఁబడినమీఁదట దానిని నిశ్చయింపవచ్చును. అయినను, 139 వ సెక్షను ననుసరించి రాఁబట్టుకోఁబడిన మొత్తము సంవత్సరమునకు నూటికి ఆఱువంతున వడ్డీతోడ చెల్లిపోఁగానే అట్లు త్రోసికొనకుండ మానుకోవలయును.

మరమ్మతుల తగులఁబడిని పన్నునుండి త్రోసివేసికొనుటచే రాఁబట్టుకొనుటకు హక్కు.

142. ఈ యధ్యాయమును బట్టి డిస్ట్రిక్టు కలెక్టరుచే జరిగింపఁబడు చర్యలను గురించి యే సివిల్ కోర్టువారును ఇంజెక్షనును సాదరు చేయఁగూడదు,

అప్పీలుకుఁ గల హక్కు.

లేక, 138 వ సెక్షనులో నిబంధించియుండునట్లు తప్ప, వ్యాజ్యెమును పట్టఁగూడదు, కాని 138 వ సెక్షనునుబట్టి చేయఁబడిన హుకుము కాకుండ వేఱె యీ యధ్యాయమునుబట్టి డిస్ట్రిక్టు కలెక్టరు సాదరు చేసిన యే హుకుముమీఁదఁ గాని ఈ యాక్టు షెడ్యూలుయొక్క B భాగములో వేఱువిధముగా నిబంధించి యున్ననే తప్ప రెవిన్యూ బోర్డువారికి అప్పీలుచేసికొనవచ్చును; వారితీర్పే కడపటి తీర్పు.

---

## 8 వ అధ్యాయము.

### చట్టమునకు విరుద్ధమైన వసూళ్లు.

*పన్నుకు జాస్తిగా ఏదైన వసూలుచేయుటను నిషేధించుట.*

143. ఏ పేరు పెట్టియైనఁగాని ఏ సాకు పెట్టియైనఁగాని చట్టపు సమ్మతముగా చెల్లింపవలసిన శిస్తుతో కూడ జాస్తిగా తేనిఁగాని రయితులనుండి భూస్వాములు నిర్బంధించి తీసికోఁగూడదు. అట్టి దానిని చెల్లించుటకై చేసికొను యావత్తు ఒడంబడికలును షరతులును చెల్లుబడికానేరవు.

*పైకమును అన్యాయముగా నిర్బంధించి తీసికొనుటకు శిక్ష.*

144. తత్కాలము అములులో నుండు ఏదైన విశేషమైన చట్టము ననుసరించి తప్ప, ఏ రయితువద్ద నుండి పైకపు మొత్తమేదియైనను, భూమియొక్క ఫలితములోని యే భాగమైనను, చట్టపుప్రకారము చెల్లింపవలసియుండు పన్నుకు ఎక్కువగా భూస్వామిచే నిర్బంధించి తీసికోఁబడినదో అట్టి ప్రతి రయితును, అట్లు నిర్బంధించి తీసికోఁబడిన మొత్తముతో లేక తీసికోఁబడినదాని విలువతో కూడ, నూఱు రూపాయలకు మించకుండను, లేక అట్టి మొత్తము లేక విలువయొక్క రెండింతలు నూఱు రూపాయలకు మించినయెడల, ఆ మొత్తమునకు లేక విలువకు రెండింతలకంటె మించకుండను కలెక్టరుకు ఎంతె యుక్తమని తోఁచునో అంత మొత్తమును జుల్మానా రూపముగా కలెక్టరు నెదుట వ్యాజ్యెము తెచ్చి రాఁబట్టుకొనుటకు హక్కు కలిగియుండును.

---

## 9 వ అధ్యాయము.

### అధీనభూములను ఎస్టేట్లను ఉపభాగములు చేయుటయు, ట్రాన్స్ఫరు చేయుటయు.

అధీనభూమిని తోడి భాగస్థులలోఁగాని ఒక భాగమును ట్రాన్స్ఫరుచేసినమీఁదటఁగాని భాగించుట.

145. (1) రయితు తన అధీనభూమియొక్క ఒక భాగమును ట్రాన్స్ఫరుచేయునెడల లేక అధీనభూమి తోడిభాగస్థులకు భాగింపఁబడి యున్నయెడల, అధీనభూమియొక్క ఉపవిభాగమును ఆక్షేపించుటకు భూస్వామికి అర్హత లేదు. అయినను భాగములకు పన్నును భూస్వామి విభాగింపవలెను లేక అతని అనుమతిమీఁద విభాగము చేయవలయును. మఱియు, పొలమును నీరు పాఱని తరగతిలో చేర్చియున్నపుడు ప్రతి ఉపభాగమును విస్తీర్ణములో అయిదు ఎకరములకంటె తక్కువ కాకుండను, నీరు పాఱు తరగతిలో లేక తోటక్రింద పొలమును చేర్చి యున్నపుడు విస్తీర్ణములో ఒక ఎకరమునకంటె తక్కువ కాకుండను ఉండిననే తప్ప, రెవిన్యూ పొలముయొక్క లేక దాని భాగముయొక్క విభాగమును ఒప్పుకొనుటకు ఏ భూస్వామిగాని బద్ధుఁడు కాఁడు.

(2) అట్టి విభాగము అన్యాయముగా ఉన్నపుడుగాని న్యాయ విరుద్ధమైనంత కాలమువఱకు ఆలస్యపఱుప బడినప్పుడుగాని, కలెక్టరు, రయితు దరఖాస్తు పెట్టుకొన్నమీఁదట, న్యాయమైన విభాగము చేయ వలయును, అట్టి విభాగమును ఒప్పుకొనుట అది సంబంధపడెడి మనుష్యు లకు విధాయకమయి యుండును.

రయితువలన చేయఁబడినట్టి గాని సివిల్ కోర్టువారి డిక్రీని అమలు చెలాయించుటలో చే యఁబడినట్టి గాని అధీనభూమి యొక్క ట్రాన్స్ఫరును భూ స్వామి అంగీకరింపవలయును.

146. (1) రయితు తన కార్యముచేతనేగాని లేక సదరు రయితు నకు విరుద్ధముగా సివిల్ కోర్టువారు జారీచేసిన డిక్రీ లేక యుత్తరువు మూలమునఁగాని లేక గవర్నమెంటు రెవిన్యూ బాకీకిఁగానైన లేక అట్టి బాకీవలె వసూలుచేయఁగల యే దేని డిమాండుకుఁగానైన విక్రయమూల మునఁగాని, అధీనభూమినిగాని లేక దాని

లో నే భాగముగాని ట్రాన్స్ఫరు చేసినప్పుడెల్లను అట్టి ట్రాన్స్ఫరు 145 వ సెక్షను నిబంధనలకు లోబడి ట్రాన్స్ఫరు చేయువాడును ట్రాన్స్ఫరు చేకొనువాడును భూస్వామికి వ్రాతరూపమయిన నోటీసు ఇచ్చి తెలియజేసిన యెడలను, లేక ట్రాన్స్ఫరును స్థాపించునట్టి సివిల్ కోర్టు డిక్రీయొక్క లేక ఉత్తరువుయొక్క సర్టిఫైడ్ నకలు తెచ్చి చూపిన యెడలను, లేక యే కోర్టువారియొక్కగాని పబ్లిక్ ఆఫీసరుయొక్కగాని ఉత్తరువు ననుసరించి విక్రయము మూలమున ట్రాన్స్ఫరుచేయబడు సంగతులలో, విక్రయపు సర్టిఫికేటును లేక సర్టిఫై చేయబడిన దాని నకలును హాజరుపరిచిన మీదటను, భూస్వామి అంగీకరింపవలయును.

(2) ఆయా సంగతికి తగినట్లు ట్రాన్స్ఫరు చేయువాడును ట్రాన్స్ఫరు చేకొనువాడును లేక తోడిభాగస్థులును వ్రాతమూలముగా నోటీసు ఇచ్చినమీదట, భూస్వామి నోటీసు ఇచ్చిన సంవత్సరమునకు సన్నిహితముగా వెంబడివచ్చు రెవిన్యూ సంవత్సరమునుండి, ఉపభాగములను అధీనమందుం గలవారితో ప్రత్యేకమైన ఒడంబడికలు చేసికొనవచ్చును.

నోటీసు నిచ్చుటకు ముందు ట్రాన్స్ఫరు చేసినవానికింగాని తోడిభాగస్థునికిం గాని విరుద్ధముగా జరుపబడు చర్యలు ట్రాన్స్ఫరు చేకొనువానికి లేక తోడిభాగస్థునికి విరుద్ధముగా చెల్లుబడి కలిగి ప్రయోజనకరముగ నుండవలయును.

147. (1) 146 వ సెక్షను ననుసరించి నోటీసు నిచ్చుటకు ముందుగాని 146 వ సెక్షను ననుసరించి డిక్రీ లేక ఉత్తరువుయొక్క అట్టి నకలు లేక విక్రయపు సర్టిఫికేటు హాజరు పర్చుటకు ముందుగాని ఈ యాక్టు ననుసరించి ట్రాన్స్ఫరు చేయువానికిగాని తోడిభాగస్థులకుంగాని విరుద్ధముగా ఆరంభింపబడిన లేక జరుపబడిన అన్ని కార్యములును, చర్యలును, అట్టి కార్యములు చర్యలు బాకీ చెల్లింప

వలసియుండు భూమితోను, దానిమీఁద పెరుగు పైరుతోను, దాని నుండి సేకరింపఁబడిన ఫలితముతోను, సంబంధించు నంతవఱకు లేక సంబంధించుటకు ఉద్దేశించి యుండునంతవఱకు సదరు ట్రాన్స్ఫరు చేకొనువాని విషయములో, లేక తోడిభాగస్థుని విషయములో వానికి విరుద్ధముగా అట్టి కార్యములు చర్యలు ఆరంభింపఁబడి లేక జరుపఁబడి, అతఁడు తప్పిపోయినవాఁడయి యుండిన నెట్లో అట్లే చెల్లుబడి కలిగి ప్రయోజనకరముగ నుండును.

(2) 146 వ సెక్షను ప్రకారము ఇయ్యవలసి యుండు నోటీసు 78 వ సెక్షను (2) వ సబ్ సెక్షనుచే నిబంధించి యుండు విధమున అందఁజేయవలయును.

(3) పైని చెప్పినట్లుగా వ్రాఁతమూలముగా నోటీసు ఇచ్చు నంతవఱకు ట్రాన్స్ఫరు లేక విభాగము అయిన కారణము మాత్రము ననే, ట్రాన్స్ఫరు చేసినవాఁడు లేక తోడిభాగస్థుఁడు తాను రయితగుట వలన తనకుఁ గల పూచీలలో దేనినుండియయినను విడుదలపొందఁడు.

భూస్వామియును ట్రాన్స్ఫరు చేకొనువాఁడునులేక తోడిభాగస్థుఁడును ట్రాన్స్ఫరును లేక విభాగమును గుఱించి నోటీసు ఇచ్చుట.

148. ఏ భూస్వామియైన తన యెస్టేటు లేక భూమిఁ యావత్తును దానిలో నొక భాగమునుగాని ట్రాన్స్ఫరు చేయునెడల, లేక యే యెస్టేటుగాని లేక భూమిగాని తోడిభాగస్థులకు భాగింపఁబడిన యెడల, భూస్వామియు ఆయాసంగతికి తగినట్లు ట్రాన్స్ఫరు చేకొనువాఁడును లేక తోడిభాగస్థుడును డిస్ట్రిక్టు గెజెటులో ప్రకటనచేయుటచేతను, లోకల్ గవర్నమెంటువారు విధిమూలముగ ఉత్తరువు చేయునట్టి మఱియొక విధముగాను, ఆయా సంగతికి తగినట్లు ట్రాన్స్ఫరు చేయఁబడిన లేక

భాగింపఁబడిన భూమిని అనుభవించుచుండెడి రైతులకు అట్టి ట్రాన్స్ఫరునుగుఱించి లేక విభాగమునుగుఱించి నోటీసు ఇయ్యవలయును, మఱియు అట్టి నోటీసు ఇయ్యఁబడిననే తప్ప, మఱి యియ్యబడువఱకును, ఏ రైతుగాని ఆ ట్రాన్స్ఫరు లేక విభాగము జరిగిన తర్వాత ఏర్పడి నట్టియు, అట్టి ట్రాన్స్ఫరును లేక విభాగమును గుఱించిన నోటీసు రయితుకు ఇయ్యఁబడక ముందు భూస్వామికి చెల్లింపఁబడినట్టియు, ఏ దయిన పన్నును గుఱించి ట్రాన్స్ఫరు చేకొన్నవానికి లేక తోడిభాగ స్థునికి పూచీదారుఁడు కానేరడు; మఱియు అట్టి నోటీసు ఇయ్యఁబడని రైతులలో ఎవరైన భూస్వామిమీఁద జరిపిన యావత్తు చర్యలును, అవి ట్రాన్స్ఫరు చేకొన్నవానిమీఁదనే లేక తోడిభాగస్థునిమీఁదనే మొదట జరపఁబడినయెడల నెట్లో అట్లే వానియెడల సప్రయోజనముగాను నిర్బంధముగాను వర్తించును.

---

## 10 వ అధ్యాయము.

### వదలుకొనుటయు (ఇజెక్ట్మెంటు) వెడలఁగొట్టుటయు.

రయితు అధీనభూమిని వదలుకొనుట.

149. (1) ఒక నిర్ణయమయిన కాలమువఱకు ఒక కౌలుచేగాని లేక ఒక వ్రాఁతమూలమైన యితర ఒడంబడికచేఁగాని బద్ధుడై యుండునట్టి పాత బంజరు గల రయితు కాకుండ యితర ప్రతి రయితును ఏ రెవిన్యూ సంవత్సరాంతమునుండి యయినను అములులోనికి వచ్చునట్లుగా తన యధీనభూమినిగాని ఒక లేక రెవిన్యూ పొలమునకు తక్కువ కాకుండ అందలి యే భాగమునైనఁ గాని వదలుకొనవచ్చును. అయినను, వదలుకొనఁబడిన భాగము ప్రవేశింపఁగూడినదిగా నుండవల యును. మఱియును, నిలిపిపెట్టుకోఁబడిన భాగముమీఁద పన్ను పంపకము మును, రయితు మనవిచేసికొనిన మీఁదట కలెక్టరుచే విమర్శమునకు

లోఁబడి, భూస్వామి చేయవలెను. నిలిపి పెట్టుకోఁబడిన భాగము క్రొత్త యధీనభూమిగా ఎన్నబడి వదలుకొనుటకు నోటీసు ఇచ్చిన సంవ్సరమునకు సన్నిహితముగా నుండు వెనుకటి సంవత్సరమునకు ఆ యధీనభూమి విషయమై క్రొత్త పట్టా ముచ్చలికాలు మార్చుకొనవలయును.

(2) తన యధీనభూమినిగాని తన యధీనభూమియొక్క భాగమునుగాని అట్లు వదలుకొనునట్టి రయితు, కలెక్టరునెదుట భూస్వామి వ్యాజ్యెము తెచ్చినమీఁదట వదలుకొనువిషయమై తన తాత్పర్యమును గుఱించి నోటీసును ఏప్రిల్ నెల 1 టి తేదిని లేక అంతకు ముందుగా భూస్వామికి ఇచ్చిననే తప్ప, వదలుకొను తేదికి తర్వాతనే వచ్చు రెవిన్యూ సంవత్సరమునకు ఆ యధీనభూమిమీఁది లేక అందలి భాగముమీఁదియే పన్ను నష్టియయినను భూస్వామికి కట్టియిచ్చుటకు సదరు రయితు జవాబుదారుఁడై యుండును.

నోటీసు జారీచేయుటకై రెవిన్యూ ఆఫీసరునకు దరఖాస్తు పెట్టుకొనుట.

150. (1) భూస్వామి 149 వ సెక్షను (2) వ సబ్ సెక్షను ననుసరించి యే నోటీసునుగాని పుచ్చుకోక నిరాకరించినయెడల, రయితు, ఏప్రిల్ నెల పదునైదవ తేదికి పైఁబడకుండ, ఒక రెవిన్యూ ఉద్యోగస్థునికి దరఖాస్తు పెట్టుకోవచ్చును. అంతట అతఁడు, అందఁజేయుటకై కర్చులను రయితు చెల్లించినమీఁదట అట్టి భూస్వామికి సదరు నోటీసును అందఁజేయించవలయును.

(2) అట్టి ప్రతి నోటీసును, మొదట యియ్యఁబడినప్పుడే పుచ్చుకోఁబడినట్లు భావింపఁబడును.

(ఇజెక్టుమెంటు) వెడలఁగొట్టుటకు వ్యాజ్యెము.

151. (1) రయితు అధీనభూమియొక్క విలువను సాగుబడి కార్యముల విషయములో కేవలము చెడఁగొట్టి అట్టి కార్యములకు కేవలము ఉపయోగపడనట్లుగా చేసినాఁడను కారణమునుబట్టి భూ

త్రమే అనుభవపు హక్కుగల రయితును వాని అధీనభూమినుండి వెడలఁగొట్టుటకు భూస్వామి కలెక్టరునెదుట వ్యాజ్యెము దాఖలుచేయవచ్చును.

(2) ఈ సెక్షనులో ఏమి చెప్పియున్నను నిమిత్తము లేకుండ, భూస్వామి, ఇజెక్ట్మెంటుతోఁ గూడ లేక దానికి మాఱుగా, (కాంపెన్సేషను) ప్రతీకారమునకు కలెక్టరునెదుట వ్యాజ్యెము తేవచ్చును; లేక కాంపెన్సేషనుతోఁగాని కాంపెన్సేషను లేకుండఁగాని, యింజంక్షను కొఱకు లేక సదరు నష్టినిగాని దుర్వినియోగమునుగాని బాగుచేయుట కొఱకు వ్యాజ్యెము తేవచ్చును.

నష్టము బాగుచేయఁ దగిన పుడు, లేక ద్రవ్యరూపమగు ప్రతీకారము తగుమైన పరిహారముగా నుండునపుడు డిక్రీ.

152. అనుభవపు హక్కుగల ఒక రయితు, పై కడపటిసెక్షను ననుసరించిన యే వ్యాజ్యెములో నైనను వెడలఁగొట్టఁబడుటకు అర్హుఁడుగ నున్నట్లు తెలిసికొనఁబడినను, అధీనభూమికి జరిగిన నష్టము బాగుచేయుటకు తగినదని గాని, లేక ద్రవ్య ప్రతీకారము తగుమైన పరిహారముగా నుండుననిగాని కనుఁగొనఁబడినపుడు, డిక్రీలో, సదరు రయితు ఆ డిక్రీ తేదినుండి నెలకులోఁగాఁగాని, కలెక్టరు కారణములను రెకార్డు చేసి సెలవిచ్చెడు అంతకంటె హెచ్చుకాలములోఁగాని, ఆ నష్టిని బాగు చేయని పక్షమున లేక కలెక్టరుచే నిర్ణయింపఁబడి, డిక్రీలో నమూదు పఱుపఁబడిన మొత్తమును కాంపెన్సేషనుగా ఇయ్యనిపక్షమున, వాఁడు (ఇజెక్టు) వెడలఁగొట్టఁబడునని చెప్పియుండవలయును.

అనుభవపు హక్కులేని రయితును ఏ కారణములనుబట్టి వెడలఁగొట్టవచ్చును.

153. అనుభవపు హక్కులేని రయితు, ఈ యాక్టుయొక్క నిబంధనలకు లోఁబడి, ఈ క్రింది కారణములలో నొకటిచేతఁగాని లేక ఎక్కువవానిచేతఁగాని కలెక్టరు నెదుట వ్యాజ్యెము తేఁబడి వెడలఁగొట్టఁబడుటకు అర్హుడగును

గాని వేఱు విధముగా వెడలఁగొట్టఁబడఁగూడదు. ఆ కారణములు ఏవనఁగా:—

ఈ సెక్షనులో నుండున దేదియును, ఈ యాక్టు ప్రారంభించుటకు పూర్వము ఈయఁబడిన గుత్తయొక్క గడవు ముగిసిపోయిన కారణమునుబట్టి ఈ యాక్టుయొక్క నిబంధనల ప్రకారము అనుభవపు హక్కు లేని రయితు అయినట్టి యే మనుష్యునిఁగాని వెడలఁగొట్టుటకుఁ గల బాధ్యతను బాధింపదు.

(*a*) పాయికారీ రయితఱికముయొక్క కార్యములకుఁగాను భూమిని అనర్థముగా చేయు విధముగా దానిని ఉపయోగించెనను కారణము.

(*b*) తనకు విరుద్ధముగా లేక తాను ఏ మనుష్యునికి న్యాయ సమ్మతమైన ప్రతినిధిగా నున్నాఁడో అట్టి మనుష్యుని కెవనికైనను విరుద్ధముగా, అధీనభూమి విషయమై పన్ను బాకీకిఁగాను ఒక డిక్రీ జారీచేయఁబడిన రెవిన్యూ సంవత్సరమునకు తర్వాత వచ్చు రెవిన్యూ సంవత్సరము అంత మయినపుడు సదరు డిక్రీ మొత్తము చెల్లింపఁబడక యుండు కారణము.

(*c*) అతఁడు, 49 వ సెక్షనుబట్టి నిర్ణయింపఁబడిన న్యాయమైనట్టియును ధర్మమైనట్టియును పన్నును చెల్లించుటకు ఒప్పుకొనకుండ నిరాకరించినాఁడను కారణము.

(*d*) భూస్వామి యుత్తరువు లేకుండ, రయితు తన అధీన భూమియందులాభమునకై లోహములనుఎత్తినాఁడను కారణము లేక రాళ్లు ఎత్తుకొనెనను కారణము లేక త్రవ్వెనను కారణము.

(*e*) అయిదు ఏండ్లకంటె మించిన కాలపరిమాణమువఱకు, ఒక రెజిస్టరుచేయఁబడిన కౌలునుబట్టి, భూమియొక్క అనుభవము అతనికి కలుగఁజేయఁబడినయెడల, కౌలుకాలము ముగిసిపోయెనను కారణము.

అనుభవప్రహక్కు లేని రయితు చేసిన అభివృద్ధికి ప్రతీకారము.

154. (1) అనాది బంజరు గల రయితుగాని అతనికి పూర్వము ప్రయోజనము కలిగియుండిన మనుష్యుఁడు గాని. తన యధీనభూమి విషయమై ఈ యాక్టు ప్రకారముగాని లేక భూస్వామి యొక్క సమ్మతితోఁగాని అభివృద్ధి చేసినయెడల, డిక్రీ చేయుటతోఁగాని లేక అతని వెడలఁగొట్టవలెనను ఉత్తరువును జారీచేయుటతోఁగాని ముగిసిన చర్యను దాఖలుచేసిన తర్వాత అతఁడు అభివృద్ధిని ఆరంభించి యుండినసే తప్ప. అభివృద్ధికిఁగాను ప్రతీకారమును ముందే ఇచ్చియుం డనియెడల, అభివృద్ధికిఁగాను ప్రతీకారము తాను పుచ్చుకొనువఱకు అతఁడు వెడలఁగొట్టఁబడఁగూడదు.

(2) రయితు వెడలఁగొట్టఁబడుటకు డిక్రీని లేక ఉత్తరువును చేయు రెవిన్యూకోర్టువారు, ఈ సెక్షను ననుసరించి అతనికి ప్రతీకార మేదైన బాకీయుండినయెడల దాని మొత్తమును నిశ్చయించి, అట్లు వెడలఁగొట్టుటకుఁగానైన చర్యవలన రయితు భూస్వామికి బాకీయుండు నట్లు నిశ్చయింపఁబడిన యే పన్నుబాకీలనుగాని లేక కర్చులనుగాని సదరు మొత్తమునుండి తీసికొని మిగిలినదానిని భూస్వామి డిపాజిటు చేయువఱకు. అములు నెఱవేర్చుటను నిలిపియుంచవలెను.

(3) రయితు తనకు ఏదో యొక విశేషమైన లాభమునకు ప్రతిగా ప్రతీకారము లేకయే అభివృద్ధిచేయుటకు అతని బద్ధునిగాఁజేయు ఒక కాంట్రాక్టు ననుసరించి సదరు అభివృద్ధిని చేసి సదరు లాభమును పొందియుండినయెడల, ఆ యభివృద్ధికిఁగాను ఈ సెక్షను ననుసరించి ప్రతీకారము దేనినిగాని అడుగఁగూడదు.

(4) అభివృద్ధులకుఁగాను ఇయ్యవలసిన ప్రతీకారమును మదింపు వేయుటకుఁగాను లోకల్ గవర్నమెంటువారు ఎంపఱు అసెసర్ల సహా

యఖు యుక్తమని తేఁచుచున్నారో అందఱు అసెసర్లు సహాయము రెవిన్యూ కోర్టువారు కలిగియుండవలెనని కోరుచును, సదరు అసెసర్ల యోగ్యతలను వారిని ఎన్నవలసిన విధమును నిశ్చయించుచును, లోకల్ గవర్నమెంటువారు విధులను చేయవచ్చును.

(5) అభివృద్ధులకుఁగాను ఇయ్యవలసిన ప్రతీకారమును మదింపు వేయుటలో—

(*a*) గుత్తయొక్క కిమ్మతుగాని లేక అధీనభూమియొక్క మహాసూలుగాని లేక ఆ మహాసూలుయొక్క విలువగాని, అభివృద్ధివలన ఎంత హెచ్చునో ఆ మొత్తమును,

(*b*) అభివృద్ధియొక్క స్థితియును, దాని ఫలితములు బహుశః ఏంతకాల ముండు ననునదియును,

(*c*) అభివృద్ధికి ప్రతిగా భూస్వామి రయితుకు ఇచ్చిన ఏ పన్ను తగ్గింపును లేక పన్నుముజరాను లేక వేఱే యితర లాభమును,

గమనింపవలెను.

పంటవిషయములోను, విత్తుటకు తయారుచేయఁబడినభూమి విషయములోను, వెడలఁగొట్టఁబడిన రయితునకుఁగల హక్కు.

155. అధీనభూమినుండి వెడలఁగొట్టఁబడిన ప్రతి రయితు విషయములోను ఈ క్రింది విధులు ప్రయోగించును:—

(1) రయితు వెడలఁగొట్టఁబడు తేదికి పూర్వము, తాను అధీనభూమిలో నుండు ఏ నేలయందైన విత్తనములు చల్లియుండినను లేక పైరు నాటియుండినను, భూస్వామి ఇష్టముప్రకారము, ఆ భూమిని

స్వాధీనమం దుంచుకొని పైరును పెంచి క్రోయు కార్యములకుఁగాను ఆ భూమిని ఉపయోగించుటకును, లేక భూమిని తయారుచేసి విత్తనములు చల్లుటలోను పైరు నాటి పెంచుటలోను రయితుపడిన ప్రయాస, అతఁడు వెచ్చించిన పెట్టుబడి వీని మదింపు విలువయు దానిమీఁద న్యాయమైన వడ్డియు. భూస్వామివద్దనుండి పుచ్చుకొనుటకును, రయితుకు హక్కుగలదు.

(2) రయితు వెడలఁగొట్టఁబడుటకు పూర్వము తాను తన యధీనభూమిలో నుండు ఏ భూమినిగాని విత్తనములు చల్లుటకు తయారు చేసియుండి, ఆ భూమిలో విత్తనములు చల్లక లేక పైరు నాటక యుం డినయెడల, భూమిని అట్లు తయారుచేయుటలో రయితుపడిన ప్రయాస, అతఁడు వెచ్చించిన పెట్టుబడి, వీని మదింపు విలువయు, దానిమీఁద న్యాయమైన వడ్డియు భూస్వామివద్దనుండి పుచ్చుకొనుటకు రయితుకు హక్కుగలదు.

అయినను, రయితును వెడలఁగొట్టుటకు చర్యలను భూస్వామి ప్రారంభించిన తర్వాత, ప్రదేశపు మామూలునకు విరుద్ధముగా రయితు ఏ భూమినిగాని సాగుబడి చేసినపుడు లేక తయారుచేసినపుడు, ఈ సెక్షను ననుసరించి సదరు భూమిని స్వాధీనమం దుంచుకొనియుండుటకు లేక దాని విషయమై ఏ మొత్తమునుగాని పుచ్చుకొనుటకు రయితుకు హక్కు ఉండదు.

మఱియును, రయితు వెడలఁగొట్టఁబడునపుడు తాను భూస్వామికి ఏదైన పన్నును చెల్లింపవలసి యుండినయెడల దానిని ఈ సెక్షను ననుసరించి రయితుకు చెల్లింపవలసిన యే మొత్తములకైనను చెల్లు పెట్టవచ్చును.

156. పై కడపటి సెక్షనుయొక్క (1) టి క్లాజులో నిర్ణయింపఁబడిన కార్యముకొఱకు రయితు ఏ భూమినిగాని స్వాధీనమందుంచుకొని యుండనిచ్చుటకు ఆ క్లాజు ననుసరించి భూస్వామి ఇష్టపడఁనప్పుడు, ఆ భూమిని స్వాధీనమందుంచుకొన నిచ్చునట్టి కాలములో దానిని ఉపయోగించుటకుఁగాను అనుభవించుటకుఁగాను, రయితు ఏ రేటువంతున ఆ భూమిని ఉంచుకొని యుండెనో ఆ రేటువంతున పన్నును రయితు భూస్వామికి చెల్లింపవలయును.

పై సెక్షను ననుసరించి భూమిని అనుభవించుటకుఁ గాను రయితు పైకము చెల్లించుట.

157. విరుద్ధముగా ఏ కాంట్రాక్టు ఉండినను నిమిత్తము లేకుండ, పాఁత బంజరుయొక్క పాయకారీ రయితును 153 వ సెక్షనులో నుదాహరింపఁబడిన కారణమునుబట్టి తప్ప లేక ఈయాక్టుయొక్క 48, 49, 154, 155 వ సెక్షన్లలోని నిబంధనల ప్రకారమును వానికి లోఁబడియును తప్ప, భూస్వామి వెడలఁగొట్టఁగూడదు.

పాఁత బంజరుయొక్క పాయకారీ రైతును వెడలఁగొట్టుట.

పాయకారీ రయితులను (ఇవిక్షన్) తొలఁగించుట.

158. ఒక ఎస్టేటులో ఖానిగీ భూమియొక్క ఏ పాయకారి రయితయినను ఒక రెవిన్యూ సంవత్సరము కడపట బాకీ పడియుండి, ఆ బాకీని తీర్చుటకు సరిపోవు జప్తుసొత్తు ఆ స్థలమందు లేనియెడల, భూస్వామిగాని లేక అధికారము పొందిన యతని యేజెంటుగాని ఆ స్థలమందు ప్రవేశించి దానిని స్వాధీనపఱుచుకొనుటకు తనకు అధికార మిచ్చెడి వారంటుకొఱకై కలెక్టరునకు దరఖాస్తు పెట్టుకొనవచ్చును. ఆ వారంటుకొఱకు దరఖాస్తు చేసికొను మనుష్యుఁడు వ్రాఁతమూలమగు స్టేట్ మెంటు హాజరుపఱిచినమీఁదట

పాయకారీ రైతును కలెక్టరు వారంటునుబట్టి (ఇవిక్షచేయుట) తొలఁగించుట.

అట్టి వారంటు ఇయ్యఁబడును. ఆ స్టేట్‌మెంటులో చెల్లింపక తప్పి పోయినవాని పేరును, ఆ స్థలముయొక్క వివరమును విస్తీర్ణమును, బాకీకిని వడ్డీకిని జప్తుఖర్చులు ఏవైన తగిలినయెడల వానికిని చేరవలసిన మొత్తమును, బాకీ నిలువగా ఏర్పడిన తేదిని, ఆ స్థలములో చాలినంత జప్తుసొత్తు లేదనెడి (డిక్లరేషను) రూఢిసంగతిని తెలియఁజేయవలయును. అట్టి స్టేట్‌మెంటును వారంటు జారీచేసెడి ఆఫీసులో దాఖలు చేయవలయును.

వారంటులోని విషయములు.

159. వారంటులో, చెల్లింపక తప్పిపోయినవాని పేరును, చెల్లింపవలసిన యావత్తు మొత్తమును, స్థలముయొక్క వివరమును విస్తీర్ణమును, కనఁబఱుచుచు పైకము పదునైదు దినములలోఁగా చెల్లింపఁబడిననే తప్ప, చెల్లింపక తప్పిపోయినవాఁడు స్వాధీనమునుండి తొలఁగింపఁబడు నని తెలియఁజేయవలయును. కలెక్టరు ఈ సెక్షనులో చెప్పఁబడిన పదునైదు దినముల కాలమును విశేషకారణములనుబట్టి జాస్తి చేయవచ్చును.

వారంటును అములు జరుపుట.

160. ఆ వారంటును ఒక పోలీసు ఆఫీసరునకు ఒప్పగింపవలయును; అతఁడు దానిని 78 వ సెక్షను లోని (2) వ సబ్‌సెక్షనులో తెలుపఁబడిన విధమున అంపఁ జేయవలయును. అట్లు అందఁజేసిన తర్వాత పదునైదు దినములలోఁగాఁ గాని, పై కడపటి సెక్షనునుబట్టి కలెక్టరుచే జాస్తిచేయఁబడిన కాలములోఁగాఁ గాని, వారంటులో చెప్పఁబడిన మొత్తము చెల్లింపఁబడనియెడలను, చెల్లింపక తప్పిపోయిన వాఁడు వారంటును రద్దుపఱుచుటకై కలెక్టరు నెదుట వ్యాజ్యెము దాఖలు చేయనియెడలను, లేక అట్టి వ్యాజ్యెమైనది తప్పి పోయినవానికి ప్రతికూలముగా తీర్పు చేయఁబడినయెడలను, ఆ పోలీసు ఆఫీసరు ఆ భూస్వామికి స్వాధీనము చేయవలయును.

161. పై కడపటి సెక్షనునుబట్టి స్వాధీనము చేయఁబడినప్పుడు, స్వాధీనపఱుపఁబడిన తేదిలగాయతు మూఁడు మాసములలోఁగా, చెల్లింపక తప్పిన వాఁడు ఒక సివిల్‌కోర్టులో, ఆ చర్యలను త్రోసివేసి అతనికి మరల స్వాధీనపఱుచుటకయి ఒక యుత్తరువునకుఁగాను వ్యాజ్యెము దాఖలుచేయవచ్చును. మఱియు అట్టి వ్యాజ్యెములోని తీర్పు ఏదయిన నుండునెడల దానికి లోఁబడి, చెల్లింపక తప్పిన వానియొక్క ఆ స్థల విషయములోని హక్కును బాధ్యతయు ఆఁగిపోయి అంతమగును.

పాయకారీ రైతఱికము ముగియుట.

162. 158, 161 వ సెక్షన్లలోని దేదియును పాయకారీ రయితుకు అమ్మఁదగిన హక్కుగల యే భూమికిని ప్రయోగించునట్లు ఎంచఁగూడదు.

మినహాయింపు క్లాజు.

163. (1) వారసత్వమువలనఁ గాని లేక చట్టపు సమ్మతమైన ట్రాన్స్ఫరు మూలముగాఁ గాని కాకుండ వేఱె యే విధముగానైన ఒక ఎస్టేటులో రయితీ భూమిని అనుభవించుచుండి భూస్వామిచే రయితుగా అంగీకరింపఁబడనట్టిమనుష్యుఁడెవఁడుగానిఒక సివిల్ కోర్టులో వ్యాజ్యెము తెచ్చుటవలన, అక్రమముగా ప్రవేశించినవానివలె (ఇజెక్ట్మెంటుకు) వెడలఁగొట్టఁబడుటకు అర్హుఁడుగ నుండును.

అక్రమముగా ప్రవేశించిన వానిని (ఇజెక్టు) వెడలఁగొట్టుట.

(2) ఈ సెక్షను ననుసరించి వెడలఁగొట్టుటకై తేఁబడునట్టి యే వ్యాజ్యెములోనైనను, 45 వ సెక్షను ననుసరించి భూస్వామికి చెల్లింపవలసిన యే మొత్తమునైన రాఁబట్టుకొనుటకును అతనికి హక్కు ఉండును.

## 11 వ అధ్యాయము.

### సర్వే, హక్కుల రెగార్డు, పన్నుల సెటిల్మెంటు.

సర్వే చేయునట్లును హక్కుల రెకార్డు తయారు చేయునట్లును ఉత్తరువు చేయుటకు లోకల్ గవర్నమెంటువారికి గల అధికారము.

164. (1) ఒక యెస్టేటునుగాని ఒక యెస్టేటు భాగమునుగాని ఒక రెవిన్యూ ఆఫీసరు సర్వే చేసి హక్కుల రెకార్డును తయారు చేయవలయునని ఆజ్ఞాపించుచు లోకల్ గవర్నమెంటువారు ఈ క్రింది సంగతులలో ఒక హుకుము చేయవచ్చును, ఆ సంగతులు ఏవనగా:—

(*a*) (i) భూస్వామి లేక రయితులు, లేక,

(ii) భూస్వాముల మొత్తం సంఖ్యలో సగముమందికంటె తక్కువకాకుండ భూస్వాములు, లేక

(iii) ఎస్టేటులో లేక దాని ఏ భూస్వామికి లేక దామాషా సంఖ్య భూస్వాములకు ఉండునట్టి ప్రయోజనమయినది భూస్వాములందరికి దానిలో నుండునట్టి భాగముల మొత్తములో సగమునకంటె విలువలో తక్కువ కాకుండ నుండునో ఆ భూస్వామి లేక దామాషా సంఖ్య భూస్వాములు, లేక

(iv) రయితుల మొత్తపు సంఖ్యలో నాలవవంతుకు తక్కువ కాని రయితులు-కర్చులు ఇచ్చుటకుగాను లోకల్ గవర్నమెంటువారు ఆజ్ఞాపించునంతే మొత్తమును డిపాసిటు చేసి లేక దానికి జామీను ఇచ్చి అట్టి హుకుముకొరకయి దరఖాస్తు పెట్టుకొనునెడల ;

(*b*) సామాన్యముగా రయితులకుగాని ఒక యెస్టేటుయొక్క లేక ఒక యెస్టేటు భాగముయొక్క భూస్వామికిగాని

చట్టప్రకారము గల హక్కులను వారు లేక అతఁడ
తమ లేక తన హోదాలలో అనుభవించునట్లు
చేయుటకయి అట్టి రెకార్డును తయారుచేయవలసి
యున్నదని లోకల్ గవర్నమెంటువారు తలంచిన
యెడల, లేక అట్టి రెకార్డును తయారుచేయుటవలన
సామాన్యముగా రయితులకును వారి భూస్వామి
కిని ఉన్నట్టి లేక బహుశః కలుగఁగల ప్రమాద
మయిన వివాదము పరిష్కారమగునని లేక ఆఁగి
పోవునని తోఁచినయెడల; లేక

(c) ఆ యెస్టేటు గవర్నమెంటు వారిచే నిర్వహింపఁబడు
చుండునట్టి, లేక కోర్టుఆఫ్ వార్డ్సు వారి విచా
రణలో నుండునట్టి యెస్టేటు అయినయెడల.

(2) ఈ సెక్షనునుబట్టి చేయఁబడిన హుకుమునుగుఱించి అఫిషల్ గెజెటులో చేయఁబడు ప్రకటన ఆ హుకుము క్రమముగా చేయఁబడిన దనుటకు ఖండితమయిన సాక్ష్యముగా నుండును.

(3) సర్వేను ఎల్లలను గుఱించిన 1897 వ సంవత్సరపు మదరాసు 4 వ ఆక్టు ననుసరించి సర్వే చేయవలయును; మఱియు హక్కుల రెకార్డును, లోకల్ గవర్నమెంటువారిచే నిర్ణయింపఁబడు విధుల ననుసరించి తయారు చేయవలయును. మఱియును లోకల్ గవర్నమెంటువారు అట్లు ఆజ్ఞాపించిన పక్షమున సదరు రెకార్డులో ఈ క్రింది విషయములను గుఱించి ప్రతి రయితుయొక్కయు భూస్వామియొక్కయు అన్ని హక్కులను ప్రాచీలను గుఱించిన రెకార్డు ఉండవచ్చును.
(అవి యేవియన):—

(i) చెఱువునుండిగాని, బావినుండిగాని, లేక యింక ఏదైన ఇతరమయిన జలాధారమునుండిగాని వచ్చు నీటిని వ్యవసాయపు పనులకుఁగాను రైతులచే ఉపయోగ పెట్టుకొనఁబడుట.

(ii) ప్రతిరయితుయొక్క అధీనములో నుండు భూమి సాగు బడికిఁగాను నీటి పాఱుదలను పొందుటకొఱకయిన పనులను, అట్టి పనులు సదరు భూమియొక్క హద్దుల లోపల ఉండినను ఉండకపోయినను, బాగుచేసి కాపాడుట.

విషయములను రికార్డు చేయవలయును.

165. పై కడపటి సెక్షనునుబట్టి హుకుము చేయఁబడినప్పుడు, రికార్డు చేయవలసిన వివరములను ఆ హుకుములో ఉదాహరింపవలయును, మఱియు ఆ వివరములలో, మఱి వేఱెవివరములు లేకయే గాని లేక వానితోఁకూడఁగాని, ఈ క్రిందివానిలో కొన్ని యయినను లేక అన్నియయినను ఉండవలయును, అవి యేవనఁగా:—

(*a*) ఎస్టేటులో లేక దానిభాగములో ప్రతి రయితుయొక్క భూస్వామిపేరును ప్రతి భూస్వామిపేరును;

(*b*) రయితుయొక్క పేరును, రయితు అనుభవపు హక్కుగల రయితా లేక అనుభవపు హక్కులేని రయితా అను విషయమును, లేక రయితు లేనిపక్షమున అనుభ వించు వానియొక్క పేరును;

(*c*) గ్రామపు సర్వే మాపులో చూపియున్న ప్రకారము, రయితు పెట్టుకొనియున్న భూమియొక్క ఉనికి, విస్తీర్ణము, ఒకటి లేక యెక్కువ హద్దులు;

(*d*) భూమి నీటిపాఱుదల గలదియా పాఱుదల లేనిదియా, లేక తోఁటభూమియా, నీటిపాఱుదల గలదిగా నున్న పక్షములో రెండు పంటలా ఒక పంటయా;

(*e*) రెకార్డు తయారు చేయఁబడుచుండు కాలమందు చట్టపు సమ్మతముగా చెల్లింపనగు పన్ను, మఱియును 30 వ సెక్షను (i) వ క్లాజు (*a*) నిబంధనవలని లాభమునకు రయితు హక్కుగలిగి యున్నాఁడా;

(*f*) ఆ పన్ను ఎట్లు నిర్ణయింపఁబడినది; డిక్రీనిబట్టియా, లేక యీ యాక్టుయొక్క నిబంధనల ననుసరించియా, లేక యితర విధముగనా;

(*g*) ఆ యధీభూమికి చట్టపు సమ్మతముగా ఉన్నట్టి యేవయిన హక్కులు;

(*h*) పన్ను క్రమముగా హెచ్చునట్టిదయినయెడల, అది యే కాలములలో హెచ్చునో అట్టి కాలములు, ఏ మొత్తములుగా హెచ్చునో అవియును;

(*i*) ఆ భూమిని పన్ను లేకయే పెట్టుకొనియున్నట్లు చెప్పఁబడు నెడల, పన్ను వాస్తవముగా చెల్లింపఁబడుచున్నదా లేదా; పన్ను చెల్లింపఁబడనియెడల, అనుభవదారుఁడు ఆ భూమిని అట్టి పన్ను చెల్లింపకయే ఉంచుకొనుటకు హక్కుగలిగి యున్నాఁడా; అట్లు హక్కుగలిగి యున్నయెడల, ఏ యధికారముమీఁద; ఆ భూమిపన్ను ఇయ్యవలసినదిగ నుండినయెడల, చెల్లింపవలసిన పన్ను;

### (j) 164 వ సెక్షను (3) వ సబ్ సెక్షను ననుసరించి ఉత్తరువు చేయఁబడిన నీటిపాఱుకల హక్కుల రెకార్డు.

మొదటి రెకార్డును ప్రకటించుటయు దానినిగుఱించి ఆక్షేపణలను గ్రహించుటయు.

166. (1) హక్కుల రెకార్డును తయారుచేయు ఆఫీసరు, తనకు యుక్తమని తోఁచు విచారణను జరిగించి, యెస్టేటుకు లేక యెస్టేటుభాగమునకు మొదటి రెకార్డును పూర్తిచేసిన మీఁదట, అతఁడు దాని మసోదాను, నిర్ణయింపఁబడిన ప్రకారముగాను, నిర్ణయింపఁబడిన కాలమువఱకును ప్రకటించి అందులో దాఖలయినట్టి యే పద్దునుగుఱించియైనను లేక దాఖలు కాకుండ విడిచి వేయఁబడిన యే పద్దునుగుఱించియైనను సదరు ప్రకటన జరుగుచుండు కాలములో చేయఁబడునట్టి యెదయిన ఆక్షేపణను గ్రహించి ఆలోచింపవలయును.

కడపటి రెకార్డును ప్రకటించుట.

(2) అట్టి ఆక్షేపణలు లోకల్ గవర్నమెంటువారు నిర్ణయించెడి విధులనుబట్టి ఆలోచింపఁబడి పరిష్కరింపఁబడినమీఁదట, పైని చెప్పఁబడిన ఆఫీసరు ఆ రెకార్డును ఆఖరుగా తయారుచేసి, నిర్ణయింపఁబడిన విధమున సదరు ప్రదేశములో ప్రకటింపఁజేయవలయును; మఱియు ఆ ప్రకటన యయినది, ఆ రెకార్డు ఈ యధ్యాయమునుబట్టి క్రమముగా చేయఁబడిన దనుటను గుఱించి పరిష్కారమైన సాక్ష్యమై యుండును.

(3) ప్రత్యేకమయిన మసోదాను, లేక కడపటి రెకార్డ్లను, ఎస్టేటుయొక్క వేఱు వేఱు భాగములకు ఈ సెక్షనునుబట్టి ప్రకటింపవచ్చును.

హక్కుల రెకార్డుయొక్క కడపటిప్రకటనను గుఱించియు, అది సరియైన దనుటను గుఱించియు ఊహ.

167. (1) ఈ యధ్యాయము ననుసరించి తయారు చేయఁబడి ప్రకటింపఁబడిన హక్కుల రెకార్డులేక క్రమముగా సర్టిఫై చేయఁబడిన దాని నకలు లేక దానినుండి ఎక్స్ట్రాక్టు ఏ వ్యాజ్యెములో లేక యితరచర్యలో దాఖలు చేయఁబడుచున్నదో అట్టి యే వ్యాజ్యెములోఁగాని లేక చర్యలోఁగాని, అట్టి హక్కుల రెకార్డు, (ఆఖరుగా ప్రకటింపఁబడ) లేదని స్పష్టముగా వాదింపఁబడిననే తప్ప, ఆఖరుగా ప్రకటింపఁబడినదిగానె ఊహింపఁబడును; మఱియును ఈ యధ్యాయము ననుసరించి ఒక హక్కుల రెకార్డు ఆఖరుగా ప్రకటింపఁబడినదని చెప్పునట్టి ఆ హక్కుల రెకార్డు ఏ యెస్టేటుకు లేక యెస్టేటులోని భాగమునకు సంబంధించునో అట్టి యెస్టేటు లేక యెస్టేటులోని భాగము మొత్తముగాఁగాని లేక భాగములుగాఁ గాని ఏ డిస్ట్రిక్టులో నున్నవో అట్టి డిస్ట్రిక్టు యొక్క రెవిన్యూ ఆఫీసరుచేఁగాని లేక కలెక్టరుచేఁగాని చేవ్రాలు చేయఁబడిన సర్టిఫికేటు అట్టి ప్రకటనమునకు పరిష్కారమైన సాక్ష్యముగా నుండును.

(2) లోకల్ గవర్న్మెంటువారు ప్రకటనద్వారా, ఏ యెస్టేటు విషయములోనయినను లేక ఒక యెస్టేటులో ఏ భాగము విషయములోనయినను, దానిలో చేరియుండు ప్రతి గ్రామమునకుఁగాను ఒక హక్కుల రెకార్డు ఆఖరుగా ప్రకటింపఁబడినదని ప్రకటింపవచ్చును.

(3) అట్లు ప్రకటింపఁబడినట్టి ఒక హక్కుల రెకార్డులో నుండెడి ప్రతి పద్దును అట్టి పద్దులో సూచింపఁబడిన విషయమునకు సాక్ష్యముగా నుండును; మఱియును అది సరియైనదిగా నుండ లేదని రుజువు అగునంతవఱకును, సరియైనదిగానె ఊహింపఁబడును.

పన్నులయొక్క (సెటిల్మెంటు) నిర్ణయము.

168. (1) 166 వ సెక్షను (2) ఎ సబ్ సెక్షనునుబట్టి హక్కుల రెకార్డుయొక్క ఆఖరు ప్రకటనతేది లగాయతు రెండుమాసములలోఁగా, భూస్వామిగాని లేక రైతులుగాని, (రయితులయిన పక్షమున, గ్రామములోని అధీనభూముల కుల్లు విస్తీర్ణములో నాలవ వంతునకు తక్కువలేని భూమిని అధీనమందుఁ గల రైతులు.) పన్ను (సెటిల్మెంటు) నిర్ణయమునకుఁగాను దరఖాస్తు దాఖలు చేసినయెడల, రెవిన్యూ ఆఫీసరు, లోకల్ గవర్నమెంటువారు అట్లు ఆజ్ఞాపించినయెడల, ఆ భూమి విషయమై ఒక యుక్తమయినట్టియు న్యాయమయినట్టియు పన్నును (సెటిల్) నిర్ణయింపవలయును.

వివరణము.—ఒక భూస్వామి, తన యెస్టేటుగాని, లేక యెస్టేటులోని భాగముగాని హంగామీగా కవులుకు ఇచ్చియున్నప్పటికిని, పన్ను (సెటిల్మెంటు) నిర్ణయమునకుఁగాను దరఖాస్తు చేయవచ్చును.

(2) ఈ సెక్షనునుబట్టి పన్నులను నిర్ణయించుటలో, ఆ యాఫీసరు, విరుద్ధముగా రుజువు అగునంతవఱకు, ప్రస్తుత ముండునట్టి పన్ను లేక పన్ను రేటు యుక్తమయినదనియు న్యాయమైనదనియు ఊహింపవలయును; మఱియును ఒక రయితు చెల్లింపవలసియున్న పన్ను యొక్క రేట్లను నిశ్చయించుటకుఁ ఈ యాక్టులో నున్నట్టి నిబంధనలను గమనింపవలయును.

(3) రెవిన్యూ ఆఫీసరు, ఈ సెక్షను ననుసరించినట్టి యే సంగతిలోనైనను, తనకు యుక్తమనియు న్యాయమనియు తోఁచునట్టి పన్నునుగాని పన్ను రేటునుగాని పార్టీలకు తెలుపవచ్చును; మఱియు అట్లు తెలుపఁబడిన పన్నును పార్టీలు వాచాగాని వ్రాఁతమూలముగాఁ గాని అంగీకరించినయెడల, అది యుక్తమైనట్టియు న్యాయమైనట్టియు

పన్నుగా రెకార్డు చేయఁబడవచ్చును; అంతట అది ఈ యాక్టు ననుస రించి క్రమముగా తీర్మానింపఁబడినట్లు ఎన్నఁబడును.

(4) పార్టీలు పన్ను మొత్తమునుగుఱించి రాజీవడిగాని వేఱు విధముగాఁ గాని తమలో తాము సమ్మతించినపుడు, అట్లు సమ్మతించిన మొత్తము యుక్తమైనదనియు న్యాయమైనదనియు రెవిన్యూ ఆఫీసరు తృప్తిపర్చుకోవలెను; మఱియు అట్లు తృప్తిపర్చుకొన్న యెడల, అతఁడు, ఆలాగు సమ్మతింపఁబడిన మొత్తమును యుక్తమైనట్టియు న్యాయమై నట్టియు పన్నుగా రెకార్డుచేయవలయునుగాని లేనియెడల అట్లు రెకార్డు చేయఁగూడదు. అట్లు తృప్తిపడనియెడల, అతఁడు (2), (3) సబ్ సెక్షను లలో నిబంధింపఁబడి యుండు ప్రకారము యుక్తమయినట్టియు న్యాయ మయినట్టియు పన్నును తానే (సెటిల్) నిర్ణయింపవలయును.

సెటిల్ మెంటు రెకార్డును ముందుగా ప్రకటించుటయును సవరించుటయును.

169. (1) 168 వ సెక్షను ననుసరించి సెటిల్ మెంటు పూర్తి చేయఁబడి నపుడు, దానిలో భూస్వామి యొక్కయు రయితులయొక్కయు పేరును, అధీనభూమియొక్క విస్తీర్ణమును, లోకల్ గవర్న్మెంటువారు ఆజ్ఞాపించునట్టి యితర వివరములును, దానికిఁగాను సెటిల్ చేయఁబడిన పన్ను మొత్తమును, చూపుచు రెవిన్యూ ఆఫీసరు దానిని రెకార్డు చేయించి దాని నక లొకటిని నిర్ణయింపఁబడిన విధముగాను నిర్ణయింపఁబడిన కాలమువఱ కును ప్రకటింపించి, అట్టి రెకార్డులోని యే దాఖలానుగుఱించియయి నను దానిలో వదలిపెట్టఁబడిన యే యంశమునుగుఱించియయినను ప్రకటన కాలములో చేయఁబడు ఏ యాక్షేపములనయినను అంగీకరించి యోచించి అట్టి యాక్షేపములను లోకల్ గవర్న్మెంటువారు నిర్ణయిం చెడి విధులప్రకారము పరిష్కరింపవలయును.

(2) రెవిన్యూ ఆఫీసరు తనంతటఁగాని పక్షపడినట్టి యే పార్టీ అయినను దరఖాస్తు చేసికొన్నమీఁదటఁగాని, 170 వ సెక్షను ననుసరించి సెటిల్‌మెంటు రెకార్డు ఖాయపఱిచెడి అధికారికి పంపఁబడుటకు పూర్వ మెప్పుడైనను, అందు దాఖలైయుండునట్టి యే పన్నునుగాని సవరింపవచ్చును.

అయినను, సంబంధించిన పార్టీలు హాజరగుటకు ఆ విషయములు గుఱించి విచారింపఁబడుటకును వారికి న్యాయమయిన నోటీసు ఇచ్చునంతవఱకును అట్టి దాఖలా యేదియు సవరింపఁబడఁగూడదు.

సెటిల్‌మెంటు రెకార్డును ఆఖరుగా సవరించుటయు, దానిని మక్కాల రెకార్డులో ఐక్యపఱచుటయు.

170. (1) ఆక్షేపములన్నియు 169 వ సెక్షను ననుసరించి పరిష్కరింపఁబడిన మీఁదట రెవిన్యూ ఆఫీసరు సదరు సెటిల్‌మెంటు రెకార్డును, తన సలహాలకుఁ గల ఆధారములను తెలిపెడి పూర్ణమయిన యొక వివరణముతోఁగూడను తనకు ఆక్షేపములు ఏ వయిన వచ్చియున్న యెడల వాని సంగ్రహముతోఁ గూడను, లోకల్ గవర్నమెంటువారిచే నేమింపఁబడిన ఖాయపఱిచెడి అధికారికి పంపవలయును.

(2) సదరు ఖాయపఱిచెడి అధికారి ఆ సెటిల్‌మెంటును సవరించియైనను సవరించకుండనైనను మంజూరు చేయవచ్చును, లేక సవరణకొఱకు దానిని వాపసు చేయనైన చేయవచ్చును :

అయినను, సంబంధించిన పార్టీలు హాజరగుటకును ఆ విషయమును గుఱించి విచారింపఁబడుటకును వారికి న్యాయమయిన నోటీసు ఇచ్చునంతవఱకును దాఖలా యేదియు సవరింపఁబడఁగూడదు, లేక వదలిపెట్టఁబడిన అంశమేదియు భర్తీచేయఁబడఁగూడదు.

(3) ఖాయపఱిచెడి అధికారి సెటిల్ మెంటు రెకార్డును మంజూరుచేసిన తర్వాత దానిని, 166 వ సెక్షనుయొక్క (2) వ సబ్ సెక్షను ననుసరించి ప్రకటింపఁబడినట్టి హక్కుల రెకార్డులో ఐక్యపఱుపవలయును; అట్లు సవరింపఁబడి నట్లుండెడు హక్కుల రెకార్డును నిర్ణయింపఁబడిన విధమున ఆఖరుగా మరల ప్రకటింపవలయును; మఱియు అట్టి ప్రకటన యైనది, సదరు రెకార్డు క్రమముగా చేయఁబడిన దనుటకు ముగింపైన సాక్ష్యముగా నుండును.

రెవిన్యూ పైయధికారికి అపీలును, అతఁడు సవరించుట యును.

171. 169 వ సెక్షను ననుసరించి చేయఁబడునట్టి యే యాక్షేపణమీఁద నయిన రెవిన్యూ ఆఫీసరు జారీచేసెడు ప్రతి హుకుముమీఁదను, అపీలు చేయఁబడు హుకుము తారీఖునుండి రెండు నెలలలోఁగా అపీలు దాఖలుచేసినయెడల అట్లు అపీలు చేసికోవచ్చును; మఱియు అట్టి అపీలు, లోకల్ గవర్న్మెంటువారు విధిమూలముగా నిర్ణయించునట్టి రెవిన్యూ పై యధికార్లకుఁగాని యిందువిషయమై లోకల్ గవర్న్మెంటువారివలన ప్రత్యేకముగా అధికార మీయఁబడెడు ఆఫీసరునకుఁగాను చేసికొనవలయును.

రెవిన్యూబోర్డువారికి సవరింపఁబడుట.

172. రెవిన్యూ బోర్డువారు, ఏ సంగతిలోనైన దరఖాస్తు చేయఁబడిన మీఁదటఁగాని తమంతట తామేగాని ఏహక్కుల రెగార్డునైనను లేక ఒక హక్కుల రెకార్డుయొక్క ఏదేని భాగమునైనను, 166వ సెక్షనుయొక్క (2) వ సబ్ సెక్షను ననుసరించి ఆఖరుగా ప్రకటింపఁబడిన తేదినుండి రెండు సంవత్సరములకు లోపలఁగాని లేక 168 వ సెక్షను ననుసరించి పన్ను సెటిల్ మెంటు అయ్యున్నయెడల 170 వ సెక్షనుయొక్క (3) వ సబ్ సెక్షను ననుసరించి మరల ప్రకటనయైన

తేదినుండి రెండు సంవత్సరములకు లోపలగాని. ఎప్పుడయినను, 173 వ సెక్షను ననుసరించి యొక సివిల్ కోర్టువారు జారీచేసిన యే సాక్షము నైనను బాధించునట్లుగా తప్ప వేఱువిధముగా సవరించునట్లు, ఆజ్ఞాపింప వచ్చును.

అయినను, సంబంధించిన పార్టీలు హాజరగుటకును ఆ విషయమునుగుఱించి విచారింపఁబడుటకును వారికి న్యాయమైన తరుణము ఇచ్చునంతవఱకును అట్టి ఆజ్ఞయేదియు చేయఁగూడదు.

సెటిల్‌మెంట్ రెకార్డులోని దాఖలాలు సివిల్ వ్యాజ్యము ద్వారా ఎప్పుడు ఆక్షేపణార్హముగ నుండును.

173. (1) 168 మొదలు 171 వఱకు నుండెడు సెక్షన్ల ననుసరించి తయారు చేయఁబడినట్టియు 170 వ సెక్షనుయొక్క 3 వ సబ్ సెక్షను ననుసరించి ఆఖరుగా ప్రకటింపఁబడిన హక్కుల రెకార్డులో ఐక్యపఱుపఁబడినట్టియు సెటిల్‌మెంటు రెకార్డులోని యేదేని దాఖలావలనఁగాని, లేక పన్నును సెటిల్‌చేయక పోవుటవలనఁగాని, అతృప్తిజెందెడి యే మనుష్యుఁడయినను, సదరు దాఖలా దేనికి సంబంధించియున్నదో లేక అట్లు చేయకపోవడము దేనివిషయములో జరుగుచున్నదో ఆభూమిని స్వాధీనపఱుచుకొనుటకుఁగానైనట్టి వ్యాజ్యమును పట్టుటకు అధికారముగల సివిల్‌కోర్టులో ఒక వ్యాజ్యము తేవచ్చును.

(2) అట్టి వ్యాజ్యమును, 170 వ సెక్షనుయొక్క (3) వ సబ్ సెక్షను ననుసరించి హక్కుల రెకార్డు ఆఖరుగా ప్రకటింపఁబడిన తేదినుండి ఆఱు నెలలలోఁగాని. లేక 171 వ సెక్షను ననుసరించి రెవిన్యూ అధికారికి అపీలుచేసికొని యున్నయెడల, అట్టి సంగతిలో అపీలు పరిష్కరింపఁబడిన తేదినుండి ఆఱు నెలలలోఁగాని, దాఖలు చేయవలయును.

(3) అట్టి వ్యాజ్యెమును ఈక్రింది హేతువులలో దేనినిబట్టి యయినను దాఖలు చేయవచ్చునుగాని వేఱె యే హేతువులనుబట్టియు దాఖలు చేయఁగూడదు, అవి యేవనగా:—

(a) భూస్వామి, రయితు, అను సంబంధము ఉన్నది, లేక లేదు;

(b) ఆ భూమి పన్ను చెల్లింపఁబడఁగినది కాదు;

(c) ఆ భూమి పన్ను మాఫీగా అనుభవింపఁబడుచున్నట్లు హక్కుల రెకార్డులో దాఖలై యున్నను, అది పన్ను చెల్లింపఁదగినదేను;

(d) 165 వ సెక్షనుయొక్క (d), (e), (j) క్లాజుల ననుసరించి చేయఁబడిన యే దాఖలాయైనను సరియయినదిగాదు;

(e) అనుకూలమయిన రేటు చొప్పున అనుభవించు విషయమైయున్న ప్రత్యేకపు షరతులు తప్పుగా రెకార్డు చేయఁబడినవి లేక వదలిపెట్టఁబడినవి;

(f) రెవిన్యూ ఆఫీసరు, 177 వ సెక్షనుయొక్క నిబంధనల ననుసరించి సెటిల్ చేయఁబడినట్టి పన్ను ఏ తేది నుండి అములులోనికి రావలయునో ఆ తేదినితప్పుగా నిర్ణయించినాఁడు.

ఆలోచన సభలోని ఇండియా స్టేటు సెక్రెటరిగారిని అట్టి యే వ్యాజ్యెములోనైనను ప్రతివాదిగా చేయఁగూడదు.

(4) పన్నుకు సంబంధించిన దాఖలా సరియైనదికాదని కోర్టు వారికి కనుపడినయెడల, వారు (3) వ సబ్ సెక్షనులో ఉదాహరింపఁబడిన (a), (b) సంగతులలో, పన్ను ఏదియు చెల్లింపవలసినదిలేదని తీర్మా

నింపవలయును, లేక కలెక్టరు క్రమమైనట్టియు న్యాయమైనట్టియు పన్నును నిర్ణయింపవలెనని ఆజ్ఞాపింపవలయును; (c) సంగతిలో, వారు సదరు భూమి పన్ను చెల్లింపనక్కరలేదని తీర్మానింపవలయును; (d), (e) సంగతులలో, వారు దాఖలా పన్నానిదిగా నుండవలెనని తీర్మానింపవలయును; మఱియు (f) సంగతిలో, సెటిల్ చేసిన పన్ను ఏ తేదినుండి అములులోనికి రావలయునో ఆ తేదిని వారు తీర్మానింపవలయును.

(5) సివిల్ కోర్టువారు ఈ సెక్షను ననుసరించి ఆఖరు హుకుములుగాని లేక యొక డిక్రీగాని జారీచేసినప్పుడు, వారు వానిని ఆ డిస్ట్రిక్టు కలెక్టరునకు ఎఱుక చేయవలయును.

174. 171 వ సెక్షను ననుసరించి అపీలుమీఁద చేయఁబడు యావత్తు తీర్పులను గుఱించియును, 173 వ సెక్షను (5) వ సబ్ సెక్షను ననుసరించి కలెక్టరుకు నోటిఫై చేయఁబడిన సివిల్ కోర్టుల యావత్తు ఉత్తరువులను లేక డిక్రీలను గుఱించియును, ఒక మరాను 170 వ సెక్షను ననుసరించి సెటిల్మెంటు రెకార్డు ఏ హక్కుల రెకార్డుతోడ ఐక్యపఱుపఁబడినదో ఆ హక్కుల రెకార్డులో వ్రాయవలయును; మఱియు అట్టి మరా సదరు రెకార్డు తాలూకు నొక భాగముగా నెన్నఁబడును.

171, 173 వ సెక్షన్ల ననుసరించిన తీర్పులను గుఱించిన మరాను హక్కుల రెకార్డులో వ్రాయుట.

175. (1) ఈ విషయమై లోకల్ గవర్నమెంటువారివలన అందుకని అధికార మియ్యఁబడిన యే రెవిన్యూ ఆఫీసరుగాని, 168 వ సెక్షను లేక 169 వ సెక్షను ననుసరించిన యే యుత్తరువుయొక్కగాని లేక తీర్పుయొక్కగాని తేదినుండి పండ్రెండు నెలల లోఁగా, దరఖాస్తు పెట్టుకోఁబడినమీఁదటఁగాని లేక స్వతహాఁగాఁగాని, యథార్థముగా చేసిన యే పొరపాటునుగాని, సదరు పొరపాటు తనచేఁ జేయఁబడి

సెటిల్మెంటులోని పొరపాట్లను రెవిన్యూఆఫీసరు సవరించుట.

నను, లేక తనకంటె పై గ్రేడులోనుండని వేఱె యే రెవిన్యూ ఆఫీసరుచే చేయఁబడినను, సవరింపవచ్చును, కాని 171 వ సెక్షనును లేక 173 వ సెక్షనును అనుసరించి చేయఁబడిన ఉత్తరువు లేక డిక్రీ దేనినిగాని బాధించునట్లుగా సవరింపఁగూడదు :

అయినను, 171 వ, 173 వ లేక 179 వ సెక్షన్ల ననుసరించి అట్టి యుత్తరువుమీఁద లేక తీర్పుమీఁద అప్పీలు జరుగుచుండునెడల లేక తీర్మానింపఁబడినయెడల, లేక సంబంధించిన పార్టీలు హాజరగుట కును ఆ విషయమునుగుఱించి విచారింపఁబడుటకును వారికి న్యాయ మైన తరుణము ఇచ్చునంతవఱకు. అట్టి యుత్తరువు లేక తీర్పు దేనిని గాని అట్లు సవరింపఁగూడదు.

హక్కుల రెకార్డులో పొర పాట్లను సవరించుట.

(2) ఈ విషయమై లోకల్ గవర్న్మెంటువారివలన అందు కని అధికార మియ్యఁబడిన యే రెవిన్యూ ఆఫీసరుగాని, 166 వ సెక్షను (2) వ సబ్ సెక్షను ననుసరించి హక్కుల రెకార్డు ఆఖ యిరుగా ప్రకటింపఁబడినదని తెలుపు సర్టిఫికేటుయొక్క తేదినుండి పం డ్రెండు నెలల లోఁగా దరఖాస్తు పెట్టుకోఁబడిన మీఁదటఁగాని లేక స్వతహాఁగాఁగాని, యథార్థముగాఁ జేసిన ఒక పొరపాటువలన నమూద్దు చేయఁబడినదని తనకు తృప్తికరముగా తెలియవచ్చు అట్టి హక్కుల రెకార్డు లోని యే పద్దునుగాని సవరింపవచ్చును.

అయినను, 171 వ, 173 వ లేక 179 వ సెక్షన్ల ననుసరించి అట్టి పద్దును బాధించు ఒక అప్పీలు జరుగుచుండినను లేక తీర్మానింపఁ బడినయెడల, లేక సంబంధించిన పార్టీలు హాజరగుటకును ఆ విషయ మును గుఱించి విచారింపఁబడుటకును వారికి న్యాయమైన తరుణము నిచ్చునంతవఱకు, అట్టి సవరింపు ఏదియు చేయఁగూడదు.

168 మొదలుకొని 171 వఱకుండు సెక్షనుల ననుసరించి (సెటిల్ డు) నిర్ణయింపఁబడిన పన్నులుసరియయినవనుటను గుఱించి ఊహ.

176. 173 వ సెక్షను నిబంధనలకు లోఁబడి, 168 నుండి 170 వఱకుండు సెక్షన్ల ననుసరించి నిర్ణయింపఁబడినట్టియు, 166 వ సెక్షను ననుసరించి ఆఖరుగా ప్రకటింపఁబడిన హక్కుల రెకార్డులో నమూదు చేయఁబడినట్టియు, లేక 171 వ సెక్షను ననుసరించి నిర్ణయింపఁబడినట్టియు పన్నులన్నియు సరిగా నిర్ణయింపఁబడినట్లును, ఈ యాక్టు యొక్క తాత్పర్యములో యుక్తమైనట్టి న్యాయమైనట్టి పన్నుగా నున్నట్లును, యెన్నవలయును.

పన్నుయొక్క (సెటిల్మెంటు) నిర్ణయము ఎప్పటినుండిఅమలులోనికి వచ్చునదియు హెచ్చింపనగు కాలమునకు పరిమితియు.

177. ఈ యధ్యాయమునుబట్టి రేఁదయిన పన్ను నిర్ణయింపఁబడినపుడు, ఆ పన్నును నిర్ణయించు ఆఖరు ఉత్తరువుయొక్క లేక తీర్పుయొక్క తేదికి వెనువెంటనే వచ్చు రెవిన్యూ సంవత్సరము ప్రారంభమునుండి ఆ నిర్ణయము అములులోనికి వచ్చును; అంతట దానిని, 30 వ సెక్షనుయొక్క (2), (3) క్లాజులలో నిర్ణయింపఁబడిన కారణములనుబట్టి లేక అధీనభూమియొక్క విస్తీర్ణము వెనుకమాఱిన కారణమునుబట్టి తప్ప, అటుపిమ్మట ఇరువది సంవత్సరముల కాలమువఱకు హెచ్చింపఁగూడదు; మఱియు అధీనభూమియొక్క విస్తీర్ణము మాఱిన కారణముఁబట్టి లేక 38 వ సెక్షను (1) టి సబ్ సెక్షను (a), (b) క్లాజులలో ఉదాహరింపఁబడిన కారణమునుబట్టి తప్ప, సదరు కాలములోఁగా దాని తగ్గింపఁగూడదు.

హక్కుల రకార్డును తయారు చేయుచుండఁగా చర్యలను నిలిపిపెట్టుట.

178. (1) 168 వ సెక్షనునుబట్టి ఒక దరఖాస్తు చేసికొన్నప్పుడు, 170 వ సెక్షను (3) వ సబ్ సెక్షను ననుసరించి హక్కుల రెకార్డును ఆఖరుగా ప్రకటించిన తర్వాతనే తప్ప, 30, 38, 40 వ సెక్షన్ల ననుసరించి యే సివిల్ లేక రెవిన్యూ

కోర్టులోఁగాని ఏ వ్యాజ్యమునైనను లేక చర్యనైనను ప్రారంభింపఁ గూడదు లేక జరపఁగూడదు.

(2) హక్కుల రెకార్డును తయారుచేయుటకు ఆజ్ఞాపించుచు 164 వ సెక్షను ననుసరించి ఉత్తరువు చేయఁబడిన... హక్కుల రెకార్డు ప్రయోగపడు ప్రదేశములో పన్నునుమార్చుటకు ఏ వ్యాజ్యము నయినను లేక దరఖాస్తునయినను, అట్టి హక్కుల రెకార్డును ఆఖరుగా ప్రకటించిన తర్వాతనే తప్ప, ఏ సివిల్ కోర్టువారుగాని లేక రెవిన్యూ కోర్టువారుగాని అంగీకరింపఁగూడదు లేక జరపఁగూడదు.

హక్కుల రెకార్డుతో సంబంధించిన, పన్ను కానట్టి యితర విషయములలో సివిల్ కోర్టుల విచారణాధికారమునకు పరిమితి.

179. ఈ యధ్యాయము ననుసరించి హక్కుల రెకార్డును తయారుచేయుటకు ఆజ్ఞాపించెడి యే యుత్తరువు విషయములోఁగాని, లేక అట్టి రెకార్డును లేక దానిలో నే భాగమైనను సిద్ధము చేయుట, ప్రకటించుట, అందులో సంతకముచేయుట లేక సాక్షుల చేవ్రాలు తీసికొనుట,—వీని విషయములోఁగాని, లేక 173 వ సెక్షనులో నిబంధించియుండునట్లు తప్ప, 168 మొదలుకొని 172 వఱకుండు సెక్షన్ల ననుసరించి నిర్ణయింపఁబడిన పన్నునుగుఱించి అట్టి రెకార్డులో ఏ నమూదునైనను మార్చుటకుఁగాని, ఏ సివిల్ కోర్టులోనైనను వ్యాజ్యము తేఁగూడదు.

అయినను, ఒక మనుష్యుఁడు అనుభవించుచుండు నొక హక్కుతో సంబంధించినట్టియు, 164 వ సెక్షను (1) టి సబ్ సెక్షను ననుసరించి చేయఁబడిన ఉత్తరువునకు అనుగుణముగా సిద్ధముచేయఁబడిన హక్కుల రెకార్డులోని యేదైన నమూదువలన లేక లోపమువలన అతఁడు అతృప్తి చెందినయెడల, అతఁడు 1877 వ సంవత్సరపు 1 వ స్పెసిఫిక్ రిలీఫ్ ఆక్టు (నిర్దిష్ట పరిహార శాసనము) యొక్క 6 వ అధ్యాయము ననుసరించి తన హక్కును సిద్ధాంతపర్చుటకొఱకు వ్యాజ్యమును దాఖలు చేయవచ్చును.

180. (1) ఈ యధ్యాయమునుబట్టి ఒక హక్కుల రెకార్డును తయారుచేయుటకు ఆజ్ఞాపింపఁబడి నప్పుడు లేక చేయుటకు ప్రారంభించినప్పుడు, ఏ యెస్టేటులోనైనను అందలి భాగములోనయినను ఈ యధ్యాయముయొక్క నిబంధనలను అమలు జరుపుటలో గవర్నమెంటువారికి తగిలిన కర్చులను, లేక ఆ కర్చులలో లోకల్ గవర్నమెంటు వారు ఉత్తరువుచేయునట్టి భాగమును, అట్టి యెస్టేటులోని లేక యెస్టేటు భాగములోని భూస్వామియును, రైతులును, అట్టి యెస్టేటులోని ఏ భూమినైన హక్కుల రెకార్డులో చేర్చియుండినయెడల అట్టి భూమిని అనుకూలమైన షరతులమీఁద పెట్టుకొనియుండువారును, సంగతి సందర్భముల నన్నిటిని యోచించి లోకల్ గవర్నమెంటువారు నిర్ణయించునట్టి దామాషాలప్రకారము అచ్చుకోవలయును; మఱియు ఏ మనుష్యునిచేనైన అట్లు అచ్చుకోఁబడవలసిన సదరు కర్చుల దామాషా అయినది, భూమిశిస్తుగా భావింపఁబడి భూమిశిస్తు బాకీగా నున్న నెట్లో అట్లే ఆయాసంగతికి తగినట్లు 1864 వ సంవత్సరపు 2 వ మదరాసు రెవిన్యూ రికవరి ఆక్టుయొక్క లేక 1867 వ సంవత్సరపు 6 వ మదరాసు షహరు లాండ్ రెవిన్యూ (సవరణ) ఆక్టుయొక్క నిబంధనల ననుసరించి రాఁబట్టుకోఁదగియుండును.

ఈ యధ్యాయము క్రింద వచ్చు వర్చుల కర్చులు.

(2) భూస్వాములకును రయితులకును పంచిపెట్టుటకుఁగాను ఈ యధ్యాయమునుబట్టి తయారుచేయఁబడిన సర్వే మాపులయొక్కయు హక్కుల రెకార్డుయొక్కయు నకళ్లను తయారుచేయుటకు తగులుకర్చును, ఈ యధ్యాయముయొక్క నిబంధనలను నెఱవేర్చుటలో తగిలిన కర్చులో నొక భాగముగా యెన్నవలెను.

## 12 వ అధ్యాయము.

### భూస్వామియొక్క సొంతభూమి.

భూస్వామియొక్క సొంత భూమినిగుఱించి మినహాయింపు.

181. 6, 8, 10, 11, 12, 19, 46 ఈ సెక్షన్లలోని దేదియు, భూస్వామియొక్క సొంత భూమిలో అనుభవపు హక్కును కలుగఁజేయదు, మఱియు అది సదరుభూమికి ఏ విధమునను ప్రయోగపడదు.

అయినను, ఒక భూస్వామి తన సొంతభూమిని రయితీ భూమిగా మార్చుటకు ఈ సెక్షనులో నుండునది యేదిగాని అతనిని ఆటంకపెట్టదు.

భూస్వామియొక్క సొంత భూమిని సర్వేచేయునట్లును రికార్డును తయారుచేయునట్లును ఉత్తరువు చేయుటకు అధికారము.

182. ఒక నిర్దిష్టమైయున ప్రదేశములో నున్నట్టి భూస్వామియొక్క సొంతభూమినంతయును సర్వేచేసి రెకార్డు చేయఁగలందులకు లోకల్ గవర్నమెంటువారు ఒక రెవిన్యూ ఆఫీసరునకు ఆజ్ఞాపించుచు, హుకుము చేయవచ్చును.

ఏ సివిల్ లేక రెవిన్యూ కోర్టులోఁగాని యీ సెక్షను ననుసరించిన ఉత్తరువును ఆక్షేపింపఁగూడదు.

భూస్వామిగాని అనుభవదారుఁడుగాని దరఖాస్తు చేసికొనిన మీఁదట సొంతభూమిని రెకార్డు చేయుటకు అధికారము.

183. (1) భూస్వామియొక్క సొంతభూమి యని చెప్పఁబడిన యే భూమి విషయములో నయినను, భూస్వామిగాని యే అనుభవదారుఁడైనఁగాని దరఖాస్తు చేసికొనిన మీఁదటను, కర్చులకుఁగాను కావలసిన మొత్తమును అతఁడు డిపాసిటు చేసినమీఁదటను, ఒక రెవిన్యూ ఆఫీసరు, ఈ విషయమయి లోకల్ గవర్నమెంటువారిచే చేయఁబడిన విధులకు లోఁబడి, ఆ భూమి భూస్వామియొక్క సొంత భూమియైనదియు కానిదియు కనుఁగొని రెకార్డు చేయవచ్చును.

(2) ఏ యొడంబడికలోఁగాని రాజీలోఁగాని, లేక కుట్ర వలననైనను మోసమువలననైనను పొందఁబడినట్లు ఒక రెవిన్యూ ఆఫీసరునకు తృప్తికరముగా ఋజువయినట్టి యే డిక్రీలోఁగాని ఏమి చెప్పియున్నను సరే, అట్టి రెవిన్యూ ఆఫీసరు, ఏ భూమియైనను 185 వ సెక్షనులో వివరింపఁబడియుండు స్వభావముగల తృప్తికరమయినట్టి సాక్ష్యము వలన భూస్వామియొక్క సొంత భూమిగా నున్నట్లు ఋజువుచేయఁబడిననే తప్ప దానిని అట్టిభూమిగా రెకార్డు చేయఁగూడదు.

సొంతభూమిని రెకార్డుచేయుటకు చర్య.

184. 182 వ సెక్షనును బట్టియైనను 183 వ సెక్షనునుబట్టియైనను ఒక రెవిన్యూ ఆఫీసరు పనిచేయునప్పుడు, 166, 167, 179, 180 సెక్షన్లయొక్క నిబంధనలు కూడినంతవఱకు ప్రయోగపడును.

భూస్వామియొక్క సొంత భూమిని నిశ్చయించుటకైన విధులు.

185. ఏ వ్యాజ్యములోఁగాని లేక చర్యలోఁగాని యే భూమియైన భూస్వామియొక్క సొంత భూమియా యను సంగతిని నిశ్చయింపవలసినది అవశ్యకమైనపుడు, ప్రదేశపు మామూలును, 1898 వ సంవత్సరము జూలై నెల 1 టీ తేదికి పూర్వము ఆ భూమి అతని సొంతభూమిగా నిర్దేశింపఁబడి గుత్తకు ఇయ్యఁబడినదా యను సంశయమును, హాజరుపఱుపఁబడు మఱి యేదయిన సాక్ష్యమును, యోచింపవలయును; కాని ఆ భూమి భూస్వామియొక్క సొంతభూమి యని ఋజువు చేయఁబడువఱకును అది యట్టిది కాదని అనుకోవలయును. అయినను, ఈ యాక్టు ప్రారంభమగుటకు పూర్వము అవ్యవహితముగా పండ్రెండు సంవత్సరములవఱకు భూస్వామియే తన సొంతమైన లేక అద్దెకు పుచ్చుకోఁబడిన పశ్వాదులతో తన సొంత

నవుకర్ల చేగాని కూలివాండ్ర చేఁగాని సొంతభూమిగా సాగుబడి చేసినట్లు ఋజువైన భూమియంతయును భూస్వామియొక్క సొంతభూమిగా ఎన్న వలయును.

---

## 13 వ అధ్యాయము.

### కట్టడములకొఱకును ఇతర కార్యములకొఱకును భూస్వామి భూమిని సంపాదించుట.

కట్టడములకొఱకును ఇతర కార్యములకొఱకును భూస్వామి భూమిని సంపాదించుట.

186. (1) ఒక భూస్వామి దరఖాస్తు పెట్టుకొన్నమీఁదటను,

అతఁడు తన యెస్టేటులోని ఒక యధీనభూమి యావత్తునైనను దానిలో కొంతభాగమునైనను, ఆ యధీనభూమియొక్కగాని, లేక ఆ యెస్టేటుయొక్కగాని మేలునకు సంబంధపడునట్టి న్యాయమై తగినటువంటి యొక యుద్దేశముకొఱకయిగాని (అట్టి యుద్దేశములో నేలను కట్టడపు నేలగా ఉపయోగించుట చేరును,) లేక, మతసంబంధమైన, విద్యాసంబంధమైన, లేక ధర్మార్థమైన యే యుద్దేశముకొఱకైగాని, లేక, గనులను ఏర్పాటుచేసి వానిలో పనులు జరిపించుటకొఱకైగాని, సంపాదించుట కతనికి ఇష్టమున్నదని తృప్తిగా తెలిసినమీఁదటను,

కలెక్టరు సర్టిఫికేటువలన ఆ యుద్దేశము న్యాయమైనదనియు తగినంతటిదనియు తమకు తృప్తిగా తెలియవచ్చినమీఁదటను, అసలు విచారణాధికారము గల ప్రిన్సిపల్ సివిల్ కోర్టువారు, తమకు యుక్తమని తోఁచునట్టి షరతులతో దానిని సంపాదించుటకు భూస్వామికి అధికారమిచ్చి ఆ యధీనభూమి యావత్తునుగాని లేక అట్టి భాగమునుగాని తాము ఎట్టి షరతులను ఒప్పుకొందురో అట్టి షరతులమీఁద (రయితుకు పూర్ణ ప్రతీకారము ఇచ్చెడి షరతుతో సహా) తన హక్కును భూస్వామికి అమ్మమని రయితును సదరు కోర్టువారు కోరవచ్చును.

(2) ప్రతికారద్రవ్యపు మొత్తమును నిర్ణయించుటలో కోర్టు వారు సాధ్యమగునంతవఱకు 1894 వ సంవత్సరపు 1 టి ఆక్టు అయిన భూసంపాదనపు ఆక్టుయొక్క 23, 24 సెక్షనులలోని నిబంధనలను అనుసరించి నడచుకొనవలయును, మఱియు నిర్బంధ సంపాదనమునకయి ప్రతికారముగా నుండుటకు భూస్వామియొక్కయు రయితువలన చేయబడిన అభివృద్ధి పనులయొక్కయు పూరా కిమ్మతుకంటె నెంతకి నడునైదువంతులు జాస్తిగా చేర్చవలయును.

అయినను, గనులను ఏర్పాటుచేసి వానిలో పనులు జరిపించుట కొఱకై ఆ భూమి సంపాదింపబడినయెడల, ఖనిజములవిషయములో ఏ హక్కునైనను రయితు కలిగియుండు పక్షములో, కోర్టువారు అట్టి హక్కుకుగాను ప్రతికారము ఇప్పించవలయును.

---

## 14 వ అధ్యాయము.

### కాంట్రాక్టు కరారు.

కరారును గుఱించి నిర్బంధములు.

187. (1) ఈ యాక్టు జారీ చేయబడుటకు పూర్వమందుగాని తర్వాతగాని భూస్వామియును రయితును చేసికొన్న కరారులో నుండునది యేదియు—

(a) ఈ యాక్టు నిబంధనల ప్రకారముగా అభివృద్ధిపనులు చేయుటకు రయితుకు గల హక్కును తీసివేయదు, లేక మట్టుపఱుపదు ;

(b) 11 వ సెక్షనులో నిబంధించియుండు ప్రకారము భూమిని ఉపయోగించుటకు అనుభవపు హక్కుగల రయితుకుండెడి హక్కును తీసివేయదు లేక మట్టుపఱుపదు ;

(c) 38 వ సెక్షనుయొక్క (1) టి సబ్ సెక్షనులోని, (a), (b) క్లాజులలో లేక 32 వ సెక్షనుయొక్క (2) వ సబ్ సెక్షనులో చెప్పియుండు కారణమును బట్టిగాని లేక, 1908 వ సంవత్సరము జనవరినెల మొదటి తేదికి పూర్వము నిర్దిష్టమైన యొక కాలమునకు చేసికొనఁబడి అములులో నుండెడి గుత్తసంగతిలో తప్ప, 38 వ సెక్షనుయొక్క (1) టి సబ్ సెక్షనులోని (c) క్లాజులో చెప్పియుండు కారణమును బట్టిగాని, పన్ను తగ్గించుటకై దావా తెచ్చుటకు లేక దరఖాస్తు చేసికొనుటకు, అనుభవపు హక్కు గల రయితు కుండెడి హక్కును తీసివేయదు;

(d) 42 వ సెక్షనుయొక్క నిబంధనల ననుసరించి పన్నును మార్చుటకై దరఖాస్తు చేసికొనుటకు, అనుభవపు హక్కుగల రయితు కుండెడి హక్కును తీసివేయదు;

(e) 40 వ సెక్షనునుబట్టి పన్నును రొక్కపు రూపముగా మార్చుటకై దరఖాస్తు చేసికొనుటకు భూస్వామికి లేక అనుభవపు హక్కుగల రైతు కుండెడి హక్కును తీసివేయదు;

(f) 149 వ సెక్షను ననుసరించి తనయొక్క అధీనభూమిని వదలుకొనుటకు అనుభవపు హక్కుగల రైతుకుండెడి హక్కును తీసివేయదు; లేక

(g) ఈ యాక్టుయొక్క నిబంధనలకంటె ఇతర విధముగా, రయితును (ఇజెక్టు) వెడలఁగొట్టుటకు భూస్వామికి అధికారమియ్యదు.

(2) ఈ యాక్టు జారీచేయఁబడిన తర్వాత భూస్వామియును రయితును చేసికొన్న కరారులో నుండునది యేదియును, చెల్లింపవలసిన వడ్డీ మొత్తము హెచ్చునట్లుగా పన్ను బాకీలమీఁద చెల్లింపవలసియుండు వడ్డీకి సంబంధించునట్టి 61 వ సెక్షనుయొక్క నిబంధనలను బాధింపదు.

అనాది బంజరునందు అనుభవపు హక్కును సంపాదించుటను బాధించెడి కరారును గుఱించి నిర్బంధములు.

188. ఈ యాక్టు జారీచేయఁబడుటకు పూర్వముగాని తర్వాతఁగాని భూస్వామియును అనాదిబంజరు తాలూకు రయితును చేసికొను కరారులో నుండునది యేదియు, అట్టి భూమి విషయములో అనుభవపు హక్కు గల రయితుకుండెడి హోదాను సంపాదించుటకు అట్టి రయితుకుఁ గల హక్కును తొలఁగింపదు లేక మట్టుపఱుపదు.

---

## 15 వ అధ్యాయము.

(జూరిస్డిక్షను) విచారణాధికారపు హద్దును, వ్యాజ్యమును.

వ్యాజ్యములును, దరఖాస్తులును.

189. (1) షెడ్యూలుయొక్క A, B భాగములలో ఉదాహరింపఁబడినట్టి స్వభావము గల యావత్తు వ్యాజ్యములను దరఖాస్తులను కలెక్టరుగాని ఈ యాక్టునుబట్టి అందుకని అధికార మియ్యఁబడిన వేఱె రెవిన్యూ ఆఫీసరుగాని ఒక రెవిన్యూ కోర్టుగా నుండి విచారించి తీర్పుచేయవలయును; మఱియు ఏ సివిల్ కోర్టువారైనను తమకుఁ గల అసలు విచారణాధికారమును చెలాయించునపుడు, ఏ వివాదమును గుఱించి లేక సంగతిని గుఱించి అట్టి వ్యాజ్యముగాని దరఖాస్తుగాని తేఁబడునో లేక పెట్టుకోఁబడునో ఆ వివాదమును లేక సంగతిని విచారింపఁగూడదు.

(2) (1) వ సబ్ సెక్షను ననుసరించి ఇయ్యఁబడు డిక్రీలును ఉత్తరువులును, షెడ్యూలుయొక్క A, B భాగములలోని ఆఱవ కలములో నిబంధించిన ప్రకారము అప్పీలుకు లోఁబడి యుండును.

అప్పీళ్లు.

(3) కేవలము ఒక రెవిన్యూకోర్టువారికే విచారణాధికారము ఉండెడి యొక విషయముపయిని ఈ యాక్టు ననుసరించి జరిగింపఁబడు ప్రీ వ్యాజ్యమునందయినను వ్యవహారమందయినను ఒక రెవిన్యూ కోర్టు యొక్కగాని అప్పీలు చేసికోఁబడవలసిన లేక రివిషన్ చేయవలసిన అధికారియొక్కగాని తీర్పును, అందలి కక్షిదారులును వారిని బట్టి దావాచేయు మనుష్యులును, అట్టి విషయము వారిలో నొకరొకరికి వివాదము జరుగుచుండునట్టి యొక సివిల్‌కోర్టులో జరిగెడి యే వ్యాజ్యమందయినను వ్యవహారమందయినను ఒప్పుకోవలసినదిగా యుండును.

190. (1) 15 వ సెక్షను ననుసరించి చేయఁబడిన బరఖాస్తు విషయములో లేక 40 వ సెక్షను ననుసరించి తేఁబడిన వ్యాజ్యము విషయములో డిస్ట్రిక్టు కలెక్టరు అప్పీలులో చేయు ఉత్తరువులమీఁద రెవిన్యూ బోర్డు వారికి రెండవ అప్పీలు కలదు.

రెండవ అప్పీళ్లు.

(2) రెండవ అప్పీలుయొక్క విచారణను గుఱించి కక్షిదారులకు నోటీసు ఇయ్యవలయును, మఱియు వారు చెప్పుకొనఁగోరు సంగతులను ఖుద్దునఁగాని వారివారి ప్లీడర్లద్వారాగాని క్రమముగా అధికారము పొందిన యేజెంట్లద్వారాగాని చెప్పుకొనుటకు వారికి హక్కు కలదు.

191. 189 వ, 190 వ సెక్షన్లననుసరించి చేయఁబడు అప్పీలు లకు కాలావధియైనది, అప్పీలు చేయఁబడ్డ ఉత్తర్వుకు లేక డిక్రీకి నకలు పొందుటకు పట్టునట్టి కాలమును మినహాయించి, అట్లు అప్పీలు చేయఁబడ్డ ఉత్తర్వుయొక్క లేక డిక్రీయొక్క తేదినుండి ఆరంభమై యీ క్రింద చెప్పఁబడునట్లుగా నుండును. ఎట్లనఁగా:—

189 వ, 190 వ సెక్షన్లననుసరించిన అప్పీళ్లకు కాలావధి.

(a) అప్పీలు, డిస్ట్రిక్టు కోర్టుకు లేక డిస్ట్రిక్టు కలెక్టరునకు చేసికోవలసియున్నప్పుడు—ముప్పది దినములు;

(b) అప్పీలు, రెవిన్యూ బోర్డువారికి చేసికోవలసియున్నప్పుడు—అఱువది దినములు.

192. ఈ యాక్టుయొక్క తక్కిన నిబంధనలకు లోఁబడియును, ఈ క్రింది మార్పులకును చేర్పుటలకును లోఁబడియును, 1882 వ సంవత్సరపు 14 వ సివిల్ ప్రొసీజరుకోడుయొక్క నిబంధనలు, ఈ యాక్టు ననుసరించినట్టి యావత్తు వ్యాజ్యెములకును, అప్పీళ్లకును, ఇతర వ్యవహారములకును, అవి వానికి అసంగతముగా నుండనంతమట్టుకు, ప్రయోగపడును:—

సివిల్ ప్రొసీజరుకోడు యొక్క ప్రయోగము.

(a) 1882 వ సంవత్సరపు 14 వ సివిల్ ప్రొసీజరు కోడు లోని 121 మొదలు 127 వఱకు (రెండును చేరి) గల సెక్షన్లును, 129, 305, 310–A, 313 సెక్షన్లును, 320 మొదలు 326 వఱకు (రెండును చేరి) గల సెక్షన్లును, 20, 26, 33, 39, 40, 43, 44 అధ్యాయములును, అట్టి యే వ్యాజ్యెమునకుఁగాని అప్పీలుకుఁగాని లేక యితర వ్యవహారమునకుఁగాని ప్రయోగపడదు.

మఱియు 1882 వ సంవత్సరపు 14 వ సదరు కోడుయొక్క 25 వ సెక్షను, ఈ యాక్టు ననుసరించిన అప్పీళ్లను ఒక డిస్ట్రిక్టు జడ్జి కోర్టునుండి మఱియొక డిస్ట్రిక్టుజడ్జికోర్టుకు మార్చుటకు మాత్రమే ప్రయోగపడును.

(*b*) 68, 71, 74 సెక్షన్ల ననుసరించిన దరఖాస్తులను రెండవ పార్టీకి నోటీసు ఇయ్యకుండనే పరిష్కరింపవచ్చును.

(*c*) సదరు 1882 వ సంవత్సరపు 14 వ కోడుయొక్క 37 వ సెక్షనులోని (a), (c) క్లాజులలో "వాసము చేయకున్న" అను మాటలకు బదులు "వాసము చేయుచున్నట్టిగాని చేయకున్నట్టిగాని" అను మాటలను ఉంపవలయును.

(*d*) (i) ప్లెయింటులో, 1882 వ సంవత్సరము 14 వ సదరు కోడుయొక్క 50 వ సెక్షనులో చెప్పియున్న వివరములతోఁగూడ, వ్యాజ్యెము దేనికి సంబంధించినదిగా నున్నదో ఆ భూమి యుండెడు గ్రామము పేరును, ఆ భూమికి పేరు ఏదైన ఉన్నయెడల అట్టి పేరును, ఆ భూమిని గుర్తించుటకు చాలినంత దాని వివరమును చెప్పియుండవలయును;

(ii) ఆ వ్యాజ్యెము, హక్కుల రెకార్డు ఏ ప్రదేశమందు తయారుచేయఁబడి ప్రకటింపఁబడినదో ఆ ప్రదేశములో నున్నట్టి భూమి మీఁద బాకీగా నున్న పన్నును రాఁబట్టుకొనుటకుఁగానై యున్నయెడల, ప్లెయింటులో, హక్కుల రెకార్డుప్రకారము ఆ యధీనభూమికి ఏర్పడియుండు పన్నుయొక్క వివరణ మొకటికూడ ఉండవలయును;

అయినను, ఎప్పుడయిన కోరుట ఉచితమని కోర్టువారికి తోఁచిన యెడల, ఆ యధీనభూమికి సంబంధించిన హక్కుల రెకార్డుయొక్క నకలును లేక యెక్స్ట్రాక్టును వాది హాజరు పఱుపవలయును, లేక అగ

త్యమగునెడల, కోర్టువారు కోరినప్పుడు, లోకల్ గవర్నమెంటువారు ఈ యాక్టు ననుసరించి విధిమూలముగా నిర్ణయించెడి ఫారమును కోర్టువారు ఆజ్ఞాపించు ప్రకారము వాదియైనను ప్రతివాదియైనను చెల్లించిన మీఁదట అట్టి నకలును లేక యెక్స్ట్రాక్టును కలెక్టరు ఇయ్యవలయును;

(iii) ఆ వ్యాజ్యము పన్ను బాకీకొఱకైన యున్నయెడల ప్లైంటులో, ఆ వ్యాజ్యము ఏ కాలమునకు సంబంధించియున్నదో ఆ కాలమునకై చెల్లింపవలసిన వాయిదాలను, పైకమేదయినను చేరియున్న యెడల దాని మొత్తమును, బాకీగా నున్నట్లు చెప్పఁబడు మొత్తమును, తెలుపునట్టి లెక్క వివరణము ఉండవలయును.

(e) ఈ యాక్టు ననుసరించినట్టి యే వ్యాజ్యమునకయినను చట్టపు సమ్మతమైనట్టి లేక న్యాయసమ్మతమైనట్టి యే మొత్తమయినను తనకు ప్రతిగా చేరవలయు నని వాదింపఁగూడదు.

(f) ఏ కోర్టునందయిన జరుగుచుండెడి యొక వ్యాజ్యములో ఏ పన్నుపట్టీనైనను వసూలులేక కౌలంతి కాగితములనైనను భూస్వామి అట్టి కోర్టులో హాజరు పర్చియున్నపుడు, క్రమముగా అధికారము పొంది యుండు అట్టి కోర్టుతాలూకు ఒక ఆఫీసరు సరియైన నకళ్లని లేక యెక్స్ట్రాక్టు లని సర్టిఫై చేసినట్టి సదరు దస్తావేజుల నకళ్లుగాని యెక్స్ట్రాక్టులు గాని అదే కోర్టులోనైనను వేఱొక కోర్టులోనైనను దాఖలు చేయఁబడు వేఱె యే వ్యాజ్యమందుఁగాని, అట్టి నకళ్లు లేక యెక్స్ట్రాక్ట్లు హాజరు చేయఁబడు కోర్టువారు అసలు దస్తావేజులు హాజరు పఱుమనట్లు కోరుట యుక్తమని తలఁచిననే తప్ప, సాక్ష్యముగా అంగీకరించవచ్చును.

(g) కోర్టువారు, పన్నును రాఁబట్టుకొనుటకుఁ గానైనట్టి వ్యాజ్యములో డిక్రీ చేయునప్పుడు, డిక్రీదారుఁడు వాచా మనవి చేసికొన్న మీఁదట, దానిని వెంటనే అములు నెఱవేర్చునట్లు ఉత్తరువు చేయవచ్చును.

(h) సదరు 1882 వ సం॥పు 14 వది. కోడుయొక్క 266 వ సెక్షను ననుసరించి జప్తు చేయఁబడుటకు లేక విక్రయింపఁబడుటకు అర్హముగా యుండనివానిలో "ఒక వ్యవసాయదారుఁడు చేర్చిపెట్టెడి యెఱువు"ను కూడ చేర్చవలయును.

(i) పెరుఁగుచుండెడు చెట్లు, పైర్లు, లేక నేలలో ఉత్పత్తియగు తక్కినవస్తువులు, చరాస్తివలెనే డిక్రీని అమలు నెఱవేర్చుటకై జప్తుచేసి విక్రయింపఁబడవచ్చును; మఱియు జప్తుచేయఁబడిన సొత్తు పెరిఁగెడి పైర్లుగాఁగాని నేలలో ఉత్పత్తియగు వస్తువులుఁగాని ఉన్నయెడల, వరుసగా అట్టి పయిర్లు లేక వస్తువులు పన్ను బాకీకిఁగాను జప్తుచేయఁబడినయెడల 83 వ సెక్షను ననుసరించి సాగుబడి చేసినవానికిని జప్తుదారునికిని ఏలాటి హక్కులు ఉండియుండునో ఆలాటి హక్కులే వానిని కాపాడు విషయములోను కోయించు విషయములోను సేకరించియుంచు విషయములోను తీర్పు ఋణస్థునికిని డిక్రీదారునికిని ఉండును.

పన్నును హెచ్చించుటనుగుఱించిన లేక తగ్గించుటను గుఱించిన వ్యాజ్యములో రయితులను ఒకటిగా చేర్చుట.

193. (1) పన్నును హెచ్చించుటకుఁగానయినట్టి లేక తగ్గించుటకుఁగానయినట్టి వ్యాజ్యము ఎంతమంది రయితుల మీఁదఁగాని లేక వారిచేఁగాని మొత్తముగా దాఖలు కావచ్చును:

అయినను, అట్టి రయితు లందఱును ఒకే భూస్వామియొక్క రయితులుగా నుండవలయును; మఱియు ఆ వ్యాజ్యము ఏ యధీనభూములను గుఱించి తేఁబడుచున్నదో అవన్నియు ఒకే గ్రామమందు ఉండవలయును; అంతయేకాక, హెచ్చించుటకు లేక తగ్గించుటకుఁగల కారణములు ఒక్కటిగా నుండవలయును.

(2) ఏ మనుష్యునియొక్కనైన బాధ్యతలకు సంబంధించినదిగా నుండెడి అట్టి యే వ్యాజ్యములోగాని, ఆ మనుష్యుడు హాజరై విచారింపబడుటకు అతనికి అవకాశమియ్యబడినదని కలెక్టరు తృప్తిపొందిననే తప్ప, యే డిక్రీగాని ఇయ్యగూడదు.

(3) ఆ డిక్రీలో, అది సదరు రయితులలో ఒక్కొకనికిని ఎంతవఱకు సంబంధించుచున్నదియు వివరించి యుండవలయును.

194. (1) ఈ యాక్టుబట్టి పన్నును రాబట్టుకొనుటకుగాను తెచ్చెడి యే వ్యాజ్యములోనైనను, లేక జరిగించెడి యే వ్యవహారములోనైనను, రయితు పన్ను తాను బాకీయున్నానని ఒప్పుకొనుచు అది వాదికిగాని లేక దరఖాస్తుదారునికిగాని బాకీలేకుండ వేఱొక మూడవ మనుష్యునకు బాకీయున్నానని వాదించునప్పుడు, లేక, ఈ యాక్టు యొక్క నిబంధనలు జరుపబడలేదని వాదించునప్పుడు, కలెక్టరు, విశేష కారణము లుండిననే తప్ప, అట్లు బాకీ యున్నానని ఒప్పుకొనబడిన మొత్తము తనకోర్టులో రయితు చెల్లించిననేగాని ఆ వాదమును విచారణ చేయునని నిరాకరింపవలయును. అట్టి విశేషకారణములు ఉన్నయెడల వానిని వ్రాతలో రికార్డు చేయవలయును.

పన్ను వాదికి బాకీలేకుండ మూడవమనుష్యునికి బాకీ యున్నట్లు వాదించునప్పుడు కోర్టులో పైకము చెల్లించిన మీదటనే అంగీకరింపవలయుననుట.

(2) అట్లు పైకమును చెల్లించినమీదటను, ఆ పన్ను వాదికి లేక దరఖాస్తుదారునికి బాకీలేదనియు మూడవ మనుష్యునకు బాకీ అనియు వాదము చేయునప్పుడును, కలెక్టరు ఆ చెల్లించిన విషయమును ఆ మూడవ మనుష్యునకు నోటీసు వెంటనే జారీ చేయింపవలయును.

(3) ఆమూఁడవమనుష్యుఁడు ఆ నోటీసువచ్చిన మూఁడు నెలల లోఁగా సివిల్ కోర్టువారియెదుట వాదిమీఁదఁగాని దరఖాస్తుదారుని మీఁదఁగాని వ్యాజ్యెము దాఖలుచేసి ఆ వ్యాజ్యెములో పైకమును చెల్లించివేయకుండ ఆఁపుటకు హుకుమును పొందిననే తప్ప, వాదిగాని దరఖాస్తుదారుఁడుఁగాని దరఖాస్తు చేసికొన్నమీఁదట పన్ను వానికి ఇచ్చివేయవలయును.

(4) 3–వ సబ్ సెక్షనును అనుసరించి వాదికిఁగాని దరఖాస్తు దారునికిఁగాని చెల్లింపఁబడిన పయికమును ఒక సివిల్ కోర్టులో దావా చేసి వానివద్దనుండి రాఁబట్టుకొనుటకు ఏ మనుష్యునికయినఁ గల హక్కును ఈ సెక్షనులో నుండునది యేదియు బాధింపదు.

195. ఈ యాక్టునుబట్టి పన్నును రాఁబట్టుకొనుటకుఁగాను తెచ్చెడి యే వ్యాజ్యెములోనైనను లేక జరిగించెడి యే చర్యలోనయినను, రయితు పన్నుబాబతుకయి పయికమును తాను వాదికిఁగాని దరఖాస్తుదారునికిఁగాని బాకీయున్నానని ఒప్పుకొని దావా చేసిన మొత్తము బాకీయున్న మొత్తముకంటె ఎక్కువ యని వాదించునప్పుడు, కలెక్టరు, విశేష కారణములుండిననే తప్ప అట్లు బాకీయున్నట్లు ఒప్పుకొనఁబడిన మొత్తమును రయితు తన కోర్టులో చెల్లించిననేగాని ఆ వాదమును విచారణ చేయనని నిరాకరింపవలయును. అట్లు విశేషకారణములు ఉన్నయెడల వానిని వ్రాఁతలో రెకార్డుచేయవలయును.

డిమాండుచేయఁబడిన పన్ను ఎక్కువ అను వాదము, బాకీయని ఒప్పుకోఁబడిన మొత్తమును కోర్టులో చెల్లించిన మీఁదటనే అంగీకరింప వలయుననుట.

196. 194–వ సెక్షనుననుసరించియైనను 195–వ సెక్షనుననుసరించియైనను రయితు కలెక్టరు కోర్టులో పైకమును చెల్లింప బద్ధుఁడై

194 వ సెక్షను, 195 వ సెక్షను ననుసరించి కోర్టులో చెల్లింపవలసిన మొత్తమును నిర్ణయించుటకు కలెక్టరుకుంగల అధికారము.

యున్నప్పుడు, అట్లు చేయుటకు చాలినన్ని కారణము లున్నవని అట్టి కలెక్టరునకుం దోఁచినపక్షమున, ఆ మొత్తములో సదరు కలెక్టరు ఆజ్ఞాపించునంతటి న్యాయమయిన భాగమును సదరు రయితు చెల్లించినమీఁదట, అతని (క్లైం) దావాను సదరు కలెక్టరు విచారణచేయవచ్చును.

కలెక్టరు రసీదు ఇచ్చుట.

197. 194–వ సెక్షను ననుసరించిగాని 195–వ సెక్షను ననుసరించిగాని రయితు పైకమును చెల్లించునప్పుడు, కలెక్టరు రయితుకు రసీదు ఇయ్యవలయును. మఱియు అట్లు ఇచ్చిన రసీదు, అది, చట్టముప్రకారము పన్నుకు హక్కుగల మనుష్యుఁడు ఇచ్చియుండిన పక్షమున నెట్లో, అట్టి విధముగాను అంతమట్టుకును చెల్లుచీటిగా చెల్లును.

రైతులను ఒకటిగా చేర్చిన విషయములో ప్రత్యేకపు విచారణలు జరుగునట్లు ఉత్తరువు చేయుటకు అధికారము.

198. పన్నును హెచ్చించుటకై లేక తగ్గించుటకై మొత్తముగా అనేక రైతులమీఁదగాని లేక అనేక రైతులచేఁగాని యొకటియొకట వ్యాజ్యము దాఖలుచేయఁబడినయెడల అట్టి కలెక్టరుకు ఆ వ్యాజ్యములను ఒకేవ్యాజ్యముగా విచారించుటకు లేక పైసలు చేయుటకు వీలుకాదని తోఁచినయెడల, అట్టి ఆఫీసరు మొదటి విచారణకు ముందు ఎప్పుడైనను స్వయముగాఁగాని, లేక పార్టీలలో నెవరియొక్క దరఖాస్తుమీఁదఁగాని, లేక పార్టీలు సమ్మతించినయెడల వ్యాజ్యముయొక్క తర్వాతిదశలో నెప్పుడైనఁగాని, ఒక్కొక్క రైతుమీఁద లేక ఒక్కొక్క రైతుచే తేఁబడిన వ్యాజ్యములకు ప్రత్యేకపు విచారణలు జరుగునట్లు ఉత్తరువు చేయవచ్చును, లేక దానిని

ప్రత్యేకముగా పైసలు చేయుటకుంగాను ఆవశ్యమగునట్టి లేక యుక్తమగునట్టి వేఱె ఉత్తరువును చేయవచ్చును.

169. 1892 వ సం॥పు 14 వది. (1) సివిల్ ప్రొసీజరుకోడు 375 వ సెక్షనులోని నిబంధనలు, భూస్వామికిని రైతుకును ఆ హోదాలలో జరిగెడి యే వ్యాజ్యమునకును లేక దరఖాస్తునకును, ప్రయోగపడవు.

వ్యాజెము లేక దరఖాస్తు విషయములో రాజిపడుట.

(2) భూస్వామికిని రైతుకును ఆ హోదాలలో జరిగెడి యే వ్యాజ్యమయినను లేక దరఖాస్తు అయినను మొత్తముగాంగాని లేక కొంతవఱకుంగాని ఒక చట్టపు సమ్మతమగు కరారునామా మూలముగా లేక రాజీమూలముగా సరిపుచ్చుకొనంబడినయెడల, లేక ప్రతివాది వాదిని వ్యాజ్యమునకు లేక దరఖాస్తునకు సంబంధించియున్నట్టి విషయమయి పూర్తిగాంగాని లేక కొంతవఱకుంగాని సమాధానపఱిచినయెడల, కోర్టువారుగాని లేక కలెక్టరుగాని ఆ వ్యాజ్యమునకు లేక దరఖాస్తునకు సంబంధించునంతవఱకు అట్టి కరారునామా, రాజీ, లేక సమాధానము ననుసరించి డిక్రీని లేక ఉత్తరువును ఇయ్యవచ్చును;

కాని, ఆయాసంగతికి తగినట్లు కోర్టువారుగాని లేక కలెక్టరుగాని అట్టి కరారునామాను, రాజీని, లేక, సమాధానమును, రెకార్డుచేయనగు ఏ కారణములను బట్టి అయుక్తమనిగాని లేక అన్యాయమునిగాని తలంచునెడల పైయట్లు చేయకుండ నిషేధింపవచ్చును.

(3) ఏదేని యొక చట్టపుసమ్మతమగు కరారునామాను, రాజీని, లేక సమాధానమును అనుసరించి యియ్యఁబడిన డిక్రీ లేక ఉత్తరువు, అట్టి కరారునామా, రాజీ, లేక సమాధానము ఆ వ్యాజ్యముయొక్క లేక

దరఖాస్తుయొక్క విషయమునకు ఎంతవఱకు సంబంధించునో అంతవఱకు, కడపటిదిగా నుండును.

స్థాయిగా ఉండదగిన భూస్వాములు.

200. (1) పన్నును హెచ్చించుటకై, తగ్గించుటకై, లేక మార్చుటకై తెచ్చెడి వ్యాజ్యముగాని విక్రియముచేత పన్నును మార్చుటకై చేసికొను దరఖాస్తుగాని, ఆయా సంగతి కొలది ఆ యెస్టేటును లేక సంబంధించిన భాగమును స్వాధీనమందు కలిగియుండెడి భూస్వామిచే మాత్రమే లేక అతనివిరోధమమాత్రమే తేబడవచ్చును లేక చేసికోబడవచ్చును.

అయినను—

(i) అట్టి భూస్వామి, ఆ యెస్టేటుకుగాని సంబంధించిన భాగమునకుగాని సొంతదారుడు కానట్లు కనుపడినప్పుడు, వాదియొక్క లేక దరఖాస్తుదారునియొక్క కష్టముతో ఆ వ్యాజ్యమును లేక దరఖాస్తును గురించి కోర్టువారు సొంతగానికి నోటీసు ఇయ్యవలయును; మఱియు అతనిని ఆ వ్యాజ్యమునకు లేక దరఖాస్తుకు పార్టీగా చేయవలయును;

(ii) అట్టి భూస్వామి ఆ యెస్టేటుకుగాని సంబంధించిన భాగమునకుగాని సొంతగాడు కాకుండెడి, అతడు పన్నును హెచ్చించుటకై లేక మార్చుటకై వ్యాజ్యము తెచ్చుటకుగాని లేక పన్నును దరఖాస్తు చేయుటకుగాని ఇష్టపడకున్నప్పుడు, సొంతగాడు. స్వాధీనదారుడగు భూస్వామిని పార్టీగా చేసి అట్టి వ్యాజ్యము తేవచ్చును; లేక అట్టి దరఖాస్తు చేయవచ్చును; కాని, అట్టి వ్యాజ్యములో లేక దర

ఖాస్తులో కోర్టువారిచే నిర్ణయింపఁబడునట్టి యే పన్నును గాని, సదరు ఎస్టేటును లేక సంబంధించిన భాగమును స్వాధీనమందు కలిగియుండుటకు హక్కు గల భూస్వామికే చెల్లింపనగును.

(2) 7 వ అధ్యాయమునుబట్టి జరుపనగు చర్యలను, స్వాధీన దారుఁడగు భూస్వామియిూఁద జరుపవలయును, కాని అట్టి భూస్వామి సొంతగాఁడై కూడ ఉండని పక్షమందు, సొంతగానిని చర్యలకు పార్టీగా చేయవలయును.

(3) సొంతగాఁడైనను, ఎస్టేటును తత్కాలములో స్వాధీనమందు కలిగియుండుటకు హక్కు కలిగియుండు భూస్వామి దాని సొంతగాఁడు కానప్పుడు, భూస్వామియైనను, భూస్వామియొక్క హోదాలో, 164 వ, 168 వ, లేక 156 వ సెక్షన్ల ననుసరించి దరఖాస్తు చేసుకొనవచ్చును, కాని ఆ దరఖాస్తునుగురించి తక్కినవానికి నోటీసు ఇయ్యవలయును.

పైకము చెల్లించుటకుఁగానైన డిక్రీని లేక హుకుమును అములు జరుపునిమిత్తమై ట్రాన్స్ఫరు చేయుట.

201. ఒక రెవిన్యూ కోర్టువారుగాని అప్పీలు చేసికోఁబడవలసిన లేక రివిషను చేయవలసిన యే యధికారి గాని పైకమునుచెల్లించుటకై చేసెడి డిక్రీ లేక హుకుము అయినది, అములు జరుపు నిమిత్తమై ఒక సివిల్ కోర్టువారికి మాత్రమే ట్రాన్స్ఫరు చేయఁబడవచ్చును.

విధులు చేయుటకు హైకోర్టువారి అధికారము.

202. లోకల్ గవర్న్మెంటువారి అనుమతితో హైకోర్టువారు, సివిల్ ప్రొసీజరు కోడుయొక్క యేభాగములైనను, భూస్వామికిని రైతుకును ఆహోదాలలో జరుగునట్టి వ్యాజ్యెములకు, లేక

అట్టి వ్యాజ్యెములలో పలాని వని ఉదాహరింపఁబడిన తెరగతులకు, ప్రయోగింప వని గాని, లేక విధులలో ఉదాహరింపఁబడిన మార్పులకు లోఁబడి వానికి ప్రయోగించునని గాని, తెలుపుచు, ఈ యాక్టున కను గుణముగా విధులు చేయవచ్చును.

హక్కుల రెకార్డులోని పద్దులను కోర్టువారు లక్ష్యపెట్ట వలయును.

203. (1) ఏ ప్రదేశమునకుఁగానైనను 166-వ సెక్షను (2) వ సబ్ సెక్షను ననుసరించిగాని 170-వ సెక్షను (3) వ సబ్ సెక్షను ననుసరించిగాని హక్కుల రెకార్డు తయారుచేయఁబడి ఆఖరుగా ప్రకటింపఁబడినప్పుడు, భూస్వామికిని రయితుకును ఆ హోదాలలో జరిగెడి వ్యాజ్యెములన్నిటిలోను, ఏ భూమివిషయమై వ్యాజ్యెము తేఁబడుచున్నదో ఆ భూమిని గురించిన హక్కుల రెకార్డులోని యే పద్దుకయినను సర్టిఫై చేసిన యొక నకలును వాది ప్లెయింటుతోడ జతపఱుపవలయును, లేక కోర్టువారు చాలినంతటిదిగ తలఁచునట్టి యే కారణమువలననైనను అట్లు చేయుటకు అతఁడు తప్పి పోయిన పక్షమున, అట్టి నకలును కోర్టువారు నిర్ణయించునట్టి న్యాయమైన కాలములోఁగా హాజరు చేయవలయును.

(2) అట్టి వ్యాజ్యెమును తీర్మానించుటలో కోర్టువారు, (1) వ సబ్ సెక్షను ననుసరించి హాజరు చేయఁబడిన పద్దులను, ఆ పద్దులు సరి కానట్టు ఋజువు చేయఁబడినవే తప్ప, లక్ష్యపెట్టవలయును. మఱియును అట్టి పద్దులకు వ్యతిరిక్తముగా కోర్టువారు డిక్రీ యిచ్చినప్పుడు అట్లు చేయుటకుఁగాను వారి కుండు కారణములను వారు రెకార్డు చేయవలయును.

(3) 1-వ సబ్ సెక్షనులో వివరింపఁబడిన కార్యమునకై కావలసియుండు హక్కుల రెకార్డులోని పద్దులకు సర్టిఫై చేసిన నకళ్లు ఇచ్చుటకుఁగాను రుసుము ఏదియు కట్టనక్కఱలేదు.

(4) అట్టి వ్యాజ్యెములు విషయములో, సివిల్ ప్రొసీజరు కోడు యొక్క 54-వ సెక్షనుకు ఈ క్రింది క్లాజును (e) క్లాజుగా చేర్చియున్నట్లు ఎన్నఁబడును, అది యేదనఁగా :

(e) 1908-వ సంవత్సరపు మదరాసు ఎస్టేట్ల భూమి ఆక్టుయొక్క 203-వ సెక్షను ప్రయోగించునట్టి యే వ్యాజ్యెముల నైనను, అందు చెప్పఁబడిన సర్టిఫై చేసిన నకలు ప్లెయింటుకు జతపఱుపఁబడనియెడల, దానిని హాజరు పఱుపుమని కోర్టువారు కోరినమీఁదట వాది కోర్టు వారు సెలవిచ్చియుండు కాలములోఁగా అట్లు చేయుటకు తప్పినయెడలను.

204, (1) డిస్ట్రిక్టు కలెక్టరు, డిస్ట్రిక్టులోని యే కలెక్టరువలననుగాని లేక వేఱె రెవిన్యూ ఆఫీసరువలననుగాని ఈ యాక్టు ననుసరించి విచారింపఁదగినట్టి యే పనినయినను, తనకు యుక్తమని తోఁచెడివిధమున, వ్రాఁతమూలమైన హుకుముద్వారా, పంచిపెట్టవచ్చును; మఱియు అట్టి హుకుముద్వారా అతఁడు అట్టి కలెక్టరునెదుటఁగాని లేక వేఱె రెవిన్యూ ఆఫీసరునెదుటఁగాని విచారణలో నున్నట్టియే కేసునయినను ఉతరాచేసి దానిని తానే స్వంతముగానైన ఫైసల్ చేయవచ్చును, లేక వ్రాఁతమూలమయిన హుకుముద్వారా దానిని ఆ డిస్ట్రిక్టులోని వేఱె యే కలెక్టరుకైన లేక రెవిన్యూ ఆఫీసరుకైన ఫైసల్ నిమిత్తము రిఫర్ చేయవచ్చును.

పనిని పంచిపెట్టుటకును కేసులను ఉతరాచేయుటకును సూర్చుటకును డిస్ట్రిక్టుకలెక్టరుకును రెవిన్యూ బోర్డువారికిని అధికారము.

(2) రెవిన్యూ బోర్డువారు, యావత్తుమంది డిస్ట్రిక్టు కలెక్టర్ల విషయములో, డిస్ట్రిక్టు కలెక్టరు తనకు లోఁబడియుండు రెవిన్యూ ఆఫీ

సర్లు విషయములో (1) టి సబ్ సెక్షను ననుసరించి హుకుము వద్దైన చేసియున్నప్పటికిని నిమిత్తము లేకయే, అదేవిధముగ పంచిపెట్టుటకును ఉతరా చేయుటకును రిఫర్ చేయుటకును అధికారములు కలిగి యుందురు.

205. రెవిన్యూ బోర్డువారుగాని డిస్ట్రిక్టు కలెక్టరుగాని, ఏ రెవిన్యూ ఆఫీసరుయొక్క తీర్పుమీఁద అప్పీలు లేదో అట్టి ఆఫీసరునెదుట జరిగిన చర్యల రెకార్డును, అట్టి ఆఫీసరు తనకు చట్టముచే కలుగఁజేయఁబడనట్టి విచారణాధికారమును చెలాయించినట్లుగా లేక అట్లు కలుగఁజేయఁబడినట్టి విచారణాధికారమును చెలాయింపక పోయినట్లుగా లేక తనకుఁగల విచారణాధికారమును చెలాయించుటలో సారాంశమునుబట్టి తీర్పును బాధింపఁగల స్పష్టమగు చట్టపు నిబంధనలకు విరుద్ధముగా నడుచుకొని, అట్లు నడుచుకొనుటవలన కేవలము అన్యాయము జరిగినట్లుగా కనఁబడునట్టి యే కేసులోని రెకార్డునైనను తెప్పించవచ్చును; మఱియు దానిమీఁద ఆయా సంగతికి తగినట్లు సదరు రెవిన్యూ బోర్డువారుగాని డిస్ట్రిక్టుకలెక్టరుగాని, పార్టీలు హాజరైన పక్షమందు వారిని విమర్శించినతర్వాత, ఉచిత మని తోఁచెడు హుకుమును జారీ చేయవచ్చును.

రెవిన్యూ ఆఫీసర్లయొక్క చర్యలను తెప్పించి పునస్సమీక్ష చేయుటకు అధికారము.

206. లోకల్ గవర్న్మెంటువారు, ఈ యాక్టునుబట్టి దాఖల య్యేడు అసలు వ్యాజ్యెములయొక్క లేక చర్యలయొక్క అన్ని తరగతుల విషయము లోఁగాని యేవైన తరగతులవిషయములోఁగాని, కలెక్టరుయొక్క అధికారముల నన్నిటిని గాని వానిలో వేనినైనఁగాని, ఏ ప్రదేశమునకైనను ఏ రెవిన్యూ

కలెక్టరుయొక్క అధికారములను రెవిన్యూ ఆఫీసరునకు లేక జుడిషల్ ఆఫీసరునకు ఇచ్చుటకు అధికారము.

ఆఫీసరునకయిన లేక జుడిషల్ ఆఫీసరునకయిన కలుగఁజేయవచ్చును, అట్టి యధికారములను ఉతరాచేయునుసచ్చును; మఱియు అట్టి రెవిన్యూ ఆఫీసరుచే లేక జుడిషల్ ఆఫీసరుచే చేయఁబడు తీర్పులు, ఆ రెవిన్యూ ఆఫీసరునకు లేక జుడిషల్ ఆఫీసరునకు అట్లు అధికారము కలిగించి యుండనియెడల ఆ వ్యాజ్యెములను లేక చర్యలను విచారింపవలసి యుండునట్టి కలెక్టరుయొక్క తీర్పులయి యున్న నెట్లో అట్లే అవి అప్పీలు చేయఁదగి యుండును.

అడ్డిషనల్ డిస్ట్రిక్టు కలెక్టరు ను నేమించుట.

207. లోకల్ గవర్నమెంటువారు, ఈ యాక్టు ననుసరించి డిస్ట్రిక్టు కలెక్టరుకుఁ గల అధికారముల నన్నిటినిగాని వేనినయినఁగాని డిస్ట్రిక్టు కలెక్టరే గాక మఱొకరును చెలాయించుటకై ఒక ఆఫీసరును నేమింపవచ్చును.

పెద్యాలు డిస్ట్రిక్ట్లకు డిస్ట్రిక్టుకలెక్టర్లను కలెక్టర్లును.

208. గంజము, విశాఖపట్టణము పెద్యాల్లు డిస్ట్రిక్టులలో గవర్నరుగారి యేజెంటును గోదావరి పెద్యాల్లు డిస్ట్రిక్టులో గవర్నమెంటు ఏజెంటును ఈ యాక్టుయొక్క కార్యముల నిమిత్తము డిస్ట్రిక్టు కలెక్టరుగా నుండును, మఱియు ఆ డిస్ట్రిక్ట్లలోని అసిస్టెంటు ఏజెంట్లు ఆ కార్యముల నిమిత్తము కలెక్టర్లుగా నుందురు.

వ్యాజ్యెములను లేక చర్యల ను దాఖలుచేయవలసిన స్థలము.

209. (1) ఈ యాక్టు ననుసరించి తేఁబడునట్టి లేక జరపఁబడునట్టి యావత్తు వ్యాజ్యెములను లేక చర్యలను, ఏ యధీనభూమి విషయమయి వ్యాజ్యెములు తేఁబడునో లేక చర్యలు జరపఁబడునో ఆ యధీనభూమి లేక యధీనభూమిలో అధికభాగము ఉండునట్టి రెవిన్యూ డివిజనులో తేవలయును లేక జరపవలయును.

(2) డిస్ట్రిక్టు కలెక్టరుయొక్క ఉత్తరువులకు లోఁబడి, కలెక్టరు లేక వేరె రెవిన్యూ ఆఫీసరు, ఈ యాక్టు ననుసరించిన వ్యాజ్యెములను లేక దర్యాప్తులను డిస్ట్రిక్టులోపల ఏ స్థలమునందైనను ఫైసలు చేయవచ్చును.

---

## 16 – వ అధ్యాయము.

### కాలావధి.

వ్యాజ్యెములు మొదలగువానికి కాలావధి

210. (1) సన్నిహితముగా నుంబడినయట్టి సెక్షనులోని నిబంధనలకు లోఁబడి, ఈ యాక్టుతో చేర్పఁబడిన (షెడ్యూలు) పట్టీలో లేక 191-వ సెక్షనులో నిర్ణయించిన కాలావధి పరిమాణమునకు తర్వాత తేఁబడిన ప్రతివ్యాజ్యెము, దాఖలుచేయఁబడిన ప్రతి అప్పీలు, లేక చేయఁబడిన ప్రతి దరఖాస్తు, కాలావధివిషయము ప్రతివాదింపఁబడ కుండినప్పటికిని, కొట్టివేయఁబడును.

(2) ఏ వ్యాజ్యెముగాని లేక అప్పీలుగాని లేక దరఖాస్తుగాని ఈ యాక్టు ప్రారంభ మగుటకు అవ్యవహితముగా పూర్వమందు తేఁబడి, లేక దాఖలుచేయఁబడి, లేక చేయఁబడియుండినయెడల కాలావధిచే నిరోధింపఁబడి యుండునో అట్టి వ్యాజ్యెమును తెచ్చుటకుఁగాని లేక అప్పీలును దాఖలుచేయుటకుఁగాని. లేక దరఖాస్తును చేయుటకుఁగాని ఈ సెక్షనులో నుండునదేదియు హక్కును మరల కలుగఁజేయదు.

ఇండియా(లిమిటేషను ఆక్టు, కాలనిర్ణయ శాసనముయొక్క భాగములు, అట్టి వ్యాజ్యెములు మొదలైనవానికిప్రయోగపడమి.

211. (1) 1877-వ సంవత్సరపు 15-వ ఆక్టు. ఇండియా కాలనిర్ణయశాసనముయొక్క 7. 8, 9, 19, 20 సెక్షన్లు పై కడపటి సెక్షనులో ఉదాహరించఁబడిన వ్యాజ్యెములకును దరఖాస్తులకును ప్రయోగపడవు.

(2) ఈ యధ్యాయపు నిబంధనలకు లోనై, 1877-వ సంవత్సరపు 15-వ ఆక్టు ఇండియా కాలనిర్ణయ శాసనముయొక్క నిబంధనలు పయి కడపటి సెక్షనులో ఉదాహరింపఁబడిన వ్యాజ్యెములకు అప్పీళ్లకు దరఖాస్తులకు అన్నిటికిని ప్రయోగపడును.

---

## 17 వ అధ్యాయము.

### అనుబంధములు.

### శిక్షలు.

చట్టమునకు విరుద్ధముగా మహాసూలువగైరాల జోలికిపోయి నయెడల శిక్షలు.

212. (1) ఏ మనుష్యుఁడైనను—

(a) ఈయాక్టు మిషచే, ఏ సొత్తునుగాని మోసముగా జప్తుచేయుపక్షమునఁగాని, విక్రయించుపక్షమునఁగాని, విక్రయింపఁబడునట్లు చేసినపక్షమునఁగాని ; లేక

(b) ఈ యాక్టును అనుసరించి క్రమముగా చేయఁబడిన జప్తును ఆటంకపఱిచినపక్షమునఁగాని లేక యీ యాక్టు ననుసరించి క్రమముగా జప్తుచేయఁబడిన మహాసూలును దేనినయినను బలాత్కారముగనైనను రహస్యముగనయినను తీసికొనిపోవుపక్షమునఁగాని లేక బాకీకిఁగాను చేయఁబడిన జప్తును ఆఁపుటకు సొత్తును దగాగా ఇతరుని పరము చేయుపక్షమునఁగాని ; లేక

(c) రయితుయొక్క అధికారమునుగాని సమ్మతినిగాని పొందియుండిననే తప్ప, అధీనభూమిలోని మహాసూలును దేనినయిన కోయుటలోఁగాని, సేకరించుటలోఁగాని, చేర్చిపెట్టుటలోఁగాని, తీసికొనిపోవు

టలో॰గాని లేక మఱియొకవిధముగా వ్యవహరించుటలో॰గాని, అన్యాయముగా ఆటంకపెట్టుపక్షమునయినను ఆటంకపెట్టుటకు ప్రయత్నించు పక్షమునయినను; లేక

(d) ఏదైన యెస్టేటులోని రయితీ భూమినుండి 163-వ సెక్షనునుబట్టి (ఇజెక్టు) వెడలఁగొట్టఁబడి, అదేభూమికి లేక అదేభూమిలోని యే భాగమునైనను భూస్వామియొక్క అనుమతి లేకయే ఆక్రమించుకొనినపక్షమునను;

అతఁడు రెండవ తరగతి మాజిస్ట్రేటు హోదాకంటె తక్కువకాని హోదాగల మాజిస్ట్రేటు నెదుట నేరము స్థాపింపఁబడినమీఁదట, అయిదువందల రూపాయలవఱకు ఎంతజుల్మానాతోనయిన శిక్షింపఁబడఁదగియుండును.

(2) 1 టి 1860 వ సంవత్సరపు 45 వది. సబ్ సెక్షనులో చెప్పఁబడిన కార్యమును దేనినయిన జరిపించుటలో కుమ్మకు చేయునట్టి యే మనుష్యుఁడైనను ఇండియన్ పీనల్ కోడుయొక్క తాత్పర్యప్రకారము నేరమునకు కుమ్మకు చేసినట్లు ఎన్నఁబడును.

(3) ఈ యాక్టు నిబంధనలకు విరుద్ధముగా స్త్రీలగదులలో ప్రవేశించునట్టి లేక నివాసగృహముల బయిటితలుపులు బలవంతముగా తీయునట్టి మనుష్యులు ఇండియన్ పీనల్ కోడు తాత్పర్యప్రకారము ఇంటిలో (హౌస్ ట్రెస్పస్) అక్రమప్రవేశపునేరము జరిపించినట్లు భావింపఁబడుదురు.

వ్యాజ్యెము తెచ్చుటకు సామాన్యపు హక్కు.

213. (1) (a) ఈ యాక్టు మిమమీఁద జరుపఁబడిన యే చర్యవలనఁగాని, (b) దీని నిబంధనలలో దేనినయిన అశ్రద్ధ చేసినందు

నష్టిప్రతీకారమునకై వ్యాజ్యేము తెచ్చుటకు సామాన్యపు హక్కు.

వలనఁగాని ఉల్లంఘించినందువలనఁగాని, తనకు నష్టి కలిగినట్లు ఎంచునట్టి యేమనుష్యుఁ డయినను, కలెక్టరునెదుట నష్టి ప్రతీకారమునకై వ్యాజ్యేము తెచ్చి పరిహారమును పొందవచ్చును.

(2) ఈ యాక్టునుబట్టి ఒక సివిల్ కోర్టువారి విచారణాధికారమునుండి యెత్తివేయఁబడని యే వ్యాజ్యేములోనయినను అట్టి కోర్టులో వ్యవహారమును తెచ్చుటకుఁగల హక్కును ఈ సెక్షను ఆటంకపర్చునట్లు ఎన్నఁగూడదు.

(3) అయినను (1) టి సబ్ సెక్షనును అనుసరించి నష్టిప్రతీకారమునకై వ్యాజ్యేమును దాఖలు చేసెడి యే మనుష్యుఁడైనను ఆదే వ్యాజ్యేపుకారణమును గురించి యొక సివిల్ కోర్టులో వ్యాజ్యేము దాఖలుచేయుటకు ఎప్పటికిని హక్కు కలిగియుండఁడు.

## భూస్వాముల యేజెంట్లు.

ఏజెంటుద్వారా పని జరుపుటకు భూస్వామికిఁ గల యధికారము.

214. (1) ఏ కలెక్టరు నెదుటనైనను ఆఫీసరునెదుటనైనను ఒక భూస్వామి ఈ యాక్టులో చేయవలసినదిగా లేక జరిగింపవలసినదిగా కోరఁబడినట్లు లేక అధికార మియ్యఁబడినట్లు కార్యము జరిపించడమును, హాజరుకావడమును, దరఖాస్తు పెట్టుకోవడమును, అట్టి భూస్వామియొక్క సంతకముతో వ్రాఁతమూలమయిన అధికారము పొందిన యేజెంటుకూడ చేయవచ్చును లేక జరిగింపవచ్చును.

(2) ఈ యాక్టులో కోరఁబడినట్లు ఒక భూస్వామికి అందఁజేయవలసిన లేక ఇయ్యవలసిన ప్రతి నోటీసును; సదరు భూస్వానితరఫున

దానిని అంగీకరించుటకు లేక పుచ్చుకొనుటకు పైని చెప్పినట్లు అధికారముపొందిన యేజెంటుకు అందజేయబడి లేక యియ్యబడి యుండనపక్షమున, ఈ యాక్టుకార్యములకొరకు అది భూస్వామికి ఋద్దున అందజేయబడి లేక యియ్యబడియుండిన నట్లే అన్ని అంశములు కలిగియుండును.

(3) భూస్వామిచే చేవ్రాలు చేయబడవలయునని లేక సర్టిఫై చేయబడవలయునని యీ యాక్టుచే కోరబడిన ప్రతి దస్తావేజులోను, ఆ విషయమై ప్రాంతీయముగా అధికారము పొందిన భూస్వామియొక్క ఏజెంటు చేవ్రాలు చేయవచ్చును లేక సర్టిఫై చేయవచ్చును.

అనుషక్త విధులు.

విధులు చేయుటకు లోకల్ గవర్నమెంటువారికి గల యధికారము.

215. లోకల్ గవర్నమెంటువారు ఈ యాక్టుకు అనుగుణముగా,—

(1) ఈ యాక్టువలనగాని లేక యీ యాక్టు ననుసరించిగాని కలెక్టర్లకును రెవిన్యూ ఆఫీసర్లకును విధింపబడియుండు పనిని జరుపుటలో, వారు అవలంబింపవలసిన చర్యను క్రమపఱుచుటకు విధులను ముందుగా ప్రకటించి చేయవచ్చును; మఱియు అట్టి విధులచే, అట్టి యే ఆఫీసరుకైనను,

(a) వ్యాజ్యెములను విచారించుటలో ఒక సివిల్ కోర్టుచే చెలాయింపబడు ఏ అధికారమునుగాని;

(b) ఏ భూమిమీదనైనను ప్రవేశించుటకు, సర్వే చేయుటకు, (డిమార్కేటు) హద్దులను ఏర్పఱుచుటకు, ఆ భూమి యొక్క పటమును (మాపు) వ్రాయుటకు అధికార

మును, మఱియును. 1897-వ సంవత్సరపు నుద రాసు 4-ది సర్వేయొక్కయు హద్దులయొక్కయు ఆక్టు ననుస రించి యే ఆఫిసరువలనఁగాని చెలాయింపఁదగిన యే అధికారమునుగాని ; మఱియు

(c) నేలయొక్క సత్తువను ఉజ్జాయింపు వేయుటకుఁగాను ఏ భూమిమీఁదనైన పంటలను కోసి నుఱుచుకుటకును, మహా సూలును తూనికవేయుటకును లేక కొలఁతవేయుట కును అధికారమునుగాని,

ఇయ్యవచ్చును ; మఱియు వారు,

(2) ఈ యాక్టు ననుసరించిన కోటీసులకు నమూనాలును, వా నిని జారీచేయువిధమును ఈ యాక్టుచేఁగాని లేక యితరమైన యే యా క్టుచేఁగాని నిర్ణయింపఁబడనపుడు, ఆ నమూనాలును, జారీచేయువిధ మును నిర్ణయించుచును ;

(3) ఈ యాక్టునుబట్టి చేయఁబడు దరఖాస్తులలో అవలంబించ వలసిన చర్యను గుఱించియు ;

(4) ఈ యాక్టు కార్యములకొఱకై చెల్లింపవలసిన (ఫీజులు) రుసుములను, కర్చులను, తగులుబళ్లను గుఱించియు ;

(5) గ్రామస్థులందఱి ఉపయోగార్థము ఏర్పాటు చేయఁబడి యుండు నూర్పిడి కళ్లములను, పశువులకొట్టములను, గ్రామనత్తములను, ఇతర భూములను ఉపయోగించుటకును,

(6) ఏ ప్రదేశములోనైనను ఏ పైరులు ముఖ్యమయిన ఆహా రమునకు ఉపయోగపడు పైరులుగా ఎన్నవలయునో దానిని గుఱించి

నిశ్చయించుటకును, ధరలు పట్టీలను తయారుచేయునట్టి ఆఫీసర్లు వెలిసి నడుచుకొనుటకును :

(7) స్వభావమునుబట్టి త్వరలో చెడిపోఁదగినట్టి జప్తు చేయఁబడిన పంటలనుగాని సామానులనుగాని విక్రయించుటకును ;

(8) భూములను సర్వే చేయుటకును నాని విషయమైన వాక్యముల రెకార్డును పన్నుయొక్క (సెటిల్మెంటు) రెకార్డును తయారు చేయుటకును ;

(9) పన్ను (సెట్టిల్మెంటు) నిర్ణయముయొక్క మొదటి రెకార్డునకు చేయఁబడు ఆక్షేపణలమీఁద ఒక రెవిన్యూ ఆఫీసరు చేసెడి యుత్తరువులపైని ఏ పై రెవిన్యూ అధికారికి అప్పీలు దాఖలు చేసికోవలయునో అట్టి పై రెవిన్యూ అధికారిని నిర్ణయించుచును ;

(10) ఒక కలెక్టరు తనచే విచారింపఁబడి తీర్మానింపఁబడు వ్యాజ్యెములయొక్కయు దరఖాస్తులయొక్కయు రిజిష్టర్లను ఏ నమూనాలో ఉంచవలయునో అట్టి నమూనాను నిర్ణయించుచును ; మఱియు.

(11) సాధారణముగా ఈ యాక్టుయొక్క నిబంధనలను అమలులోనికి తెచ్చుటకును ; విధులను ముందుగా ప్రకటించి చేయవచ్చును.



## మెడూల్యలు (పట్టీ).

### A భాగము.—కలెక్టరుచే విచారింపఁబడదగిన వ్యాజ్యెములు.

| వరుస నెంబరు. | ఆక్టులోని సెక్షను. | వ్యాజ్యెపు వివరము. | కాలావధి. | ఆ కాలము ఎప్పటినుండి ఆరంభించునది | అప్పీలు వేసుకోఁదగిన కోర్టు ఉన్న యెడల అది యేది. |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 1 | 6 | పైకము ఎవనివద్దనుండి పుచ్చుకోఁబడెనో ఆ అక్రమప్రవేశకుని వెడలఁగొట్టుటకు వ్యాజ్యెము... ... | రెండు సంవత్సరములు. ... | పైకి ఋణము పుచ్చుకొన్న తేది లేక పైకము రాబట్టుకొన్న తేది .. | డిస్ట్రిక్టు కోర్టు. |
| 2 | 30 | రైతు చెల్లింపవలసిన పన్నును హెచ్చించుటకు ... ... ... | ఏమియులేదు (37, 41, 177 వ సెక్షనులలోఁబడి) | ఏమియులేదు (37, 41, 177 వ సెక్షనులలోఁబడి) ... ... | |
| 3 | 38 | పన్నును తగ్గించుటకు ... ... | ఏమియులేదు (39, 41, 177 వ సెక్షనులలోఁబడి) | ఏమియులేదు (39, 41, 177 వ సెక్షనులలోఁబడి) ... ... | |
| 4 | 40 | పన్నును (ద్రవ్యరూపముగా) మార్చుటకు. | ఏమియులేదు. | ఏమియులేదు ... ... | (a) డిక్రీ, శిస్తును ద్రవ్యరూపముగా మార్చుటకు సమ్మతించునట్టుగా గాని |

A భాగము.—కలెక్టరుచే విచారింపఁబడఁదగిన వ్యాజ్యెములు. (విశేషము).

| వరుస నెంబరు. | ఆక్టులోని సెక్షను. | వ్యాజ్యెపు వివరము. | కాలావధి. | ఆ కాలము ఎప్పటినుండి ఆరంభించునది. | అప్పీలు పెట్టుకోఁదగిన కోర్టు ఉన్న యెడల అది యెది. |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 8 | 77 | పన్ను బాకీని రాఁబట్టుకొనుటకు భూస్వామి తెచ్చెడిది ... ... | మూఁడు సంవత్సరములు .. | బాకీ చెల్లింపవలసినదిగా ఏర్పడు తేది లేక పన్నును నిశ్చయించుటకుఁగాను వ్యాజ్యము లేక యితర చర్య జరిగియుండినయెడల, పన్ను అఖరుగా నిశ్చయించు డిక్రీ ఉత్తరువు తేది, ఈ రెంటిలో ఏ తేది వెనుక వచ్చినదో ఆ తేది. | డిస్ట్రిక్టు కోర్టు. |
| 9 | 88 | జప్తు చేయఁబడిన యాస్తి దొంగిలి పోయినందుకు, కనఁబడక పోయినందుకు, చెడిపోయినందుకు లేక నశించిపోయినందుకు నష్టికి ... | ఆఱు నెలలు ... | ఆ యాస్తి దొంగిలిపోయిన, కనఁబడకపోయిన, చెడిపోయిన, లేక నశించిపోయిన తేది. | |
| 10 | 95 | జప్తును ఆఁపి [illegible]ంచుటకు రయితు తెచ్చెడిది ... ... | పదు నేనుదినములు | డిమాండు చేయఁబడిన పైకమును చెల్లించుమని లేక వ్యాజ్యెము చేయుమని రయితుకు పంపిన నోటీసు అతనికి అందిన తేది. | |

A భాగము.—కలెక్టరుచే విచారింపఁబడఁదగిన వ్యాజ్యెములు. (విశేషము).

| వ్యాజ్యెపు వివరము. | కాలావధి. | ఆ కాలము ఎప్పటినుండి ఆరంభించునది. | అప్పీలు పెట్టుకోఁదగిన కోర్టు ఉన్న యెడల అది యేది. |
|---|---|---|---|
| 3 | 4 | 5 | 6 |
| పన్ను బాకీని రాఁబట్టుకొనుటకు భూస్వామి తెచ్చెడిది ... ... | మూఁడు సంవత్సరములు .. | బాకీ చెల్లింపవలసినదిగా ఏర్పడు తేది లేక పన్నును నిశ్చయించుటకుఁగాను వ్యాజ్యము లేక యితర చర్య జరిగియుండినయెడల, పన్ను అఖరుగా నిశ్చయించు డిక్రీ ఉత్తరువు తేది, ఈ రెంటిలో ఏ తేది వెనుక వచ్చినదో ఆ తేది. | డిస్ట్రిక్టు కోర్టు. |
| జప్తుచేయఁబడిన యాస్తి దొంగిలిపోయినందుకు, కనఁబడక పోయినందుకు, చెడిపోయినందుకు లేక నశించిపోయినందుకు నష్టికి ... | ఆఱు నెలలు ... | ఆ యాస్తి దొంగిలిపోయిన, కనఁబడకపోయిన, చెడిపోయిన, లేక నశించిపోయిన తేది. | |
| జప్తును ఆపి నుంచుటకు రయితు తెచ్చెడిది ... ... | పదు నేనుదినములు | డిమాండు చేయఁబడిన పైకమును చెల్లించుమని లేక వ్యాజ్యెము చేయుమని రయితుకు పంపిన నోటీసు అతనికి అందిన తేది. | |
| ,, | ,, | ,, | ,, |
| పైకము చెల్లింపక తప్పిపోయిన కొనుగోలుదారునివద్దనుండి రెండవ విక్రయములో వెలనుగురించియు కర్చులను గురించియు తక్కువపడ్డ పైకమును రాఁబట్టుకొనుటకు ... | మూఁడు నెలలు... | విక్రయించు ఆఫీసరుయొక్క సర్టిఫికేటు తేది. | డిటో. |
| అధీనభూమి విక్రయించుటకు హక్కును గురించి వివాదించుటకు ... | ముప్పది దినములు. | పైకము చెల్లింపక తప్పినవానిని బాకీ పైకమును చెల్లించుమని లేక విక్రయపు హక్కును ఆక్షేపించుమ వ్యాజ్యెము చేయుమని పంపిన నోటీసు చేరిన తేది. | |
| పైకము చెల్లింపక తప్పిపోయిన కొనుగోలుదారునివద్దనుండి రెండవ విక్రయములో వెలనుగురించియు కర్చులను గురించియు తక్కువపడ్డ పైకమును రాఁబట్టుకొనుటకు ... | మూఁడు నెలలు .. | విక్రయించు ఆఫీసరుయొక్క సర్టిఫికేటు తేది. | |
| తర్వాతి పన్నును చెల్లించుటకు ... | ముప్పది దినములు. | అధీన భూమియొక్క విక్రయపు తేది. | |
| అన్యాయముగా కక్కసించి తీసినది రాఁబట్టుకొనుటకు ... | ఆఱు నెలలు ... | అధికారము లేనట్టి చార్జికట్టిన తేది. | |
| అధీన భూమి వదలివేయఁబడినపుడు పన్ను నష్టికిఁగాను జవాబుదారి యగుటకు. ... ... | ఆఱు నెలలు ... | వదలివేయఁబడ్డ సంవత్సరమునకు లోబడివచ్చు రయితువారీ సంవత్సర ప్రారంభము. | |

A భాగము—కలెక్టరుచే విచారింపఁబడఁదగిన వ్యాజ్యెములు. (విశేషము).

| వరుస నెంబరు. | ఆక్టులోని సెక్షను. | వ్యాజ్యెపు వివరము. | కాలావధి. | ఆ కాలము ఎప్పటినుండి ఆరంభించును. | అప్పీలు పెట్టుకోఁదగిన కోర్టు ఉన్నయెడల అది యేది. |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 17 | 151 (1) | ఒక రయితును (భూమినుండి) వెడలఁగొట్టుటకు ... ... | రెండు సంవత్సరములు ... | భూమిని (వ్యవసాయమునకు) ఉపయోగము లేకుండచేసిన తేది మొదలు | డిస్ట్రిక్టు. |
| 18 | 151 (2) | చెడిపోయిన లేక నష్టమయినదానికి పరిహారద్రవ్యమునకు లేక యింజక్షనుకు లేక రిపేరుకు ... ... | డిటో ... | చెఱుపు సంభవించినప్పుడు లేక నశించడమునకు ఆరంభము కాఁగానె. | |
| 19 | 153 | అనుభవపు హక్కు లేని రయితును వెడలఁగొట్టుటకు ... ... | ఒక సంవత్సరము | వెడలఁగొట్టుటకు హక్కు కలిగిన తేది. | |
| 20 | 160 | తొలగించుటకుఁగాను పుట్టిన వారంటును రద్దుచేయుటకు ... ... | పదునేను దినములు లేక 159వ సెక్షను ననుసరించి కలెక్టరు హెచ్చించిన కాలము. | వారంటు అందించిన తేది. | |
| 21 | 213 | మఱియొక విధముగా నిబంధింపఁబడని నష్టములకు ... ... | మూఁడు నెలలు. | వ్యాజ్యెపు కారణము ఆరంభమైన తేది | |

B భాగము—డిస్ట్రిక్టు కలెక్టరుచే, కలెక్టరుచే లేక మరియొక రెవిన్యూ ఆఫీసరుచే పరిష్కరింపబడవలసిన దరఖాస్తులు.

| వరుసనంబరు. | ఆక్టులోని సెక్షను. | దరఖాస్తు వివరము. | కాలావధి. | ఆ కాలము ఎప్పటినుండి ఆరంభించునది. | అప్పీలు పెట్టుకోదగిన కోర్టు ఉన్న యెడల అది యెది. |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 1 | 15 | అభివృద్ధిపని చేయుటకయిన హక్కును గురించియు లేక వలానిపని అభివృద్ధిపని గా నున్నదా లేక ఉండునా అనుటను గురించియు. | ఏమియులేదు. | ఏమియులేదు ... | డిస్ట్రిక్టు కలెక్టరు |
| 2 | 16 | అభివృద్ధిపనులను రిజిస్టరు చేయుటను | ఏమియులేదు (16వ సెక్షనులో (3)వ సబ్ సెక్షను కు లోబడి) ... | డిటో ... | రిజిస్టరు చేయుటను నిరాకరించువిషయమయి డిస్ట్రిక్టు కలెక్టరు. |
| 3 | 17 | ఒక అభివృద్ధిపనినిగురించిన సాక్ష్యము రికార్డుచేయుటకు. | ఏమియులేదు ... | డిటో ... | సాక్ష్యమును [illegible] టను నిరాకరించినందుకు డిస్ట్రిక్టు కలెక్టరు. |
| 4 | 25 | యుక్తమైనట్టియు న్యాయమైనట్టియు పన్నును నిర్ణయించుటకుగాను | ఒక సంవత్సరము. | భూమిలోనికి రానిచ్చిన నాడి. ... | డిస్ట్రిక్టు కలెక్టరు. |

**B భాగము.—డిస్ట్రిక్ట కలెక్టరుచే, కలెక్టరుచే లేక మరియొక రెవిన్యూ ఆఫీసరుచే పరిష్కరింపఁబడవలసిన దరఖాస్తులు.**

| వరుసనెంబరు. | ఆక్టులోని సెక్షను. | దరఖాస్తు వివరము. | కాలావధి. | ఆ కాలము ఎప్పటినుండి ఆరంభించునది. | అప్పీలు పెట్టుకోఁదగిన కోర్టు ఉన్నయెడల అది యేది. |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 5 | 32 (2) | పన్నును హెచ్చించినందుకు పునర్విమర్శకొరకు ... | ఏమియులేదు. | ఏమియులేదు. | డిస్ట్రిక్ట కోర్టు. |
| 6 | 42 | వినిర్ణయము ననుసరించి పన్నును మార్చుటకు | డిటో | డిటో | డిస్ట్రిక్ట కలెక్టరు. |
| 7 | 45 | వంశక్రమమువలన లేక న్యాయమైన ట్రాన్స్ఫరువలన కాకుండ మరియొకవిధముగా భూమిని అనుభవములోనుంచుకొనియుండు మనుష్యుడు చెల్లింపవలసిన మొత్తమును నిశ్చయించుటకొరకు | ఒక సంవత్సరము. | అనుభవములోనికి వచ్చిన తేది. | డిస్ట్రిక్ట కోర్టు. |
| 8 | 46 నిబంధన | సెక్షను కార్యమునకుఁగాను భూమియొక్క పన్నును నిర్ణయించుటకుఁగాను | ఏమియులేదు. | ఏమియులేదు. | డిస్ట్రిక్ట కలెక్టరు. |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 9 | 42 (8) | అనుభవపు హక్కు లేని రైతును వెడల గొట్టుటకుగాను. . | చేసిక గా వెంబడివచ్చు రెవిన్యూ సంవత్సరారంభమును ముప్పదివారము | హెచ్చింపబడిన పన్నును చెల్లించుటకు రైతుకు నోటీసు అందజేసినతర్వాత ఒక నెల గడచిన తేది. | డిస్ట్రిక్టు కలెక్టరు. |
| 10 | 54 | కలెక్టరు ఆఫీసులోఁగాని లేక మఱి వేఱె ఆఫీసరుయొక్క ఆఫీసులోఁగాని పట్టాను దాఖల్ చేయుటకై సెలవుకొఱకు. ... | ఒక సంవత్సరము. | పట్టా యే రెవిన్యూ సంవత్సరమునకు సంబంధపడుచున్నదో ఆ రెవిన్యూ సంవత్సరముయొక్క ఆరంభము. | |
| 11 | 68 | కలెక్టరు ఆఫీసులోఁగాని మఱి వేఱె ఆఫీసరు యొక్క ఆఫీసులోఁగాని పన్నును ధరావతు చేయుటకై సెలవుకొఱకు. | ఆఱు నెలలు | పన్ను ఏ తేదిని చెల్లింపవలసినదో ఆ తేది ... ... | |
| 12 | 71 (3) | ధరావతు చేసిన పన్నును వాపసుచేయుటకు ... ... | ఏమియు లేదు. | ఏమియు లేదు ... ... | [illegible] లేదు. |
| 13 | 74 | మదింపుచేయుటకు, లేక భాగించుటకు ఆఫీసరును పంపుటకొఱకు ... | డిటో | డిటో ... ... | |
| 14 | 89 | జప్తు అయిన యాస్తిలో హక్కు లేక బాధ్యత కలిగియుండు మూఁడవ మనుష్యునివలన తేఁబడినది ... | ముప్పది దినములు. | జప్తు తేది ... ... | |
| 15 | 90 | జప్తును తప్పించుటకై దగాగా తీసికొనిపోయిన యాస్తిని ఒప్పగించుటకు లేక అట్టి యాస్తియొక్క వెలను ఇచ్చుటకు ... | ఆఱు నెలలు. | బాకీ చెల్లింపవలసినదిగా ఏర్పడిన తేది. | |

B భాగము.—డిస్ట్రిక్టు కలెక్టరుచే, కలెక్టరుచే లేక మరియొక రెవిన్యూ ఆఫీసరుచే పరిష్కరింపఁబడవలసిన దరఖాస్తులు.

| వరుస నెంబరు. | ఆక్టులోని సెక్షను. | దరఖాస్తు వివరము. | కాలావధి. | ఆ కాలము ఎప్పటినుండి ఆరంభించువది. | అప్పీలు పెట్టుకోఁదగిన కోర్టు ఉన్నయెడల అది యేది. |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 16 | 90 | దౌర్జన్యముగా లేక రహస్యముగా ఎత్తికొనిపోయిన జప్తు ఆస్తిని మరల ఇచ్చివేయుటకు లేక అట్టి యాస్తియొక్క వెలను ఇచ్చుటకు ... | ముప్పది దినములు. | జప్తు ఆస్తిని దౌర్జన్యముగా లేక రహస్యముగా తీసికపోఁబడిన తేది ... | ఏమియు లేదు. |
| 17 | 109 (5) | జప్తుకర్చులనుగుఱించి నిశ్చయించుటకు | మూఁడు నెలలు. | విక్రయించుఆఫీసరుయొక్క తీర్పు తేది. | డిటో |
| 18 | 114 | అధీనభూమిని విక్రయించుటకు ... | 115 వ సెక్షనులోవలె | 115 వ సెక్షనులోవలె ... | డిటో |
| 19 | 131 | అధీన భూమియొక్క విక్రయమును రద్దుచేయుటకు ... | ముప్పది దినములు. | విక్రయపు తేది ... ... | డిటో |
| 20 | 133 | బాకీని చెల్లించుటకు అవకాశము ఇచ్చుటకు ... ... | డిటో | విక్రయముయొక్క చాటింపు తేది... | డిటో |
| 21 | 137 | 137 వ సెక్షనును అనుసరించి నీటిపాఱుదల పనికి మరమ్మతు చేయుటకై ఉత్తరువుమీఁద భూస్వామిచే | ఏమియు లేదు. | ఏమియు లేదు ... | డిస్ట్రిక్టు కోర్టు. |
| 22 | 137 | భూస్వామి తప్పినయెడల పనులు జరుపుట రయితులవలన ... | డిటో | ఏమియు లేదు ... | జరుపుటకు అధికారము ఇయ్యక నిరాకరించిన విషయములో డిస్ట్రిక్టు కోర్టు. |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 23 | 230 | నీటి పాటుదల హక్కుయొక్క మరమ్మతుకుగాను అయిన ఖర్చులు బడిని రాబట్టుకొనుటకు ... | మూడు సంవత్సరం | మరమ్మతు పూర్తి అయిన తేది ... | డిస్ట్రిక్టు కోర్టు. |
| 24 | 141 | నీటి పాటుదల గల లేక నీటిపాటుదల లేని రేటును నిర్ణయించుటకు ... | ఏమియు లేదు. | ఏమియు లేదు ... | డిస్ట్రిక్టు కలెక్టరు. |
| 25 | 145 (2) | అధీనభూమి ఉపభాగములుగా భాగింపబడినప్పుడు లేక ట్రాన్స్ఫరు అయినప్పుడు పన్ను నిర్ణయించుటకు ... ... | మూడు మాసములు | ఉపభాగములు చేసిన లేక ట్రాన్స్ఫరు అయిన తేది ... | |
| 26 | 149 (1) | భూస్వామి చేసిన పన్ను విభాగముయొక్క పునర్విమర్శకుగాను ... | ఆరు మాసములు. | భూస్వామియొక్క తీర్మానము రయితుకు తెలిసిన తేది ... | |
| 27 | 158 | భూమియందు ప్రవేశించి దానిని స్వాధీనపర్చుకొనుటకు వారంటును జారీచేయుటకుగాను ... | మూడు మాసములు | బాకీ చెల్లింపవలసియున్న రివిన్యూ సంవత్సరము గడచిన తేది ... | |

# TELUGU LAW BOOKS

## తెనుగు చట్ట పుస్తకములు

### మధుకరవేణి విలాస బుక్ డిపో,

నెం. 42, గంగాధరేశ్వర అగ్రహారం,

వేపేరి పోస్టు, మదరాసు.

ఇందులో యుండిన పుస్తకములకు వీ. పీ. ఆర్డర్లు నిచ్చువారు తమ పేరు, గ్రామము, పోస్టాఫీసు, తాలూకా, జిల్లాను విశదముగా వ్రాయవలెను. ప్రస్తుతము తపాలు చార్జి అధికమయినందువలన 8 అణాలకు తగ్గిన విలువగల పుస్తకములకు ఆర్డరు చేయువారలు పుస్తకక్రయమును తపాలు చార్జియున్ను ముందుగ తపాలు బిళ్లలు (స్టాంపులు) గా పంపిన యెడల కావలసిన పుస్తకములను బుక్ పోస్టు మూలముగా పంపబడును. ఇందులో కనిన వెలతో వీ. పీ. ఖర్చులు పుస్తకములను తీసుకొనువారే భరించుకొనవలయును.

తక్కినవారలకు వీ. పీ. మూలముగా పంపబడును.

## వ్యవహార చింతామణి, (అను దస్తావేజు లేఖరి.)

రూ. 2 8 0

ఇందులో (సవరణచేయబడిన) స్టాంపు ఆక్టు, రిజిస్ట్రేషను ఆక్టు, కాలనిర్ణయచట్టము, వచ్చుబడి పన్ను రేట్లును, కోర్టుఫీసుల రుసుములును

పత్రములయొక్క గురుతులున్ను, పత్రములు వ్రాయు విధములున్ను, దాని మరతులున్ను, దానికి అతకడమునకు యింత స్టాంపు కావలయు ననిన్ని, అప్పుపత్రము, కుదువపత్రము, బాడుగపత్రము, అనుభవము, ఒడంబడిక, జామీను, పారికత్తు, పరిశీలన, స్వీకారము, స్వీకార అధికారము, ముచ్చిలికా, అధికారపత్రము, వకాలతు, పవర్ ఆఫ్ అటర్ని, విడుదలపత్రము, గుత్తపత్రము, హామివుగలపత్రము, విక్రయము మొదలయిన 50 విధముల పత్రములున్ను, ఒక్కొక పత్రమునకు, 3, 4 విధములుగా వ్రాసెడు పద్ధతులున్ను, ఆయా గ్రామములలో ఉపయోగించెడు భాషల ప్రకారముగానున్ను, ఇంకను ఉపయోగపడెడు సకలమైన ప్రతి వ్యవహారములున్ను అణగియున్నవి.

---

## చెన్నపురి రాజధాని జమీను
## రైతు భూముల చట్టము. రూ. 1 4 0

ఇది జమీను, మిట్టా, శ్రోత్రియము, ఇనాము గ్రామములలో యుండు రైతులకు గల బాధ్యతలు, భూమిని చక్కపరచి వృద్ధిచేయ నపుడు జమీందారు అధిక శిస్తు విధించకూడదనడము, అక్రమముగా అధికశిస్తు విధించినప్పుడు, కలెక్టరు మొదలైన రివిన్యూ అధికారులకు అప్పీలుచేసి వజా చేసుకొనవచ్చుననడము, జమీనులోయుండు చెరువు కాలవ మొదలయిన జలాధారములను జమీందారు శుభ్రము చేయవలసినదనడము, పొలమును సర్వేచేసి తగినట్లు కిస్తి విధించడము, పట్టా యివ్వడము, ముచ్చిలిక తీయడమును, గుత్తవ బాకినిగురించి జప్తి చేయడమును, వసూలు చేయడమును, బీడు లేక పంట పండనప్పుడు కిస్తీని వజా చేయడము, ఇంత పన్నుమాత్రమే పొలముపైన విధించ

వచ్చుననడమయిన పలు విషయములున్ను, ఇందులో జమీందారు రైతులకు గల రైతు వ్యవసాయ బాధ్యాబాధ్యతలున్ను విశదముగా వ్రాయబడియున్నవి.

---

## క్రొత్త ఇన్‌కంటాక్సు (వచ్చుబడిపన్ను) చట్టము.

ఇందులో పన్ను విధించతగిన వరుమానము, పలాని పలాని విషయములను మొత్తవరుమానమునుండి తోసి దూపెట్టవచ్చు ననడము, పన్ను విధించడమునుగురించి విచారణ, వరుమానమునకు స్టేట్‌మెంటు పంపడము, పన్ను ఎప్పుడు చెల్లించవలసిననడము, తప్పు లెక్క ఇచ్చినట్టులయితే దండుగ పన్ను విధించడము, ప్రాసిక్యూషను చేయడము, పొదువైన ధర్మకార్యములయొక్క వరుమానమునకు ఇన్‌కంటాక్సు లేదనడము, ఇన్‌కంటాక్సు అప్పీలు, సూపర్‌టాక్సు పన్ను వసూలుచేయడము మొదలయిన విషయములు చెప్పబడియున్నవి. రూ. 1 0 0

---

## క్రొత్త గ్రామ పంచాయతి కోర్టు ఆక్టు.

రూ. 1 4 0

ఇది 1920–వ సంవత్సరపు 2–వ ఆక్టువలన సవరింపబడిన 1890–వ సంవత్సరపు ఆక్టు. దీనియందు పై ఆక్టు ఈ యిలాకా నేటిదినము వరకుగల క్రొత్త విధులతో చేర్చి ముద్రింపబడియున్నది. దీనియందు పంచాయతీ కోర్టులను స్థాపించుటయు, ఆ సంబంధమైన మెంబర్లను ఎన్నుకొను విధులను, ఈ కోర్టు ప్రెసిడెంటుయొక్క అధికారమున్ను, వ్యాజ్యముల తీర్పుకాబడి వివరము మొదలగు ముఖ్యాంశములతో నిండియున్నది. 1929–వ సం॥పు 15–వ ఆక్టుల సవరణలు చేర్చబడినది. ఎక్కువ యుపయోగకరమయినది.

# క్రొత్త గ్రామ మునసబు (మాన్యూల్) చట్టము

## ప్రథమభాగము రూ. 1 8

1920-వ సం॥పు 2-వ ఆక్టును, 1929- సం॥పు 15-వ ఆక్టుల యనుసరించి క్రొత్త సవరణలు చేర్పబడినది.

సివిల్ క్రిమినల్ అధికారములు హెచ్చించబడియున్నది.

ఇందులో గ్రామ మునసబు పరీక్షకు చదివెడివారలు గ్రామ మునసబులు, కరణములు, గ్రామ పంచాయతీకోర్టువారలు, వీరలకు సంబంధపడిన సివిల్ క్రిమినలు విషయాదుల నూతనచట్టములున్ను చేర్చి యీ తారీఖువరకు సర్కారువారలచే సవరించబడిన ప్రకారము ముద్రించి యున్నారము. కొందఱు గ్రామమునసబు పనికిగాను పరీక్షకు పోవుటకు ఏదైన సంగ్రహమైన పుస్తకమును చదివి, పిమ్మట గ్రామ మునసబు పనికి వచ్చినదే నడవడికలు నడిపించుటకు తెలియక మిణకరించి ముందు తీసిన పుస్తకము ప్రయోజనపడకనే మరల గ్రామ మునసబు మాన్యూలును తీయుటకు సందర్భించుచున్నది. పరీక్షకు పోవునపుడే ఈ పుస్తకమును తీసి చదివి ధైర్యముతో గ్రామమునసబు పనికివచ్చిపిమ్మట వ్యవహార నడవడికలకు ఈ పుస్తక మెక్కుడు ప్రయోజనకరమైనదిగా యుండును. గ్రామ మునసబు కోర్టులోను, గ్రామ పంచాయతీ కోర్టులోను రూ. 50 వరకు వాది స్వేచ్ఛగాను, రూ. 200 వరకు వాది, ప్రతివాది ఇరువురున్ను సమ్మతపడిన్ని దావా చేసెడి మిరాశీదారులు వ్యాపారులు కంట్రాక్టరులు మొదలయిన వారలున్ను ఈ పుస్తకమును కొనుక్కొనియుండవలసినది మిక్కిలి ఆవశ్యకము.

## రెండవ భాగము గ్రామ సుఖాధారము అణాలు 2

ఇది గ్రామ మునిసీపులు, గ్రామ కరణములు గ్రామమున వాంతి బేది అమ్మవారు మొదలయిన అంటు వ్యాధులు రాకుండా గ్రామమును శుచికరము చేయవలసిన దోవలున్ను, వ్యాధులు వచ్చిన వానిని నివర్తి చేయడమునకు దారులున్ను, యెద్దు మొదలయిన కాళ్లు నశతగల జీవములకు వ్యాధులు రాకుండా కాపాడవలసిన దోవలున్ను, బావి, గుంట, కాలువ, వీటిని శుద్ధముగా పెట్టవలసిన నిబంధనలున్ను, పాము, తేలు కుట్టు విషము పుండు మొదలయిన ఆపదలనుంచి తప్పించుకోవడమునకు కావలసిన విధములున్ను దీనిలో చెప్పబడియున్నది.

---

## స్టాంపు ఆక్టు. అణాలు 12

దీనిలో ఫలాని ఫలాని దస్తావేజులకు యింత పైకముగల స్టాంపులు కావలయుననిన్ని స్టాంపు అతికించకుండా పత్రములు వ్రాయడము తప్పిదమనిన్ని, ఫలాని ఫలాని విషయములకు స్టాంపు అక్కరలేదనిన్ని, వ్రాసిన వెనుక వుపయోగము లేకపోయిన స్టాంపును మరల కలెక్టరుకు పంపి దాని క్రయమును మరల తీయవచ్చుననిన్ని దీనిలో తెలియపరచియున్నది.

---

## రిజిస్ట్రేషను ఆక్టు. అణాలు 10

దీనిలో అనేక విధములైన పత్రములకున్ను, ఉయిలు మొదలైన వాటికిన్ని రిజిష్టరు తీర్వ యింత యివ్వవలయుననిన్ని, అవశ్యముగా రిజిష్టరు చేయవలసిన దస్తావేజులు ఫలానివనిన్ని, రిజిష్టరు అవశ్యములేని

దస్తావేజులు ఫలానివనిన్ని, ముఖ్యముగా రిజిష్టరు చేయవలసిన విధము లున్ను, పత్రములకు నకలు తీసేవిధమున్ను, రిజిష్టరుచేసే ఉద్యోగస్థుని చేటాకట్టి ఇంటికి రప్పించి రిజిష్టరు చేయించడము మొదలైన అనేక విషయములు దీనిలో అణగినయ్యున్నవి.

## కాలనిర్ణయ చట్టము. అణాలు 8

దీనిలో వ్యాజ్యములు, అప్పీళ్లు, మనవు మొదలైనవి దాఖలు చేయడమునకు ఇంత కాలమువరకు చెల్లుననిన్ని, ఫలాని ఫలాని పత్రములున్ను, ప్రామిస్సెరీ నోట్లున్ను లావాదేవి అప్పులున్ను, అంగడి లెక్క యప్పులున్ను, ఇంటి బాడుగలున్ను, గుత్తవ అప్పులున్ను మొదలైన అనేక విషయములున్ను, వసూలు చేయడమునకు ఇంత కాలము వరకు చెల్లుననిన్ని, అయితే మైనరు, పయిత్యగాడు, దేశసంచారిగా జీవించువాడు, జెయిలులో అణగియుండువాడు మొదలైనవార్లకు అధిక కాలము ఇవ్వబడియున్నదనిన్ని దీనిలో అణగియున్నవి.

## నేల ఆక్రమింపు చట్టము. అణాలు 4

పట్టాదార్లు సొంత నేలకు సమీపముగా పోరంబోకు సర్కారు నేలలో తెలిసి తెలియక పంట పెట్టినట్లయితే అట్లు పంటచేసిన నేలకు సర్కారులో అధికముగా ఒకటింటికి పది, నూరు అని కఠినముగా పన్ను వసూలు చేసుకొనివచ్చినదానిని ఒక కేసులో ఘనం హైకోర్టు జడ్జి భాషియమయ్యంగార్ వారు అట్లు వసూలు చేయడము తప్పు నిబంధనలనిన్ని అట్లు వసూలు చేయుటకు సర్కారుకు అధికారము లేదనిన్ని తీర్మానము చేసిన దానిపైగా, పై నిబంధనలు కలుగచేయబడినది. ఈ నిబంధ

నములో కర్ణం మొదలైన గ్రామ అధికార్లు ఫలాని ఫలానినేల పోరంబోకు అని కాపులకు తెలియజేసి గూటాలుకొట్టి చూపించవలయుననిన్ని, అట్లు తెలిపించకుండా వ్యర్థముగా త్రవ్వకు కొంచుకవచ్చేది తప్పితమనిన్ని, చూపించబడినదిగాను ఇంకా కాపులకు సాధకమయిన అనేక విషయములు చెప్పబడియున్నది.

---

## ఇండియన్ పీనల్ కోడు. రూ. 2 8 0

ఇందులో పలాని పలాని కార్యములు చట్టవిరుద్ధమయిన నడతలుగా భావించి వాట్లను చేయువాడు నేరస్థుడుగ యేర్పడు ననడము, ఆయా నేరములకు మొదటితూరి పలాని దండన విధించబడును. రెండవతూరి లేక పైబడి నేరముచేసినయెడల పలాని దండనలు విధించబడుననడము, పలాని పలాని సమయమందు చేయుకార్యములు నేరముకాదనడము మొదలయిన విషయములు అణగియున్నవి. బహు కఠినమయిన భాగములను వుదాహరణములచే తెలియపరచిన్ని, సులభముగా తెలిసికొనడమునకు అనేక చోట్లలో వ్యాఖ్యానములచే వివరించిన్ని వ్రాయబడియున్నది. ఇది గ్రామ పంచాయతీ కోర్టువార్లకు ముఖ్యమైనది.

---

గ్రామ మునిసీపులకున్ను గ్రామ పంచాయతి కోర్టులకున్ను కావలసిన

| | | | | | |
|---|---|---|---|---|---|
| క్యాలండరు (పారము) | ... | 50_కి | 0 | 10 | 0 |
| డిక్రీ జారీచెర్చు మనుపుపారము | ... | 50_కి | 0 | 10 | 0 |
| పిర్యాదు ప్లయింటు పారము | ... | 50_కి | 0 | 10 | 0 |
| నకల్ మనువు | ... | 50_కి | 0 | 10 | 0 |
| ఏల యిస్తెయారు పారము | ... | 50_కి | 0 | 10 | 0 |
| వాకమూల పారము | ... | 50_కి | 0 | 10 | 0 |
| సివిల్ కేస్ డాకెట్ పారము | ... | 50_కి | 0 | 10 | 0 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| క్రిమినల్ కేస్ డాకెట్ ఫారము | ... | 50-కి | 0 | 10 | 0 |
| 14-సెక్షను ప్రకారము సమ్మతి లిఖితము | ... | 50-కి | 0 | 10 | 0 |
| ,, ప్రతివాదికి నోటీసు | ... | 100-కి | 0 | 10 | 0 |
| సీవిల్ ప్రతివాది సమ్మను | ... | 100-కి | 0 | 10 | 0 |
| సీవిల్ సాక్షి సమ్మను | ... | 100-కి | 0 | 10 | 0 |
| క్రిమినల్ సాక్షి సమ్మను | ... | 100-కి | 0 | 10 | 0 |
| దండనగలవాని సమ్మను | ... | 100-కి | 0 | 10 | 0 |
| జప్తి నిబంధన ఫారము | ... | 100-కి | 0 | 10 | 0 |
| సీవిల్ వాదికి మళ్ళీ వాయిదా నోటీసు | ... | 100-కి | 0 | 10 | 0 |
| క్రిమినల్ వాదికి మళ్ళీ వాయిదా నోటీసు | ... | 100-కి | 0 | 10 | 0 |
| డిక్రీ నెరవేర్చుటకు ఆక్షేపణ వేసే ప్రతివాదికి నోటీసు | | 100-కి | 0 | 10 | 0 |

# సర్కారు కిస్తి చెల్లించడమునకు
# కిస్తు రశీదు బుక్కు.

కిస్తి రసీదు పుస్తకములు కావలసినవారు వాయిదాలకాలము రెండు నెలలుముందుగానే మాకు వ్రాసి తెప్పించుకొనవలయును. లేని యెడల వాయిదాలు సమీపించినపుడు సెలవు యెక్కువగుటచే ఒకవేళ లభించకపోవుట తటస్థించును.

| | | | | | |
|---|---|---|---|---|---|
| (రసీదు) పుస్తకము | ... | 1-కి | 0 | 0 | 6 |
| డిటో | ... | 100-కి | 2 | 8 | 0 |
| డిటో బైండు పుస్తకము (50-పుటలు) | ... | 1-కి | 0 | 4 | 0 |
| డిటో 100-పేజీలు | ... | 1-కి | 0 | 8 | 0 |